# కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి జీవితం-సాహిత్యం



త్రిపురనేని సుబ్బారావు



తెలుగు విశ్వవిద్యాలయం
కళాభవన్, హైదరాబాదు

# కవిరాజు
# త్రిపురనేని రామస్వామి చౌదరి
# జీవితం - సాహిత్యం

రచన

త్రిపురనేని సుబ్బారావు




తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు



సౌజన్యం, సంస్కారం మూర్తీభవించిన

చిరకాల మిత్రుడు

శ్రీ నర్రా కోటయ్యగారికి

# పీఠిక

మహాపురుషుల కోవకు చెందినవారు కవిరాజు త్రిపురనేని రామస్వామి దరిగారు. మూడు సంవత్సరాలు 'సూతాశ్రమ' విద్యార్థిగా వారి వద్ద కావ్యాధ్య నం చేశాను. వారి సాహిత్యం ఎందరికో క్రాంతి పథాన్ని చూపించింది. ఆ లబ్ధి ందిన వారిలో నేనూ ఒకణ్ణి. ఆయన కీర్తి శేషులై నాలుగు దశాబ్దాలు దాటింది. లోగా వారి జీవితాన్ని గురించి, సాహితీ విశేషాలను గురించి జరుగ వలసినంత శోధన జరుగలేదు.

ఏ కవి అయినా, రచయిత అయినా సమకాలీన సమాజ ప్రభావం నుండి ర్తిగా బయట పడలేదు. వర్తమానంలో ఉంటూనే భవిష్యత్తును దర్శిస్తారు. కు దర్శనీయం చేస్తారు. కలకాలం నిలిచిపోగల దివ్యసందేశాన్ని భావితరాల రికి అందజేస్తారు.

ఈ నాటి సామాజిక స్థితిగతులనూ, విలువలనూ ఆధారం చేసుకొని, గతం నోని ఉద్యమాలను గాని, సాహిత్యాన్నిగాని విమర్శించడం భావ్యంకాదు. ఈ నాడు వ్యావహారిక భాషావాదం మనకు చాలా తేలికగా కనిపించవచ్చు. కాని, దుగు రామమూర్తిగారి కాలంలో అలాకాదు. వ్యావహారిక భాషా ప్రచారం సం వారు ఎన్నోకష్టాల నెదుర్కొన్నారు. గ్రాంధికవాదులైన దిగ్గజాలవంటి పండితులతో హోరాహోరిగా సాహిత్య సమరాలను జరిపారు. ఆనాడు గిడుగు రామమూర్తిగారే లేకపోతే, ఈ నాడు వ్యావహారిక భాషకు ఇటువంటి ప్రాచుర్యం వచ్చి ఉండేదికాదు.

ఇదేవిధంగా వీరేశలింగం పంతులు గారు స్త్రీ పునర్వివాహోద్యమాన్ని ఆ నాడు ప్రారంభించి ఉండకపోతే, ఈ నాడు సాంఘిక జీవితం ఎంత అల్లకల్లో లంగా ఉండేదో మనం ఊహించలేం. వీరేశలింగం పంతులుగారి ఉద్యమాన్ని మొగ్గలోనే త్రుంచివేయాలని, విశ్వప్రయత్నాలు జరిగిన సంగతి ఈతరం వారికి తెలియక పోవచ్చు. కాని వారి సంస్కరణోద్యమ ప్రభావం వల్లనే ఆధునిక సమాజంలో స్త్రీ పునర్వివాహమన్నది ఒక సమస్య కాకుండా పోయింది.

ఈ మహనీయులకోవలో చేరినవారే కవిరాజు త్రిపురనేని రామస్వామిగారు. రమారమి మూడు దశాబ్దాల పాటు వారు సమకాలీన సమాజంతో ఘర్షణపడ్డారు. ఎన్నో ప్రతిఘటనలను ఎదుర్కొన్నారు. అప్పటి సాంఘిక వాతావరణం ఎంత కల్మష భూయిష్టంగా ఉండేదో, ఇప్పటి తరంవారికి తెలియదనడం సాహసంకాదు. ఆరోజుల్లో కులాల మధ్యగల సరిహద్దులు మరింత విస్పష్టంగా ఉండేవి. జన్మతోనే కొందరికి ఆధిక్యత. మరికొందరికి అనాధిక్యత సంక్రమిస్తుందన్న నమ్మకాలు విరివిగా ప్రచారంలో ఉండేవి. శుభాశుభ కార్యాలలో పురోహిత వర్గం వారికి ఆధిపత్యం ఉండేది, ఈ విధానాన్ని ఆంధ్ర దేశంలో తొలిసారిగా బ్రద్దలుకొట్టినవారు త్రిపురనేని రామస్వామిగారు.

కవిరాజుగారు వ్రాసి ప్రకటించిన గ్రంథాలు తొమ్మిది మాత్రమే. ఈ తొమ్మిది పుస్తకాలు తొమ్మిది రత్నాల వంటివి. ఈ నవరత్నాలకు విలువ గట్టడం సాహసమే ఔతుంది! తొమ్మిది పదుల పుస్తకాలు వ్రాసినవారు కూడా నామరూపాలు లేకుండా పోయిన సందర్భాలు ఉన్నాయి. కవిరాజుగారి ఈ తొమ్మిది పుస్తకాలు శాశ్వతంగా నిలవడానికి కారణమేమిటి? ఆ పుస్తకాలలోని సామాజిక స్పృహ, హేతువాద దృష్టి, భావవిప్లవం ప్రధాన కారణాలుగా కన్పిస్తున్నది. అంతేగాదు, వేమన వలే తమ కవితనే సాధనంగా చేసుకొని, సంఘాన్ని సంస్కరించాలని కవిరాజులోని తపన, చిత్తశుద్ధి, ఋజువర్తన కూడా అందుకు దోహదం చేశాయి.

మానవుడు జన్మతః హేతువాది. ప్రతిదాని హేతువును గురించి ప్రశ్నించి, సమాధానం తెలుసుకోవడం ద్వారానే, మానవుడు అభివృద్ధిని సాధించ గలుగుతున్నాడు. కల్లబొల్లి కాల్పనిక సాహిత్యం ఈ హేతువనే దీపకళికను మసిబారేటట్లు చేసింది. కవిరాజుగారి ఈ నవరత్నాలు మానవునిలోని ఆదీపకళికను ఆవరించిన మసిని, మసని తొలగించి వేశాయి. ఆహేతువాద జ్యోతిని జాజ్వల్యమానం చేశాయి. ఈ కారణం చేతనే ఆపుస్తకాలు నేటికీ నిలిచి ఉన్నాయి. ఈ కారణం చేతనే కవిరాజుగారు ఈ నాటికీ జీవించి ఉన్నారు.

రామస్వామిగారి వర్ధంత్యుత్సవాల సందర్భంలో ఆంధ్ర జ్యోతి, గోలకొండ, ఆంధ్ర ప్రభ మొదలైన దిన పత్రికలలోను, స్రవంతి మాసపత్రికలోను 1960

సంవత్సరం నుండి 1962 సంవత్సరం వరకు నేను కొన్నివ్యాసాలు ప్రకటించాను. ఆవ్యాసాలను చదివిన ఆనాటి పెద్దలు కొంతమందీ, పూజ్యులు తాపీ ధర్మారావు గారు. శ్రీ గోపీచంద్, డాక్టర్ రావూరి భరద్వాజ, శ్రీ నర్రా కోటయ్య ప్రభృతులు కవిరాజు జీవిత- సాహిత్యాలపై సాధికారికమైన ఒక గ్రంథం వ్రాయాలని నన్ను ప్రోత్సహించారు. అయితే, అది నేననుకొన్నంత సులభంగా కన్పించలేదు.

సూతాశ్రమ అంతేవాసిగా నాకు కవిరాజు గారిని గురించి కొన్ని విషయాలు మాత్రమే తెలుసు. గ్రంథ రచనకు ఆసమాచారం చాలదు. అందుచేత వారి జీవిత వివరాలను సేకరించడం కోసం చాలా వ్యయ, ప్రయాసలకు లోనుగావలసి వచ్చింది. ఎన్నో గ్రంథాలయాలకు, పత్రికా కార్యాలయాలకూ వెళ్ళి, పాతపత్రికల సంపుటాలను పరిశీలించాను. 1914 సంవత్సరం నుండి 1917 సంవత్సరం వరకూ రామస్వామిగారు డబ్లిన్ నుండి ఆనాటి కృష్ణాపత్రిక సంపాదకులైన ముట్నూరి కృష్ణారావు గారికి వ్రాసిన లేఖలు పరిశోధించి ఒక చోటికి చేర్చాను. ఆనాటి కవిరాజుగారి స్నేహితులను కలుసుకొని, దూరంగా ఉన్నవారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి, మరికొన్ని విషయాలను సమీకరించాను. కవిరాజు రామస్వామిగారిని గురించి కవులు, పండితులు, సంస్కర్తలు, ప్రముఖ రచయితలు వెలిబుచ్చిన అభిప్రాయాలను సంతరించాను,

ఆనాడు పత్రికలలో ప్రకటించిన నా వ్యాసాలను చూచిన పండిత గొట్టిపాటి వెంకట సుబ్బయ్యగారు, ఘంటసాల నుండి నాకు వ్రాసిన లేఖలో-''కవిరాజుగారిని గురించి మీరు చాలా శ్రమచేశారు. వారిని గురించి ఆంధ్రలోకానికి ప్రథమంగా తలిపిన ఖ్యాతి మీదే'' అని నన్ను ఉత్సాహ పరిచారు.

కవిరాజు త్రిపురనేని రామస్వామిగారి శతజయంతి ఉత్సవాలు మన రాష్ట్రం లోనే గాకుండా, ఇతర రాష్ట్రాలలో కూడా జరుగుతున్నాయి. ఈ సందర్భంలో తెలుగు విశ్వవిద్యాలయం వారు ''కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి - జీవితం - సాహిత్యం'' అనే గ్రంథం ప్రచురించడానికి పూనుకోవడం ఎంతైనా సముచితంగా ఉంది. అందుకు ఆ విశ్వవిద్యాలయ కులపతి ఆచార్య తూమాటి దొణప్ప గారికి కృతజ్ఞతలు.

ఒకప్పుడు, అగ్గలంగా ఉండే ఉత్తమ లక్షణాలు, రానురాను, అపురూపం అయిపోతున్నాయి ఎక్కువ మందిలో. అయినా - ఆ విలువలను, హస్తార్పితంగా

పదిలంగా కాపాడుకొంటున్నవారు-సంఖ్యాపరంగా తక్కువే కావచ్చుగాని
క్కడా ఉన్నారు. వారిలో నా మిత్రులు శ్రీ నర్రా కోటయ్యగారొకరు.
వర్గాల, బడుగు వర్గాల కన్నీటి గాథలు ఈ నామిత్రునకు తెలును. ఆకలి
ఆర్తి తెలుసు. అవసరం తెలుసు. ఆవేదన తెలుసు. కనుకనే,
లేని సమాజం కావాలని ఆయిన కోరుకొంటున్నాడు. నీతి, నిజాయితి రుజువ
చిత్తశుద్ధి, సంస్కారం, సహృదయత - ఈ సాధనాలతో సామాజిక ర
సంస్కరించాలన్న సంకల్పబలం ఉన్నవారు. కనుకనే - సంస్కర్త క
జీవిత- సాహిత్యాలను వింగడించే ఈ గ్రంథాన్ని- ఈ నా మిత్రునకు 'ఉప
ఇస్తున్నాను.

కవిరాజు రామస్వామిగారిని గురించి ఇంకా విస్తృత ప్రాతిపదిక మీ
శోధన జరపాలనుకొనే ఉత్సాహవంతులకు, ఈ గ్రంథం కరదీపికగా ఉప
పడితే, నా కృషి ఫలించినట్లుగానే భావిస్తాను.

కవిరాజ సాహితీ సదనమ్
హైదరాబాదు - 890

—త్రిపురనేని సుబ్బా

# ఉ త్త మ కృ షి

శ్రీ సుబ్బారావు గారు చేసింది చాలా మంచిపని. ఇది చాలా అవసర కూడా.

పరిశోధనతో వ్రాసిన తెలుగుకవుల చరిత్రలు బహుస్వల్పం. ంగంపంతులు గారు ఎంతో శ్రమించి, శోధించి, ఆంధ్రకవుల ను తెలుగులోకానికి అందించారు. అయినా కవుల జీవిత చరిత్ర ండం ఆంధ్రదేశానికి అంతగా అలవాటుకాలేదు. ఉన్న కొన్ని గూడా ్రమైనవి, శాస్త్రీయమైనవికావు. అందులకు కారణం చారిత్రిక దృక్పథం ్రిలలో అంతగా అలవడకపోవడమేనేమో అని, అనిపిస్తుంది నాకు.

ప్రఖ్యాతకవుల, ప్రముఖ రచయితల జీవితగాథలను, రచనలను ్రంగా పరిశీలించవలసివుంది. వారి జీవిత వివరాలు, వారిని ప్రభా చేసిన సంఘటనలు, సన్నివేశాలు, వారు పుట్టి పెరిగిన కాలమాన తులు, వారు ప్రసరింపచేసిన భావవీచికలు, వాటి మూల కారణాలతో వివరించే గ్రంథాలు మనకు కావాలి. అవి విమర్శలుగానే కాక, చరిత్ర రూపొందాలి. ఒక దృక్పథాన్నేకాక, సత్యమైన సమగ్ర రూపాన్ని ిత్రించాలి.

ఇక, త్రిపురనేని రామస్వామి గారు రచయితలతో కవిరాజు, షులలో మహామనీషి. రచనలో తెలుగుకు తెలుగుతనానికి, తెలుగు నుడికారా ప్రాధాన్యతనిచ్చిన సిసలైన తెలుగుకవి. ఆంధ్ర సాహిత్యంలో హేతు దృక్పథాన్ని ఆవిష్కరించిన మార్గదర్శి. భారత సాంస్కృతిక ్రకు నూతన నిర్వచనాన్ని నెలకొల్పిన భావుకుడు, సంప్రదాయాల నతో ప్రారంభించి, అన్నిటికీ మూలకందమైన ఈశ్వరవాదాన్ని

తోర్సిపుచ్చేవరకు పరిణతి నొందిన భావశబలత కవిరాజుది. ఆయన
తుడు, తార్కికుడు, తాత్వికుడు, గద్యంలోను పద్యంలోను అసమా
సంపదలతో రచనగావించిన సవ్యసాచి. ఈ శక్తి సంపదలు చాలా
కవిరాజు స్వయంకృషి ఫలితాలు. ఇట్టి మహామనీషి, ఇట్టి మహాకవి
చిత్రణ, సాహిత్య కృషి సమీక్ష ఆంధ్రదేశానికేకాదు, భారతదేశానికే
అవుసరం. అయితే ఆ పని సామాన్యమైనదికాదు, సులభసాధ్యమైనదీక

కాని ఇందుకు తగినశక్తి ఆసక్తి సుబ్బారావుగారికి ద
పున్నాయి. తన కథా వస్తువుమీద సుబ్బారావుగారు ఎంతగానో కృషిచే
ఆకృషిఫలితమే ఈ చక్కని రూపకల్పన. ఈ జీవిత చరిత్ర చదువుతూవు
నాకూ బాస్వెల్ వ్రాసిన జాన్సన్ జీవితచరిత్ర జ్ఞాపకానికి వచ్చి
అంతటి పసగల చరిత్ర చిత్రణ ఇదికూడా.

శ్రీ సుబ్బారావు గారు అన్నివిధాలా మెచ్చుకోదగ్గ ఉత్తమ
చేశారు. అందుకు వారిని హృదయపూర్వకంగా నేను అభినందిస్తున్నా

హైదరాబాద్.

ఆప్పుల సాంబశివరా

## విషయ సూచిక



కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి

జననం
15-1-1887

మరణం
16-1-1943

# కవిరాజు
# జీవిత విశేషాలు

దేశంలో త్రిపురనేనివారు పేరుప్రతిష్ఠల నందినవారు. ఈ
న్మించిన కొందరు పండిత ప్రకాండులుగా, కవులుగా,
గణితశాస్త్రజ్ఞులుగా, పౌరాణికులుగా, న్యాయవాదులుగా,
నిపుణులుగా, గణుతికెక్కారు. మరి కొందరు శివాలయాలను
అగ్రహారాలను దానం చేశారు. తటాకాలనూ, ఉద్యానాలనూ
రు. ఈ వంశీయులు కృష్ణాజిల్లాలోని అంగలూరు, గుంటూరు
చిపూడి, తాడికొండ గ్రామాలలో ఉన్నారు. కొందరు ఉద్యోగ
ాబాద్‌లో నివసిస్తున్నారు.

ంశముయొక్క పుట్టుపూర్వోత్తరాలను గురించి తెలుసుకోవాలనే
ో ఒకసారి సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకులు మల్లంపల్లి
ర్మగారిని నేను హైదరాబాదులో కలుసుకొన్నాను. కుశలప్రశ్నల
శర్మగారితో ''ఏమండీ త్రిపురనేని వంశం యొక్క పుట్టు
లను గురించి తెలుసుకోవాలనే కోరిక కలిగింది'' అన్నాను.

ినదే తడవుగా వారు ''ఈ వంశానికి మూలపురుషుడు కాకతీయ
యకుడు. అతనిపేరు శంభుడు. ఆయన ప్రతాపరుద్రుని కొలువు
సేనాపతులలో ఒకరు. అతడు ఆంధ్రదేశ పరిరక్షణకొఱకు
ల నెదిరించి పోరిన మహావీరుడు. మీది కదనరంగంలో కత్తులు
నికవంశం'' అన్నారు.

---

డు, నాయుడు, నాయని, నేనిగా రూపాంతరంజెంది, నేటికి ప్రజల
ో ''నేని'' గా నిల్చినది.

'త్రిపురనేని' గృహనామం ఆ నోటా ఈ నోటా వడి అనుశ్రుతంగా వచ్చిందికాదు. చరిత్ర ప్రసిద్ధిగాంచిన కాకతీయ ప్రతాపరుద్ర ధరణీపతి సైన్యాధ్యక్షుడైన శంభుడు తన పదునైన కత్తిని మలకల రుధిరధారలతో కడిగాడు. అతని పౌరుషానికి, ప్రతాపానికి, ప్రతాపరుద్ర మహీపతి దిగ్భ్రమ జెంది, కృష్ణామండల ప్రాంతీయ సేనానిగా శంభుని నియమించాడు. [1]శంభుడు అంగలూరు నివాసం చేసుకొని, నందివాడ, గుడివాడ, కౌతవరము లను ప్రజానురంజకంగా పరిపాలించసాగాడు. ఈ విధంగా త్రిపురనేని గృహనామం ఆనాటి పౌరుష ప్రధాన చిహ్నంగా ఈ వంశీయులను వరించింది.

ఆ నాటి సంకుల సమరంలో సైన్యాధ్యక్షుడైన శంభుడు చేసిన వీర విహారాన్ని హరి పురుషోత్తంగారు అష్టావధాని యిలా వర్ణించారు.

> "ఛంగున ఛంగుఛంగునను శంభు తురంగము చౌకళింప గా
> ఖంగున ఖంగుఖంగునను కత్తులు వ్రక్కలుడుల్లగా, సమిత్
> రంగమునందు నాతని 'తురాయి'ని నాడెడు పువ్వుఁబట్టి, ర
> క్షంగనినారు నాడు మలకల్ మతివిహ్వలురై భ్రమించుచున్."

ఆ వీరాశిఖామణి తలపాగానందలి 'తురాయి' ని బట్టి, 'అదుగో! 'పువ్వాడు' వచ్చుచున్నాడు' అని శత్రువులు ఆయన రాకపోకలు తెల్సుకొని ప్రాణాలు దక్కించుకొన్నారట! అందుచేత ఆ శంభుని సంతతివారైన త్రిపురనేనివారు 'పువ్వాడ' గోత్రీకులుగా వర్ధిల్లుతూ ఉన్నారు.

ఇట్టి మహత్తర ప్రాచీన వైభవమూ, ఆధునిక ప్రశస్తిగల ఈ వంశీయులనుగురించి కవిశేఖర జి. జోసఫ్ కవి యిట్లు ప్రశంసించాడు.

1. సూతపురాణం.

1. "దండున పేరుగొన్న సరదారులు, విక్రమ రాజకీయ మా
ర్తాండులు, సాహితీప్రియు లుదారులు, దుర్ఘటకార్యసాధనో
ద్దండులు, తత్త్వవేత్తలు, సదా బిరుదంబులనంది కీర్తితో
నిండినవారు, మా త్రిపురనేని కులీనులు తెలుఁగు ధాత్రిలో."

మహాకవిశేఖర, కవిసింహ, బ్రహ్మశ్రీ పోకూరి కాశీపత్యవధానులు గారు త్రిపురనేని వారి ప్రశస్తి నిట్లుగ్గడించినారు.

2. "ఖ్యాతియందు బరమ నీతియందును స్థిర
భూతియందు సానుభూతియందు
సాతియందు నిత్యప్రీతియందును లేమి
లేనివారు త్రిపురనేనివారు."

ఈ వంశానికి వన్నెతెచ్చిన ఘనులు త్రిపురనేని గోపాలయ్యగారు. వీరిది అంగలూరు. ఈ గోపాలయ్యగారికి నలుగురు కొడుకులూ, ముగ్గురు కూతుళ్ళూ జన్మించారు. మూడవకొడుకు చలమయ్యగారు. రామమాంబ వీరి భార్య.

చలమయ్యగారు కోరమీసాలు గలిగిన ఆజానుబాహువు. తలపాగ, పొన్నుకర్ర, కిర్రు చెప్పులూ ధరించి, ధర్మమూర్తి లా కనిపిస్తుండేవారు. సజ్జనులకు వారింత ఆప్తులో, దుర్జనులకు అంత దుర్నిరీక్షంగానూ వుండేవారు. ఒకసారి అభయమివ్వడం జరిగితే - మరిదానికి తిరుగంటూ వుండేదికాదు. రౌద్ర కరుణరసాలు సమపాళ్ళలో వారిలో చిప్పిలుతుండేవి. అన్యాయ మెదురైనప్పుడు రౌద్రమూర్తులైతే, ఆర్తులు కన్పించినప్పుడు కరుణాసముద్రు లయ్యేవారు.

1. గోలకొండ పత్రిక — 10-1-1966
2. శ్రీ శైల మల్లేశ్వర శతకం, 1972

ఇక, రామమాంబగారు శాంతస్వభావానికి ప్రతీక. శత్రువులనైనా కన్నబిడ్డలవలే ఆదరించడం ఆమెకు వెన్నతో బెట్టిన విద్య. విసుగూ విరామం లేకుండ అతిధిసత్కారాలు చేస్తూవుండేవారు. ఈ దంపతులకు ఐదుగురు కుమారులు, ఒక కుమార్తె కలిగారు. వీరి మొదటి కుమారుడు గోపాల కృష్ణయ్యగారు. వీరు కమనీయంగా కవిత్వమల్లేవారు. రామశతకం, మానసబోధ శతకం, సంయుక్త ప్రభాకరం, వ్రతకల్పం, కర్ణామృతం అనే గ్రంథాలు రచించారు. అప్పటి ఆంగ్లేయ చక్రవర్తి ఎనిమిదవ ఎడ్వర్డు మద్రాసువచ్చి, ఆంధ్ర కవులను సత్కరించాడు. ఆ సందర్భంలో గోపాల కృష్ణయ్యగారిని, ఆంధ్ర సాహితీ రత్న బిరుదంతోనూ, స్వర్ణకంకణంతోనూ సత్కరించాడు. రెండవవారు నరసయ్యగారు. గురుకుల వాసంచేసి, సంస్కృతాంధ్ర భాషలలో అద్వితీయమైన పాండిత్యం గడించారు. శివ శతకం, దీనచింతామణి వీరి రచనలు. మూడవవారు శ్రీరాములుగారు. సాధుసజ్జన సంఘసాంగత్య శీలురు; మంచివ్యవహర్త. నాల్గవ కుమారుడు సుబ్రహ్మణ్యం. "శాలివాహన విజయము" అనే నాటకం వ్రాశారు. విక్రమ దేవవర్మగారీ నాటకాన్ని ప్రశంసిస్తూ చక్కని పీఠిక వ్రాశారు. కడగొట్టు బిడ్డ రామస్వామిగారు. కుమార్తె సీతారత్నం విదుషీమణి, ఆర్తుల పాలిటి కల్పతరువు.

ఈ విధంగా రామస్వామిగారి వంశం సంగీత, సాహిత్యాలలోనూ, శాస్త్ర, వ్యవహారాదులలోనూ గణుతికెక్కింది. రామస్వామిగారిలో, తమ పూర్వీకుల ప్రతిభలన్నీ పుంజీభవించాయి.

రామస్వామిగారు 1887 సం. జనవరి 15వ తేదీన జన్మించారు. అప్పుడు మనదేశం ఒకవంక బానిసత్వంలోనూ, మరోవంక - మౌఢ్యాంధ కారంలో మునిగివున్న ఇతర జాతులమీద అగ్రజాతుల నిరంకుశత్వంతోనూ క్రుగ్గిపోతూవుంది. "ఆ రోజుల్లో కులాల మధ్యగల సరిహద్దులు మరింత విస్పష్టంగా ఉండేవి. పుట్టుకతోనే కొందరికి ఆధిక్యత, మరికొందరికి న్యూనత

సంక్రమిస్తుందన్న నమ్మకాలు విరివిగా ప్రచారంలో ఉండేవి. అగ్రజాతులు ఆధిక్యత తమ జన్మహక్కు క్రిందలెక్క వేసుకొని, ఇతర జాతులయెడ దుర్గర్వపూరితులై అన్యాయంగా ప్రవర్తిస్తూ ఉండేవారు. కవిరాజు బాల్యంలో ఈ అగ్రజాతి దురహంకార ప్రవర్తన ఎంత దుస్సహంగా వుండేదో ఊహించు కొనవచ్చును. చదువుకొన్నవారి ఇంటికైనా ఒక బ్రాహ్మణేతర మిత్రుడు వెళ్తే దూర దూరంగానే వుండవలసివచ్చేది. అతడికి దాహమైతే నీళ్ళు దోసిటలోపోసి త్రాగమనే వారు. లేదా ఒక చెంబుతో (గ్లాసు, పంచ పాత్రతో కాదు) నీళ్ళిచ్చేవారు. ఇచ్చినా త్రాగిన తరువాత ఆ చెంబును తొల్చమనేవారు. తొల్చినా దాని నక్కడే బోర్లించమనేవారు. బోర్లించినా దానిపై కొంచం నీళ్ళు తాము చిలికిగాని దానినంటే వారుకాదు. ఇతర కులాల వారిని అంత నీచాతినీచంగా చూచేవారు. శ్రీమదజ్జాడ ఆదిభట్ట నారాయణ దాసువంటి ఉదార భావాలుగల కవి కూడా ఆ రోజుల్లో "ఎ. బి. సి. డి. లు, నేర్చి ఎక్కువ కులమును, చుల్కనగా జూచు శూద్రయోని" అని వ్రాసి హర్షధ్వానములందుకొన్నాడు. సంస్కృతం చదవడం, వేదాలు నేర్చుకోవడం, వివాహాది కార్యాలు చేయించడం - ఇలాంటి అధికారాలన్ని అగ్రజాతికే ఉండేవి. గ్రామ పెద్దరెడ్డినైనా అగ్రజాతి నీచంగా సంబోధించవలసిందే! ఏకవచన ప్రయోగంతో మాటలాడవలసిందే!!

ఈ సమాజస్థితి వలెనే ఆ రోజుల్లో సారస్వతస్థితి కూడ లోప భూయిష్టంగా ఉండేది. ఇనుప గుగ్గిళ్ళవంటి కఠిన పదాలతో ఎవరికీ తెలియ కుండా చెప్పినదే ప్రౌఢ కవిత్వం, తక్కినదంతా పేలపిండి. పూర్వ కవి పండితులు నిర్ణయించిన దానికి భళి భళి అన్నవాడే పండితుడు. స్వతంత్రంగా ఆలోచించి దానికి వ్యతిరేకంగా మాట్లాడిన వాడు అభాజనుడు" అంటారు తాపీ ధర్మరావుగారు. అలాంటి వాతావరణంలో రామస్వామిగారికి అంగ లూరులోనే వీధి బడిలో 1895 జూలై 15వ తేదీన అక్షరాభ్యాసం జరిగింది. ఆ వీధిబడిని మంగయ్య పంతులు నిర్వహిస్తు ఉండేవాడు. చిన్నతనంనుండి

రామస్వామిగారు కొంటెతనానికి, కోణంగితనానికి ప్రసిద్ధి. ఇప్పటికీ కథలుగా చెప్పుకుంటూ ఉంటారు. వారిబాల్యం అంగలూరు, గుడివాడలో గడచి పోయింది.

గుడివాడ మిడిల్‌స్కూల్లో చదువుకొనేటప్పుడు ఒక సంఘటన జరిగింది. రామస్వామిగారికి ఒక బ్రాహ్మణ స్నేహితుడు ఉండేవాడు. ఒక రోజున రామస్వామి మిఠాయి దుకాణానికి వెళ్ళిమిఠాయి కొనుక్కొంటున్నాడు. అదిచూచిన ఆ మిత్రుడు తనకూడా మిఠాయి కొనిపెట్టమని అడిగాడు. రామస్వామి మిఠాయికొని, తన పొట్లంతోపాటు, అతని పొట్లంకూడా తీసుకో బోయాడు. "రామస్వామీ! "ఆగు! ఆగు!! నా పొట్లం నీవు తాకకూడదు" అంటూ తన పొట్లం తానే అందుకొన్నాడా బ్రాహ్మణ మిత్రుడు.

"నేనేకదా డబ్బిచ్చినది? నేను ఎందుకు తాకకూడదు?" అన్నాడు రామస్వామి. ఈ సంఘటన బాల్యదశలోనే రామస్వామిని జిజ్ఞాసువుగా చేసింది. పరిశోధకునిగా మార్చివేసింది. ఒక ఉద్యమ నాయకునిగా రూపొందడానికి దోహదం చేసింది.

హేతుబద్ధం కానివాటిని ఆయన బాల్యంనుండి విశ్వసించే వారుకాదు. మూఢనమ్మకాలంటే రామస్వామిగారికి మొదటినుండి గిట్టేవికావు. ఈ విష యాలను విపులంగా మనం ముందు ముందు తెలుసుకొందాం.

మరొకసారి ఏం జరిగిందంటే - రామస్వామిగారు మొఖం పుల్లల కోసం ఊరుబయట నున్న వేపచెట్టు దగ్గరకు వెళ్ళారు. ఆ చెట్టును ఎక్క బోతూ వుండగా, దానికి ఇనుపమేకులూ, ఆ మేకులకు చుట్టిన కొన్ని వెంట్రుకలూ కన్పించాయి. క్షుద్రదేవతల తృప్తికోసం ఆ రోజుల్లో ఇలాంటి పద్ధతులు అవలంబించబడుతూ వుండేవి. రామస్వామిగారు కొంచెంసేపు ఆలోచించారు. చెట్టుక్రింద రాగిడబ్బులూ, నిమ్మకాయలూ, వేప బెత్తమూ

ఉన్నాయి. రామస్వామిగారు మొఖం పుల్లలు విరుచుకొని, డబ్బులు జేబులో వేసుకోని, బెత్తం తీసుకొని ఊళ్ళోకి వెళ్ళారు. ఊళ్ళో పెద్ద అలజడి చెలరేగింది. వారు అవేమీ లక్ష్యపెట్టలేదు. చాలాకాలంపాటు ఆ బెత్తం వారి వద్దనే ఉంది.

రామస్వామిగారు 1905 సం॥లో బందరు హిందూ హైస్కూల్లో నాలుగోఫారంలో చేరారు. చదువుమీద ఎంత శ్రద్ధ చూపేటేవారో ఆటల మీదకూడా అంత ఆసక్తినీ కనపరిచేవారు. పుట్‌బాల్ అత్యద్భుతంగా ఆడేవారు. టీముకు కెప్టెన్. పిన్సిపాల్‌తో పోట్లాడి 'నీ కాలేజీకి కప్పురాకుండా చేస్తాను' అన్నారు. ఆ సంవత్సరం మరో స్కూల్లోచేరి, ఆ స్కూలు తరపున టీముకు కెప్టెన్‌గా వచ్చి కప్పు గెలుచుకు వెళ్ళారు. కవిత్వ విషయంలోనూ, సంస్కృతాధ్యయనంలోనూ అధ్యాపకులు లభించక అష్టకష్టాలూ పడ్డారు. ఎవరివద్దకు వెళ్ళినా 'నీవు శూద్రుడవు — సంస్కృతం అభ్యసించ కూడదు' అని తిరస్కరించారు. రామస్వామిగారిలో విద్యాతృష్ణ ఆరోజు కారోజుకూ పెచ్చుమీరి పోతూవుంది. భూతదయకు పేరుమోసిన భరతఖండంలో వారికి అధ్యాపకులే కరువయ్యారు. క్షుద్రాతిక్షుద్రమైన కులపిశాచికి, ఆ మహనీయుని విద్యాసక్తి బలి గావలసివచ్చింది. మరొకరైతే విద్యాభ్యాస ప్రయత్నాలను విధిగా విరమించుకోవలసి వచ్చేది. కాని ఆయన ఆ విధంగా చేయలేదు. వారి జిజ్ఞాసను పరిశీలించిన ఆసూరి కాంతయ్యగారు, రామస్వామి గారిని పిలిపించు కొన్నారు. కాంతయ్యగారు మహా పండితుడు. బందరులో జిల్లా రిజిష్ట్రారుగా పనిచేస్తూ వుండేవారు. వీరివద్ద రామస్వామి గారు కావ్యాధ్యయనం చేశారు. ఆ తరువాత చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారి శిష్యత్వం లభించి కవితా రచన ప్రారంభించారు.

రామస్వామి గారి ఆనాటి కవిత్వాని కొక నిదర్శనం.

ఒక బ్రాహ్మణ విద్యార్థి రామస్వామి గారి పద్యాలను తన గురువు దగ్గరకు తీసుకెళ్ళి, ఎవరు వ్రాసిందీ చెప్పకుండా "ఈ పద్యాలు దిద్దిపెట్టండి"

అన్నాడు. ఆయన పద్యాలు చూచి ఒక పదాన్ని చూపుతూ "ఈ పదం తీసి వేసి మరో పదం వేస్తే బాగుంటుంది" అన్నాడు. "ఈ పద్యాలు రామ స్వామి వ్రాసినవి" అన్నాడు విద్యార్థి. అయితే ఏదీ! మళ్ళీ ఒక సారి చూడనివ్వు" అన్నాడు గురువు.

క్రీ. శ. 1898వ సంవత్సరంలో రామస్వామి గారికి వివాహమయింది. అత్తవారిది చౌటపల్లి. మామ అట్లూరి అమరయ్యగారు. అత్త నాగమ్మగారు. భార్య పున్నమాంబ గారు. వీరి దాంపత్య జీవితం ఆనాటి వారికి ఆదర్శవంతమయింది.

వీరికి క్రీ. శ. 1910 సంవత్సరం సెప్టెంబరు 8వ తేదిన ఒక కుమారుడు జన్మించాడు. వీరే ప్రఖ్యాత కథకుడు, నవలా రచయిత, తత్వవేత్త శ్రీ గోపీచంద్. తరువాత ఐదు సంవత్సరాలకు ఒక కూతురు కలిగింది. ఈమె పేరు సరోజిని. ఈమెను కానుమిల్లి సుబ్బారావుగారికిచ్చి వివాహం చేశారు. సుబ్బారావు గారు ఐ ఏ.యస్. ఆఫీసరు హోదాలో మన రాష్ట్ర ఎన్నికల ప్రధానాధికారిగానూ, కొంతకాలం జిల్లా కలెక్టరుగానూ, మరికొంతకాలం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సచివాలయంలో కార్యదర్శిగానూ, పబ్లిక్‌సర్వీస్ కమిషన్ చైర్మన్‌గానూ పనిచేశారు. పదవీవిరమణ అనంతరం 19-10-1986న కీర్తిశేషులయ్యారు. సరోజిని గారు కూడా ఇటీవలనే పరమపదించారు.

1191 వ. సం॥లో రామస్వామి గారు అంగలూరులో అష్టావధానం, 1912వ సం॥లో శతావధానం చేశారు. రామస్వామి గారు చౌటపల్లిలో స్వయం వ్యక్తులను తయారుచేసే సంఘాన్ని స్థాపించారు. అన్ని వృత్తులూ ఈ సంఘమే చేయాలని దీని ఆదర్శం.

ప్రథమ ప్రపంచ మహాసంగ్రామం జరుగుతున్న రోజుల్లో ఉన్నత ... విద్యాభ్యాసంకోసం ఇంగ్లండు ప్రయాణం అయ్యారు రామస్వామి గారు.

ఁలు కాబట్టి బంధువులు నిరోధించారు. కాని వినేంస్వభా
గా వెళ్ళబోయేముందు ఎవరో తుమ్మారట ! అందుచేత
ుచేయ మని అందరూ బ్రతిమాలారు. వినలేదు. ప్రయాణమై
ు. అచ్చట గాంధీజీని దర్శించారు.ఆ మహనీయుని సందర్శనం
ునుభూతిని ఆయన ఓ లేఖద్వారా యిలా తెలియచేశారు...
ని చూచి ఆశ్చర్యపడితిని. రెండు దినములనుండి జాడ్య
తేను. టేకు పాత్రయందు భుజించుచుండుటగాంచి యక్కజ
్రతీతిలకము రొట్టెలు కాల్చుచుండెను. కెల్లన్ బాక్ గారు
రిచర్యచేయుచుండెను. ఔరా ! భక్తిచేయింపని కార్యమొండుం
తర మా మహాశయుడు నా క్షేమ సమాచారములడుగ వినయ
లియ జేసి మరి కొంతసేపు ప్రసంగించి సెలవు బడసితిని.
్త్రిసౌమ్యత! శాంతత!! కన్నుల గట్టినట్టుండును. దక్షిణాఫ్రికా
మన ఇండియనులకు చేసిన మహోపకారము మఱువ
పవిత్రదర్శనంబున పవిత్రుడనైతి''.

స్వామిగారు లండన్ నగర మంతా కలయ చూశారు. ఒక
ర్డు మీద "Indians and dogs are not allowed" అని
ారతీయులు కూడా మానవులే కదా ! మానవులను కుక్కలతో
మంజసం కాదా. అంతర్జాతీయ శాస్త్రరీత్యాఇది చాలా అన్యాయ
ుల్ యజమానితో వాదించారు. కొంత సేపటికి ఆ హోటల్
ుబోర్డును ఆయన ముందే తీసివేయించాడు. ఆత్మగౌరవంతో
మృతతుల్యుడు.

ోపున్నా రచనా వ్యాసంగం నిరాఘాటంగా సాగిస్తువుండేవారు.
గా వ్రాసిన వారి లేఖలు కృష్ణాపత్రికలో వెలువడుతూ వుండేవి.

క 21-11-1914
ఖలు-డైరీలు-1972

అప్పటి సంపాదకులు ముట్నూరి కృష్ణారావు గారు. రామస్వామి గారి నూతన భావతరంగిణికి ఎంతగానో ముగ్ధులయ్యారు. బ్రిటిషు దీవుల్లో మూడు సంవత్సరాలున్నా టోమేటోలూ, దోసకాయ ముక్కలూ మొదలగు సాత్త్విక ఆహారాన్నే భుజించేవారు. మద్య, మాంసాలజోలికి పోలేదు; సిగరెట్టు మాత్రం కాల్చేవారు. విదేశాలలోవున్నా వేషంలో మార్పు వుండేది గాదు. ఎక్కడున్నా తలపాగా ధరించేవారు. పాశ్చాత్య దేశాలలోకూడా రామస్వామిగారికి 13వ నంబరు గదిమాత్రమే కావాలి. ఎందుకో తెలుసా? 13 నెంబరు మంచిది కాదని సాధారణంగా తెల్ల వాళ్ళెవరూ ఆనెంబరు గదిలో వుండరు. అందుకని అద్దె తక్కువ. రామస్వామి గారు హోటల్ మేనేజరు దగ్గర కెళ్ళి 13నెంబరుగది కావాలి" అని అడిగే వారు. మేనేజరు కాసేపు తెల్లబోవటం, మనిషిని ఎగాదిగా చూడటం, చివరికి తీసు కెళ్ళి చూపటం జరిగేది. వారు ఆ నెంబరు గదిలోనే ఉండేవారు. డబ్లిన్‌లోని జాతీయ కళాశాలలో చేరి డిగ్రీని పొందడానికి ప్రయత్నించారు. కాని తల పాగా పెట్టుకొని తరగతిలో కూర్చోగూడదని పట్టుపట్టడంతో చదువుకే స్వస్తిచెప్పారుగాని, తలపాగా తీయడానికి ఏమాత్రం అంగీకరించలేదు. ఐర్లెండు నుండి అంగలూరుకు అసంఖ్యాకంగా ఉత్తరాలు వ్రాస్తూ వుండే వారు. ఆ ఉత్తరాలను పరిశీలించి చూడగా పురాణాలకు వ్యతిరేకంగానూ, దేవుడు - దయ్యాలూ లేవనీ. అగ్రజాతికి ప్రత్యేకమైన హక్కులు వుండ రాదనీ ప్రచారం చేసినట్టుగా విదితమౌతుంది. ఈ ప్రచారం వల్ల వాగ్వి వాదాలూ, దూషణ తిరస్కారాలు జరిగినట్లు తెలుస్తూ ఉన్నది. రామయ్య గారికి ఉత్తరం వ్రాస్తూ "ఉన్న సంగతులు విశదంగా వ్రాశాను-మీరే ఆలో చించు కొని ఒక నిర్ణయానికి రండి. నేను చెప్పాను గదా అని మాత్రం చేయ బోకండి" అని వ్రాశారు. ఐర్లెండ్ లోనే రామస్వామి గారు బారిష్టరు పట్టాపొందారు. ప్రాచ్య, పాశ్చాత్య సారస్వతాలను సమశ్రుతిలో మేళవించు కొన్నారు. సింగపూర్, సిలోన్, ప్యారిస్, డబ్లిన్, ఉత్తర, దక్షిణ ఆఫ్రికాలు మొదలైన దేశాల్లో పర్యటించారు.

తాము ధర్మమని విశ్వసించిన దానికోసం హిమాలయంలా నిలిచేవారు. తామే పొరపడటం జరిగితే పేచీలేకుండా దాన్ని అంగీకరించేవారు.

దక్షిణాఫ్రికాలో ఒక సంఘటన జరిగింది. రామస్వామి గారి పట్టుదలకు ఈ సంఘటన మచ్చుతునకవంటిది.

రామస్వామి గారు ప్రయాణం చేస్తున్న జపాను ఓడ డర్బన్ రేవులో ఆగింది.

"ఆసియావాసులెవ్వరూ అక్కడ దిగకూడదు". అని ప్రభుత్వం ఉత్తర్వులు జారీచేసింది.

రామస్వామిగారు ఆ ప్రకటన తెలుసుకొని అవమానంతో కంపించిపోయారు.

"దొంగలకు ప్రతివారూ దొంగల్లాగానే కనిపిస్తారు. ఈ ప్రభుత్వం తస్కరుల ప్రభుత్వం. కాబట్టే భయపడుతూ వుంది. ఆసియావాసులంటే ఎందుకింత భయం ? నేను దొంగనుకాను. ఆసియా వాసులెవ్వరూ దొంగలు కారు" అన్నారు ఆయన.

ప్రభుత్వోద్యోగి వచ్చి "ప్యాస్‌పోర్టు" చూపించమని అడిగాడు.

"మీరు నోటీసును ఉపసంహరించుకోనే వరకూ పాస్‌పోర్టును మీకు చూపించను" అన్నారు చౌదరి గారు.

"చూపవ్ ?" అన్నాడు గంభీరస్వరంతో ఉద్యోగి.

"చూపను" అన్నారు రామస్వామి గారు.

"అయితే, నిన్ను అరెస్టు చేయిస్తా" అన్నాడు ప్రభుత్వోద్యోగి.

"అదెలాగో నేనూ చూస్తాను" అన్నారు రామస్వామి గారు.

ఈ వాద ప్రతివాదాలతో కాలం గడిచిపోయింది. కెప్టెన్ వచ్చి పాస్‌పోర్టు చూపించ వలసిందిగా చౌదరి గారిని కోరాడు. వారు వినలేదు ప్రభుత్వోద్యోగితో మాట్లాడివచ్చాడు "రామస్వామి గారూ ! మీరు డర్బన్ చూడటానికి వెళ్ళవచ్చునండీ !" అన్నాడు కెప్టెన్.

"షరతు లేమిటి ?" అన్నారు చౌదరి గారు.

"నేను మీకు హామీగా ఉన్నాను. మీరువెళ్ళి డర్బన్ చూచిరండి" అన్నాడు కెప్టెన్.

"నేను చూడను. నా పాస్‌పోర్టు కూడా చూపించను" అన్నారు చౌదరి గారు.

"కెప్టెన్‌కేమీ తోచలేదు."

అప్పటికే గంట ఆలస్యమయింది. అంటే ఎంతో డబ్బునష్టం. కెప్టెన్ మరోసారి ప్రభుత్వోద్యోగితో మాట్లాడి చిరునవ్వు నవ్వుతూ వచ్చాడు.

"రామస్వామి గారూ ! ఎలాంటి షరతులూ లేకుండానే మీరు ఓడ దిగవచ్చునండీ" అన్నాడు.

అప్పుడు రామస్వామిగారు ధీమాగా పాస్‌పోర్టు చూపించారు.

రామస్వామిగారు మంచి మాటకారి. రిపార్టీ-ఎదుటివారి నషాళాని కంటే సమాధానాలు తడుముకోకుండా ఇవ్వడమనే శక్తి-వారిలో అపారంగా ఉంది. అందుచేతనే సంభాషణలో ఎంత వాణ్ణయినా కొద్ది క్షణాల్లోనే బోల్తా కొట్టించేవారు. ఎదుటివారికి కలకాలం జ్ఞాపకంవుండేలా జవాబు లివ్వడం ఆయనకు వెన్నతోపెట్టిన విద్య.

వారు విదేశాలలో వున్నప్పుడు, ఒక పాశ్చాత్య వనిత వారి వేషాన్ని చూచి పకపకా నవ్విందట!

''ఏమిటి?'' అన్నారు రామస్వామిగారు.

'మీరు రోమ్‌లో వున్నప్పుడు, రోమన్ లా వుండాలిగాని, ఈ
, ఈ పంచెకట్టూ ఏమిటి?'' అన్నదావిడ.

'అయితే మీవాళ్ళు మాదేశం వచ్చినపుడు, భారతీయుల్లా ధోవతులు
' అన్నారు రామస్వామిగారు.

ఆమె ఇలాంటి జవాబు వస్తుందని అనుకొని ఉండదు. అసలే తెల్లగా
ఆవిడ ముఖం మరింత తెల్లబడి వెలవెలా పోయింది.

మరోసారి—

అవి మొదటి ప్రపంచయుద్ధం జరుగుతున్న రోజులనుకొన్నాంగదా!
యంలో, ఒక యువతి, రామస్వామిగారి దగ్గరకువచ్చి ''చందా
!'' అన్నది.

''ఎందుకు?'' అన్నారు రామస్వామిగారు.

''యుద్ధంలో తీవ్రంగా గాయపడిన సైనికులకు సదుపాయాలు కలుగ
' అన్నదామె.

''నేనివ్వను. గాయాలు నయమయ్యాక, మమ్మల్ని హింసించడానికి
ికులే సిద్ధపడతారు. నా శత్రువుకు నేనెన్నడు సహాయపడను.''
రు రామస్వామిగారు.

ఆవిడ మళ్ళీ నోరెత్తకుండా వెళ్ళిపోయింది.

సంభాషణలోనే కాకుండా, రచనలోకూడా ఇలాంటి చెణుకులు
; మిరిమిట్లు గొలిపించారు రామస్వామిగారు.

1917 సం. నవంబరు 11వ తేదీన విదేశాలనుండి స్వదేశానికి తిరి
వచ్చారు. న్యాయవాదవృత్తి స్వీకరించారు. 1918 సం.లో బందరు
ప్రాక్టీసు ప్రారంభించారు. తరువాత బెజవాడకు తరలివచ్చారు. న్యాయశా
వాదంలోనూ, న్యాయాధికారులను ఒప్పించడంలోనూ వారు పేరుపొందా
కాని న్యాయవాదవృత్తిపై వ్యామోహంకంటే, వారికి ప్రజాసేవాభిలా
ప్రబలంగా వుండేది. అందుచేత న్యాయవాదిగా సంఘంలోని అవకతవకల
గమనించారు. న్యాయంవైపు నిలబడడం తమధర్మంగా భావించార
ఫలితంగా సంఘసేవ, సారస్వతసేవ, బ్రాహ్మణేతర ఉద్యమం మొద
పెట్టారు. 1922 సం. లో టంగుటూరులో జరిగిన కమ్మ మహాజన సభ
అధ్యక్షత వహించారు. వీరి అధ్యక్షోపన్యాసం నిద్రాణమై, నిస్తేజమై
నిర్వీర్యమైవున్న జాతిలో జాగృతిని కలిగించింది. "పీఠాధిపతులను"
"ఉపన్యాస చక్రవర్తులను" ముఖాముఖిగా ఎదుర్కొని అనర్గళంగా ఉపన్యాస
లిచ్చారు. వారితో వాగ్యుద్ధంలో తట్టుకోలేక "శంకర పీఠాధిపతులు" సైత
పలాయన మంత్రం పఠించారు.

పురాణాలను నమ్మగూడదనీ, దేవుడులేడనీ, బ్రాహ్మణులు మిగత
కులాలవారిని పశువులకంటే నీచంగా చూస్తూవున్నారనీ, ఈ బానిసత్వా
పోగొట్టుకోవాలనే రామస్వామిగారి ఉపన్యాసాల సారాంశం. తమ సిద్ధాంత
లను ఊరూరా, వాడవాడా తిరిగి ప్రచారంచేశారు. కొన్ని సభలలో రాళ్ళు
రువ్వటం, రాక్షసుణ్ణి చూచినట్టు చూడటం, భోజనం కూడా పెట్టకపోవటం
జరిగింది. అయితే ఆ రోజుల్లోకూడా అమృత ఘడియలు కొన్ని లేకపోలేదు

ఒక మీటింగులో ఉపన్యాసం యిచ్చి రామస్వామిగారు బయటికి
వచ్చారు. ఒక శతవృద్ధు కర్రపోటుతో వచ్చి అమాంతంగా రామస్వామిగారి ని
కౌగిలించుకొని బావురుమన్నాడు. "ఏమిటి?" అని తబ్బిబ్బుపడుతూ అడిగారు
రామస్వామిగారు. "ఏంలేదు బాబూ! ఇక నేనెక్కువ రోజులు బ్రతకను,
నిన్నుచూచిపోదామని వచ్చాను" అన్నాడు ఆ శతవృద్ధు.

రామస్వామిగారు 1922 సం. లో తెనాలి పట్టణం చేరుకున్నారు. అందులకు కారకులయిన ప్రముఖులు పాములపాటి వెంకట కృష్ణయ్యగారు, నాగర్లమూడి కుప్పుస్వామిగారు. వెంకటకృష్ణయ్యగారికి రైతు పత్రికను తెనాలినుండి ప్రచురించాలనే ఉద్దేశం కలిగింది. రామస్వామిగారిని సంపాదకులుగా నిర్ణయించారు. కాని అనుకొన్నట్లుగా ఆ పత్రిక వెలువడలేదు. అయితే రామస్వామిగారు మాత్రం తెనాలిలో స్థిరపడిపోయారు. 5-11-1925న పల్లలమర్రి ఆంజనేయులుగారిని ఓడించి, తెనాలి పురపాలక సంఘానికి చైర్మనుగా ఎన్నుకోబడ్డారు. 1938 సం.వరకు ఆ పదనిలోవుండి వ్యవహార దక్షతతో ఆ పదవిని నిర్వహించారు. స్థానికులదైనందిన జీవితంతో సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకొన్నారు. వారిబాధలు, గాథలు కని, విని, వాటి తరుణోపాయాలను సూచించారు. తనకున్నంత మేరలో అధికారాన్ని సంపూర్ణంగా సద్వినియోగంచేసుకొని ప్రజలకు సేవచేశారు.

1926వ సంవత్సరంలో నడింపల్లి నరసింహారావుగారిని ఓడించి ఆంధ్రా యూనివర్సిటీ సెనేటు మెంబరు అయ్యారు. తెలుగు టెక్స్టుబుక్ కమిటీ మెంబరుగా కొంతకాలం ఉన్నారు. అప్పుడు సంస్కృత ప్రాముఖ్యాన్ని తగ్గించడానికి ప్రయత్నించారు.

రామస్వామిగారి ఇల్లెప్పుడూ సాహిత్య వాదోప వాదాలతోనూ, సంస్కర్తల పదధ్వనులతోనూ ప్రతిధ్వనిస్తూవుండేది. ఒకనాటి 'శంబుకాశ్రమమ్' పేరు ''సూతాశ్రమం''గా మార్చారు. అస్తికులూ, నాస్తికులూ, రాజకీయవేత్తలూ, లౌకిక వ్యవహర్తలూ, పండితులూ, పామరులూ, కవులూ, గాయకులూ, మరెందరో ప్రముఖ వ్యక్తులు ఎప్పుడో ఒకప్పుడు సూతాశ్రమంలో అడుగుపెట్టకుండా వుండేవారు కాదు. చౌదరిగారి సలహాలనూ, సూచనలనూ అడగకుండా వుండేవారుకాదు. 1941 సం. లో మహా మేధావి యం. యస్. రాయ్‌గారు కూడా సూతాశ్రమాన్ని సందర్శించి

హేతువాదంపై రామస్వామిగారితో చర్చలు జరిపారు. విప్లవాత్మకమైన ప్రతి ఉద్యమంతోనూ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వారికి సంబంధం వుండేది. ఎక్కడ ఏ నూతనాంశం కనుపించినా చౌదరిగారు ఆసక్తితో గమనించేవారు. ఎక్కడ ఎలాంటి నూతనోత్సాహం మోసులెత్తినా దానికి వారి దోహదం వుండేది. ఎన్నో హృదయాలలో వారు జ్ఞానజ్యోతులను వెలిగించారు. సాంఘికంగా అథమాథమ స్థితిలోవుండి, దిక్కుతోచక బెంబేలు పడుతున్న వారి కెందరికో చేయూతనిచ్చి, వీపుతట్టి, 'నాయనా' నేనున్నాను భయపడకు, ధైర్యంతో ముందడుగువెయ్యి అంటూ కావలసిన ధైర్యాన్ని, స్థయిర్యాన్ని కలిగించేవారు రామస్వామిగారు. ఆకాశమంతమనిషి, సముద్రమంత ధైర్యం తమకిచ్చాడన్న సంతోషం, వారిని పునరుజ్జీవితులను చేసేది.

రామస్వామిగారు అనునిత్యం సాహిత్యగోష్ఠులలో మునిగి తేలుతూ వుంటే, పున్నమాంబగారు అతిథులకు సంతర్పణలుచేస్తూ వుండేవారు. అలాంటి పున్నమాంబగారు 1920 సం. జనవరి 16న కాలధర్మం చెందారు. ఆ సందర్భంలో కవిరాజుగారు వారి ధర్మపత్నిని గురించి ఇలా వ్రాశారు.

మ. ''మహిళాధర్మవిశిష్ట వృత్తయయి కావ్యవ్రాత సంధాత్రియై
విహితాలాప కలాకలాపయయి సద్విద్యావతీ భూషయై
రహినొప్పారిన పున్నమాంబ సుదతీ ప్రాలంబ ముక్తామణిన్
గృహిణింగాఁగొని సంతతింగని, ముదం బిట్టింక గోల్పోయితిన్!

చం. ''చెదరని ముంగురుల్ రసము చిప్పిలు తీయని తేటమాటయున్
వదలని ప్రేమబంధమును వల్లని చల్లని బుల్లి నవ్వులున్
గుదరని జంకుచూపు గమి గూపులు గల్గియు నా మనస్సులో
మెదలుచునుండెఁగా ప్రతినిమేషము మత్కులకాంత నేఁ టికిన్!''

ఆ సంవత్సరమే రామస్వామి గారు ద్వితీయ వివాహం చేసుకొన్నారు. ఈమె పేరు చంద్రావతి. వీరికి ఒకకుమారుడు. ఈయన పేరు గోకుల్‌చంద్.

1932సం. లో రెండవ భార్యకూడా పరమపదించారు. 1933సం. లో రామస్వామి గారు మూడవపెళ్ళి చేసుకొన్నారు. ఈమెపేరు అన్నపూర్ణమ్మ. వీరికొక కూతురుపుట్టింది. ఈమె పేరు చౌదరాణి. ప్రఖ్యాత కథకుడు అట్లూరి పిచ్చేశ్వరరావుగారు ఈమెను వివాహం చేసుకొన్నారు. రామస్వామి గారి మూడవ భార్య కూడా 1964 వ సం. ఏప్రిల్ 30వ తేదిన కాలధర్మంచెందారు.

రామస్వామిగారు బారిష్టరు, శతావధానులు, బహు గ్రంథకర్తలు- ''సూత పురాణం', కురుక్షేత్ర సంగ్రామం', 'శంబుకవధ', 'ఖూనీ', 'వివాహవిధి', ''కుప్పుస్వామి శతకం'', ధూర్తమానవా'', సూతాశ్రమ గీతాలు'' ''భగవద్గీత'', -ముద్రితగ్రంథాలు. ''అంపకం'', ''మాలదాసరి'', 'నరకం', 'గోపాలరాయ శతకం', 'చెన్నకేశవ శతకం', 'వల్నాటి పౌరుషం' 'రాణాప్రతాప్', మొదలగునవి అముద్రితాలు. వీరి భాషా సేవకు అలరిన ఆంధ్రమహాసభ బెజవాడలో 1929 సంవత్సరం॥ నవంబరు 4వ తేదిన కాశీనాథుని నాగేశ్వరరావు గారి చేతి మీదుగా ''కవిరాజు'' బిరుదునిచ్చి తనను తానే గౌరవించుకొంది. గుడివాడపౌరులు రామస్వామిగారికి 1942సం. ఏప్రిల్ 25, 26 తేదీలలో గజారోహణోత్సవంతో ఘనంగా సన్మానంజరిపి, వారి సంస్కరణోద్యమంపట్ల తమ గాఢానురాగాన్ని తెలియజేసుకొన్నారు. వివిధ ప్రాంతాలనుండీ అనేకమంది ప్రముఖులూ, వేలాది స్థానిక ప్రజలూ ఆ సన్మానంలో పాల్గొని కవిరాజుకు బ్రహ్మరథం పట్టారు. బెజవాడ రామచంద్రా రెడ్డి గారి అధ్యక్షతన, చల్లపలి సంస్థానాధీశ్వరుల సమక్షంలో, పండితాశీర్వాదాలతో, అనేకమంది కవుల అభినందనలతో, అఖండ వైభవోపేతంగా ఆ సన్మానం జరిగింది.

'ఈ గుడివాడ భద్రగజ మెక్కి సరాసరి వాడవాడ లూ
రేగునెడన్ సుధీంద్రులు, కవీంద్రులు తోఁజనుదేర నాఁడు స
ర్వాగమవేత్త, ప్రౌఢకవితాంబుధి శ్రీకవిసార్వభౌముఁడూ
రేగిన కొండవీటి జన దృశ్యము లిప్పుడు గోచరించుచే.

ఆనాడు సాహితీ సమరాంగణ సార్వభౌముడైన శ్రీకృష్ణదేవరాయల
ఆస్థానంలో పెద్దనాది మహాకవులకు జరిగిన సన్మానాలను అతిశయించిన
ఈ కవిరాజు-సన్మానాన్ని జూచిన ఆంధ్రలోకం హర్షోత్పులకితమయింది.
సన్మాన సంచికలో మొత్తం 82 మంది పండితులూ, కవులూ ప్రసిద్ధ
రచయితలూ, కవిరాజు, ప్రతిభను, వారి సాహిత్య సాంఘిక సేవలను
ప్రశంసించారు. ఆ సందర్భంలో వ్రాసిన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారి
ఆశీర్వచన పద్యాలలో కొన్ని.

1 'బందరు నందు నాకు గల పల్వురు శిష్యులు సూ్కలు శిష్యులై
నం దగు శ్రద్ధతో నితడ నారతమింటికి గూడవచ్చి, యం
దందలి మర్మమున్ దెలియు నాస్థగలాడగుటన్, వరించె నే
నిం, దగురీతిమై త్రిపురనేనిని, సాహితి క్రైత తోడుతన్.

ఈతడొకండెకాదుకవి, యీతని సోదరులెల్ల గైతలో
జాతురివొల్చువారగుట, జన్మపు వంశపుహక్కుగాని యీ
క్రైత బలాత్కృతిన్ గొనినకాంతయనన్ బనిలేదు శిష్యతా
ఖ్యాతియుగాదు, కమ్మదనపుంబసబట్టి గ్రహింపుడీ కవుల్.

1. కవిరాజు సన్మాన సంచిక

ఈతడు కొన్ని పొత్తముల నింతకుమున్నె రచించె, నన్నియున్
జేతము దన్పునట్టి సువిశేషములున్నవి, కానియందులో
సూతపురాణ కల్పనకు, సూదు లసూయకు గొంతలో గియున్
జేతమునందు మెత్తురని చెప్పుదు, సందియమంద లేశమున్.

సూతుఁడె చెప్పినాఁడని, ద్విజుల్ వివదించుట చూచి యెంతయో
చేతమునన్ విచారణముచేసి, తదుక్తుల నాఁగ నీతఁడా
సూతునిచేత నేనెఱుఁగఁజుమ్మనిపించుట నాకునచ్చి, యీ
రీతిని మెచ్చితిన్ గవివరేణ్యులు కాదనరంచు నెంచెదన్.

''బారట్లా'' యితడయ్యు; గైతకొఱకే ప్రాణమ్ములర్పించువా
డై రాజిల్లుచు, ''రాజు'' నాబిరుదు తానార్జించె నప్పట్ల నె
వ్వారెట్లాడిన జంకకెప్పుడు నభిప్రాయమ్ము లాత్మీయముల్
సారజ్ఞుల్విని మెచ్చ శిష్యుడిత డుత్సాహమ్ము మైవాకొనున్.

జాతి ద్వేషము లల్పబుద్ధుల యెడన్ సాక్షాత్కృతిన్ జూపు వి
ద్యాతత్వజ్ఞులు బట్టుమూర్తికి యథార్థస్థాన మీలేదె? యా
ప్రీతిఁబట్టి కులాభిమానమునకున్ విద్వత్తకు దూరమం
చేతోచున్; గుణమున్న మెచ్చుటయె వాసిందెచ్చు నెవ్వారికిన్.

రామస్వామి కవిత్వ తత్వఖని ''బారట్లా'' కులీనుండు వి
ద్యామాన్యుండు శిశుత్వ మాది తన ప్రాయంబెల్ల నక్కైౘతకే
నేమించెన్; ప్రకృతంపు బేరిమికి నానేమంబె ముఖ్యంబు న
న్నే మానించిన యట్లు సంతసిలి నేనీ యాశిషం బిచ్చితిన్.

ఏటుకూరి వేంకటనర్సయ్యగారి పద్యాలలో కొన్ని :

1 "ఓ కవిరాజ నీ కృతులకున్న విశిష్టత యాంధ్ర లోకమం
దే కృతి కుండ బోదు భవదిద్ధ కవిత్వ మహత్వ నైపుణం
బే కవి కందఁబోదు కవులెందఱు వ్రాసిరి వ్రాయుచుండి రా
పోకడ లార్య వాఙ్మయ ప్రభుత్వ పతాకములన్ గదల్చెనా?

నీ కవితా మహాంబునిధి నిర్భర భావ తరంగమాలికా
వ్యాకుల మాంధ్రలోక మొకప్పు డెదుర్కొనలేక నిన్ను నీ
పోకడలన్ శపించి వలపోసినదైనను సవ్యసాచివై
వాకొక బాకు గా విసరివైచి తపస్మృతులంతరింపగన్.

నీ రచనాభిఘాతముల నేఁటి కపారపురాణ గోపుర
ద్వారకవాట పంక్తులు బదాబదలైనవి యింతకీ వహా
ధారణ భావ విప్లవ విధాతవు గైకొన వన్న! దివ్య క
ర్పూర సుగంధవస్తు పరిపూర్ణ సువర్ణజలాభిషేకమున్.

గంగోత్తుంగ తరంగ రింగణ సదృక్షంబైన నీశైలితో
లుంగీగట్టిన కావ్యకన్యకలు వేలున్ లక్షలున్నారు నీ
బంగారంపుఁ గవిత్య వస్తువులతోఁ బైపోటికిన్ నిల్చి మా
పింగాణీ సరుకమ్ముకొన్న యెడఁ గాఫీ నీళ్ళకుం గిట్టునా?"

రామస్వామిగారి కవితా ప్రాభవాన్ని ఇంకనూ అనేకమంది కవులు, పండితులు ఎంతగానో ప్రశంసించారు.

1. కవిరాజు సన్మాన సంచిక

మ. "పదసంధానములో, సుధామధుర కావ్యస్థార్ధ నవ్యత్వమో,
మృదుశయ్యా పరిపాకమో, నవర సోన్మేషత్వలాలిత్య సం
పదలో, సంఘహితైక భాషితములో, వ్యంగ్యార్ధ భావమ్ములో,
కదలింపఁ బ్రతి భానశాలికదచుం గాంధర్వలోకమ్ములన్."

—డాక్టర్ జి. వి. కృష్ణరావు.

శా. "సామాన్యార్థములుగ్గడింపఁడు జగత్సార స్వతంబర్ది వి
ద్యామర్యాద నతిక్రమింపఁడు కళా వ్యాసంగ రంగాలఁ దా
నై మాట్లాడు స్వతంత్ర భావకలనా ఖ్యాతిన్ బ్రిపుర్నేని శ్రీ
రామస్వామి కవీంద్ర సన్నుతుని మార్గంబెన్న సామాన్యమే?"

—ఉమర్ ఆలీషా.

ఉ. "సన్నని సంస్కృతాంధ్రముల సౌరులు గుప్పెడు నీ కలమ్ములో
నన్నయ తిక్కనల్ కదలి నాట్యము సేయుదు రాంధ్ర వాణి బల్
ప్రన్నని హైమనూపుర ఝుళం ఝుళలన్ లయ చక్కదిద్దు నీ
కెన్ని భవంబులఁదొదవె నింతటి పుణ్య మగణ్య మగ్రజా!"

— తుమ్మల సీతారామమూర్తి.

ఉ. "కమ్మని తేట తెల్గు నుడికారము చక్కదనంబులీను; కా
వ్యములు సంతరించి వయారెః యనేకము; లీవు నీ కవి
త్వమ్ము విశిష్ట మార్గమును బట్టి మెలంగుట రూఢి; నీ ప్రపం
చమ్మది వేఱు; నీ యశము సర్వ దిశావిదిశల్ పెనంగొనెన్."

— కొత్త సత్యనారాయణ చౌదరి.

ఆ సందర్భంలో కవిరాజు గారికి గుడివాడ పౌరులు సమర్పించిన సన్మాన పత్రం యిది :—

విద్వత్కవి శేఖరులు, విమర్శ కాగ్రేసరులు, సంస్కర్తలు సంఘ సేవా పరాయణులు నగు "కవిరాజు" శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి గారికి గుడివాడ సీమపౌరులు సభక్తికముగ సమర్పించిన :—

## సన్మాన పత్రము

కవిరాజశేఖరా !

మూర్తిమంతమగు మాతృభాషా సరస్వతిని మఱియొక మారు తెన్గు నాటి మనుగడ మినువాకలో దీనారముల దీర్ఘమాడింప బవిత్ర ఘట్టమును తెరపించిన మహత్తర శుభసమయమగు నీ రోజు ఆంధ్రలోకమున కమందానంద ప్రదమగు నపూర్వ పర్వదినమైనది.

గుడివాడ సీమలో విద్వన్నిలయమగు అంగలూరు గ్రామమున ఖ్యాతి గాంచిన రైతు కుటుంబమున జనించి, కౌమార దశయందే కవితా కర్షకులై సత్కావ్యముల బండించి, విద్యాపిపాస రేకేత్తి నాంధ్రలోకమునకు జూఱలిచ్చి ఆంధ్ర పరిషత్తుచే కవిరాజబిరుదు బహూకృతులై సారస్వత జీవితమును ప్రజాసేవ కంకితమొనర్చి కృతార్థులగు యథార్థకవిసత్తములైన మిమ్ము, నిండుమనంబుతో నాహ్వానించి మీ కళావీర కంకణమునకు కర్పూర నీరాజనములొసగు మహాభాగ్యము గడించి మా గుడివాడ సీమ ప్రజలు నేటికి ధన్యులైరి.

కళానిధీ !

వెన్నెల జల్లును, తేనె సోనలను, కమ్మతెమ్మరులను, కపురంపు బలుకులను దలపించి వలపించెడు మీ లలితకవితా వనవాటిక మృదువద కల కూజితమై సత్యార్థకుసుమితమై సంస్కారభావ సురభిళమై ప్రబోధరస తరంగితమై స్వేచ్ఛానంద ఫలితమై యాంధ్ర హృదయ క్షేత్రముల నిత్య వసంతోత్సవ మొనగూర్చె ననుట కమందానందమందు చున్నారము.

కరవీరాగ్రణీ !

మీ శేముషీబలము హలమై లసవిశిష్ట కళాకృషియందే విరతి లందక కన్యయై ప్రాక్కథానిధులు మధించి, వజ్రమై దాస్యభావవక్ష విచ్ఛేద మొనరించి జయభేరియై నిద్రాణ సంఘశక్తి నుద్బోధించి, మానవసంఘ పునర్నిర్మాణమునకై మార్గములు మలసించెననుటలో నతిశయోక్తి లేదు.

ప్రజ్ఞాధురీణా !

సంఘ దోషములు సంస్కరించి సత్య ధర్మ ప్రతిష్ఠాపనమును గావింప సాహిత్య ప్రపంచమున తామనుసరించిన విలక్షణ కళాసృష్టి విధాన మపూర్వమైనది. అట్టి మీప్రతిభా విశేషమునకు సూతపూరాణమే తార్కాణము. అది వస్తు స్వరూపమును వ్యంగ్యముగ సూచించు భావ చిత్రము వంటి యద్భుతకావ్యము. తఱచిన కొలందిని, నూత్న సత్యములు వెలయించుచు పఠితలమనముల రసవార్ధినుత్తుంగతలూగించుచు గమ్యస్థానమునకు గొంపోవును. ఇట్టి ప్రధాన లక్ష్యము మీదనే శంబుక వధ, గీతాది గ్రంథములు మీకు గల వ్యక్తి సంఘ జాత్యభ్యుదయాకాంక్షను భిన్న మార్గముల వెల్లడించుచున్నవి.

ధార్మిక జీవనా !

కాల పరిణామమును గమనించి లోకకళ్యాణ కాంక్షతో కావ్యప్రయోజనము దేశాభ్యుదయముగా నిర్వచించి వాఙ్మయ జగత్తున క్రియా పూర్వకముగ నూత్నశకమును ప్రారంభించిన మీ ప్రజ్ఞామహిమ ప్రత్యేక ప్రశంసకు బాత్రమైనది మీ రచనలు స్థూల దృష్టిని గాంచి విరుద్ధములని భావించి తొలుత నిరసించినవారే సవిమర్శక దృష్టితో నందలి సత్యార్థములను గుఱుతించి అనుతాపమునంది హృదయ పూర్వకముగా మీ విశాలాశయముల ప్రశంసించి యాదలనిడి సాధింప గడగి రనుట కంటె సంతోష విషయము వేఱుండదు.

విద్వదగ్రణీః :-

గ్రంథకర్తలై, పరిశోధకులై ప్రబోధకులై, మీరు చేసిన కృషి, చూపిన త్యాగము, ప్రకటించిన బుద్ధివైశద్యము, చరిత్ర ప్రసిద్ధములైనవి. మాతృ భాషకును మాతృభూమికిని మీరొనర్చిన అమూల్యమగు సేవకు ఆంధ్రావని కృతజ్ఞతతో మోకరించుచున్నది. మేము చేయు నీ సన్మానమును గ్రహించి మమ్మానందింప జేయుదురు గాక !

ప్రజా శ్రేయోభిలాషతో వాఙ్మయమును సృష్టించుచు దేశ సేవ గావించుటకై మీకును మీ కుటుంబమునకును భగవానుడు ఆయురారోగ్య మిచ్చుగాతయని ప్రార్థించుచున్నాము.

ఇట్లు
పర్వతనేని భూషయ్య చౌదరి
ఆహ్వాన సంఘాధ్యక్షుడు.

## అధ్యక్షోపన్యాసము

కవిరాజు సన్మాన సభకు అధ్యక్షత వహించిన శ్రీయుత బెజవాడ రామచంద్రారెడ్డి గారు తమ అధ్యక్షోపన్యాసంలో యీలా అన్నారు.

"కవియై, శతావధానియై, న్యాయశాస్త్ర వేదియై, యదార్థ వాదియై, ద్రావిడ గౌరవ పక్షపాతియై, తెనుగింటి తెగువదనమును భావించి, సేవించిన వాడై, సర్వ స్వతంత్రుడై రచించెడివాడు ఈ కవిరాజు.

వారి భావములు నూతనములయ్యు మాన్యములే, వారి వాదములు విపరీతముగ గన్పట్టినను హేతు బలయుతములే. వారి వాఙ్మయము నందు చారిత్రక దృష్టియు, వారి చరిత్ర యందు వాఙ్మయ దృష్టియు సమమై సామాన్యములుగా మిళితమై యుండుట మిక్కిలి చోద్యము. స్వతంత్రించి గ్రహించుట యందు ఊహించి, స్వతంత్రించుటయందు వారి కుండెడి ప్రజ్ఞ

గణ్యము. ఆర్య ధర్మ నిరతులకు వారి మాటలు వారి వాదముల బాటలు కనబడక పోవచ్చు. వినబడియు, కనబడియు నవగాహనము కాకపోవచ్చు. కాని వారి ధోరణికి, ధారణకు ఇతరుల తీర్పులు అంతరాయము గల్గింప జాలవు. ''ఎవ్వరేమన్న నం(ద్రుడు నాకేమికొదువ'' అనగల ధీబలశాలురు వాఙ్మయ ప్రపంచమున అరుదు.

ఆశయములందు విప్లవకారులు, కవితాశయములందు పూర్వ పరిస్థితుల ననుసరించి రసజ్ఞతను, రమ్యతను, అనుభవించి ఆనందించ నేర్చువారు. వీరిది యభావమైన భావకవిత్వము కాదు. స్వభావమైన భావలాలిత్యా నందకరమైన మధుర కవిత.

కవితా రసమున భావమునకు ప్రాధాన్యమున్నది, ధారయు స్వాభావి కము. అల్లిక అందము, కందము మకరందము. తేటగీతులు దేటగీతులు, ఆట వెలదులు ఆట వెలదులే. వృత్తములు సువృత్తములు. సంస్కృతీసమాస ప్రౌఢిమందెంత సౌరభము గలదో తెలుగు బోకడ యందంత సమ్మోహనకర మార్దవము గలదు.

ఆర్య ధర్మము అధర్మముగ జూపిన సాహసుడు.

ఈ సన్మానం జరిగిన కొన్ని మాసాలకే రామస్వామిగారికి అస్వస్థత గలిగింది. అది టైఫాయిడ్‌కు దారితీసింది. ఆరోజుకారోజు వారి ఆరోగ్య పరిస్థితి అమితాందోళనను కలిగించింది. డాక్టర్ కొల్లూరి వెంట్రాయుడు గారు చికిత్సచేశారు. అయినా జ్వరం రోజు గడచినకొద్దీ ఎక్కువవుతున్నదే గాని తగ్గతంలేదు. డాక్టర్‌గారు థర్మామీటర్ నోట్లోపెట్టి జ్వరం ఎన్నిడిగ్రీ లున్నదో చూస్తున్నారు. కవిరాజుగారు అపస్మారక దశలో ఉన్నారు. థర్మా మీటరును పటపటమని కొరికారు. అచ్చట వున్నవారంతా కవిరాజు జీవిస్తారే ఆశ వదులుకొన్నారు. ఆంధ్రుల దురదృష్టంకొద్దీ, మహాకవి, భావ విప్లవ

వైతాళికుడు, హేతువాది, యుగపురుషుడు అయిన రామస్వామిగారు తెనాలి లోని వారి స్వగృహం "సూతాశ్రమంలో 1943సం. జనవరి 16వ తేదీ రాత్రి గం. 1-30 ని.లకు కీర్తిశేషులయ్యారు. అప్పటికి వారి వయస్సు 56 సంవత్సరాలు మాత్రమే. ఈ ఆకస్మికవార్త యావదాంధ్ర ప్రజానీకాన్ని దుఃఖ సాగరంలో ముంచివేసింది.

తెనాలి పట్టణ వాసులకూ పరిసర గ్రామీణ ప్రజానీకానికి విషాదచ్ఛాయల ముసుగు విడివడలేదు. కవిరాజు భౌతికదేహం పుష్పమాలలచే అలంకరించబడి తెనాలి పురవీథులగుండా బ్రహ్మాండమైన ఊరేగింపుతో బయలు దేరింది. దారిపొడవునా పూలవర్షం కురిసింది. ఇసుక వేసినా రాలని జన సమూహం విచారవదనాలతో కవిరాజు భౌతిక కాయం వెంటనడిచారు కవిరాజును కడసారిగా చూడాలనే కాంక్షతో, వేలాది ప్రజలు తండోప తండాలుగా గుమిగూడారు. అదొక మహా ప్రస్థానం.

"రామస్వామిగారు పదిసంవత్సరాలు బ్రతికుంటే ఎంత బాగుండేది" ఆ త్రోవనే పోతున్న రైతు తన కన్నీళ్ళు తుడుచుకొంటూ అన్నాడు.

"రామసామిబాబు పోయారా!" అంటూ నోరుతెరచి అలాగే వుండి పోయాడు ప్రక్కనున్న ఓ ముసలాయన.

"చౌదరిగారు తన జీవితమంతా నిస్వార్థసేవలో ఆంధ్రప్రజలకు ధారపోశారు" అంటున్నాడు ప్రక్కనున్న యువకుడు తన ఎడమ చేతితో కళ్ళజోడు తీస్తూ.

"ఆంధ్రసాహిత్య క్షేత్రంలో కొన్ని శతాబ్దాలుగా పూడ్చలేని అగాధం ఏర్పడింది" అన్నాడు మరో తెలుగు పండితుడు.

ఇంతలో శ్మశానవాటిక వచ్చింది. జేష్ఠ పుత్రుడైన గోపీచంద్ గారిచేత పండిత మదనమోహన విద్యాసాగర్‌గారు అంత్యక్రియలు జరిపించారు.

సాహిత్య చక్రవర్తి సాక్షాత్కారం ఆనాటితో సమాప్తమయింది సూతాశ్రమం వెలవెలా పోయి కళావిహీనమయింది.

కవిరాజు నిర్యాణంపట్ల అనేకమంది ప్రముఖులూ, వివిధ పత్రికల సంపాదకులూ, అసంఖ్యాకమైన పండితకవులూ, వారి కుటుంబానికి సంతాప సందేశాలందించారు.

ఉన్నవ లక్ష్మీనారాయణగారు తమ ప్రగాఢ సంతాపాన్ని ఇలా ప్రకటించారు:- "రామస్వామిచౌదరిగారు పరమపదించారన్న వార్తవిని నిర్ఘాంతపోయితిని. నా మిత్రులలో ఇంతటి శుద్ధవర్తనుడు మరియొకడులేడు. సంస్కృతములో మంచిభాషా పరిజ్ఞానము కలవాడు. ఆంధ్రభాష ఇతని కలమునకు స్వాధీనపడినట్లు మరియొక ఆధునిక కవికి స్వాధీనపడలేదని నా నమ్మకము. జాతీయమైన శుద్ధాంధ్రమును వ్రాయగలవాడు తిక్కన తరువాత ఇతడే. "బ్రహ్మద్వేషి" యని ఈయనకు పేరు గలదు. పలువురు బ్రాహ్మణులకుగల శూద్రద్వేషమున కంటే ఈయనకు బ్రాహ్మణద్వేషమెక్కువ లేదు. వేద ఋషుల మతములో అందరికీ సమాన హక్కుగలదనియూ, ఇది కూడదనుట బ్రాహ్మణుల స్వార్థపరత్వమనియూ ఆయన విశ్వసించువాడు. ఇదియే బ్రహ్మద్వేషమైనచో, ఇట్టి బ్రహ్మద్వేషము గలవారు పలువురు బ్రాహ్మణులుగూడా కలరు".

—ఆంధ్రపత్రిక 20 జనవరి, 1943.

"సారస్వతోద్యానములో పరిమళమును గుబాళించుచున్న ఒక పువ్వు రాలిపోయినందుకు దురపిల్లుచున్నాము".

—భారతి, ఫిబ్రవరి, 1943.

"రామస్వామిచౌదరిగారి ఆకస్మిక మరణంతో ఆంధ్రసారస్వత ప్రపంచ నభోమండలమున ఉజ్వలదీప్తితో వెలిగిన తేజఃపుంజమగు నక్షత్ర మొండు జారిపోయినది, అది మన దురదృష్టము''.

—ఆంధ్రప్రభ, జనవరి, 1943

"తనకు వశవర్తిఅయిన లేఖినిని తెలుగునేలలో ప్రబలివున్న కులాంధ క్యాలను కూల్చివేయడానికి, మతమౌఢ్యాలను మాపివేయడానికి, సంఘాన్ని సంస్కరించడానికి, ప్రత్యేక రాష్ట్ర వాంఛను రెచ్చగొట్టడానికి తగు రీతిని వినియోగించి తెలుగునేలను కొలిచినారు. రామస్వామిగారు పరమపదించినారని అకస్మాత్తుగా వినరావడంతో విషణ్ణ హృదయులమైనాము. చౌదరిగారు కీర్తిశేషులవటంతో, తెలుగుదేశం తన సౌఖ్య, సౌభాగ్యాలకోసం సతతం తపించే ఒక అనుంగుతనయుని కోల్పోయింది. తెలుగుజాతి మౌఢ్యాంధ కారాన్ని ఆవలకునెట్టి, ఉజ్వలమైన వెలుగును మనకు సమకూర్చ యత్నించే ఒక క్రాంతికారుని కోల్పోయింది''.

—ఆంధ్రజ్యోతి, 1943

"కవిరాజు, విప్లవకవి రామస్వామిచౌదరిగారు మహాప్రస్థానం చేయ డంతో, నాడు పారిజాతాన్ని కోల్పోయిన దేవతలకు కలిగిన గుండె దిగులు నేడు తెలుగు పారిజాతాన్ని కోల్పోయిన లోకానికి కలుగుతుంది. వీరి భౌతిక శరీరం ఫ్రెంచి విప్లవం లా అంతరించవచ్చును కాని ఫ్రెంచి విప్లవజ్యోతివలెనే వీరి ఆశయాన్నీ, ఆదర్శాన్నీ అభ్యుదయం కోరే ఆంధ్రజగత్తు విస్మరింప లేదు''.

—దేశాభిమాని, 24-1-1943

కవిరాజు త్రిపురనేని రామస్వామిగారు కీర్తిశేషులైనప్పుడు కవిబ్రహ్మ వేంకటనరసయ్యగారు తమ గురుదేవుని యీ విధంగా సంస్మరించారు.

1 "యోగి పుంగవుండు మాగురుదేవుండు
యముని గిముని గాల జమరి పైచి
తాఱు మాఱు లేక నూరేండ్ల పాటైన
బ్రతికి తీరునన్న భ్రాంతి కద్దు.

ఉక్కు పంజరమ్ము లూపిరి తిత్తులు
పొగల సెగల నుడికి పోవుచుండు
వజ్రదేహ మాంధ్ర వాఙ్మయ సేవకై
ధారవోసి మనకు దారిసూపె.

ధర్మవృద్ధు లన్న దరి జేర్చు కొనువేళ
జాతి మత వివక్ష చాయ బోడు
ఆర్యకవి కుతంత్ర మడుగంటి వలెనను
పట్టుదలకె నడుము గట్టినాడు.

ఎన్ని జన్మలెత్తి యీ సిద్ధహస్తుని
కవితలోనఁజేయి గలుప గలము
తెలుఁగు కవుల మంచుఁ దెగరుంజు కొను వార
లితని పదము లాశ్రయింప కగునె?

ఒకట నన్నపార్యుఁ డొకచోటఁ దిక్కన్న
ఒకెడఁ బెద్దనార్యుఁ డొకట భట్టు
కనిపింతు రితని కావ్యదర్పణమున
నయిన వస్తు భేద మగ్గలంబు.

ముప్ప దేండ్ల సేవ కిప్పుడు గుర్తించి
ప్రజలు బ్రహ్మరథము పట్టినారు
కాని విశ్వగురుఁడు కన్నుమూయక మున్నె
మేలు కొనిరి కొంత మేలదైన

అతని గ్రంథ జాల మడుగు పెట్టినచోట
మిత్రులెంతవారు శత్రులైరి
కన్ను దెఱచు కొలఁదిఁ గాలక్రమంబున
ఖేదముడిగి కాళ్ళ బేరమయ్యె.

పరుల మెప్పు గోరి పాటుబడ్డది లేదు
స్వార్థమునకుఁగేలు సాపలేదు
గొప్పతనము సూచి కోడయి కూసిన
జగము మాత్ర మింత సాక్ష్యమిచ్చు.

"రామస్వామిచౌదరి లాంటి మహాకవి, సద్విమర్శకుడు, నభూతో నభవిష్యతి".

—రాడికల్ ఫిబ్రవరి, 1943.

గుమ్మిడిదల వెంకటసుబ్బారావు గారు యిలా తమ సంతాపాన్ని తెలియజేశారు :-

"కవిరాజు, కమ్మకులోద్భవుడు, హిందూమత సంస్కర్త యగు శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరి గారు దివంగతులైనారు. ఆహా ! ఏమి పరంతము ? సూతపురాణకర్తనిక భౌతిక శరీరమున చూడ జాలమా ! ఓ ఆంధ్రదేశమా ! ఎంత దౌర్భాగ్యస్థితికి వచ్చితివి ! మిత్రుని ఆత్మ-తద్వారా తెనుగు సాహిత్య మత విజ్ఞానములు తరించుగాక !"

"కవిరాజు కర్షక కుటుంబానికి చెందినా, కర్షకుల అభివృద్ధినే కాకుండా, మార్క్సు మహాశయునివలె. వివిధకులాలలోని పీడీత ప్రజలను అగ్రజాతి బానిసత్వంనుండి రక్షించిన మహామేటి, సంఘసంస్కర్త, కార్యశూరుడు నిశిత విమర్శకుడు, రామస్వామి చౌదరిగారివంటి విశిష్టత గల వ్యక్తులను వ్రేళ్ళపై లెక్కించవచ్చు.

— గోలకొండ, 1943

"రామస్వామిగారి అస్తమయంతో, "ఆంధ్రదేశంలో సాంఘిక-మత-విద్యా ప్రపంచకములలో ఒక విప్లవ నాయకుడు అంతరించి పోయాడు."

— జమీన్‌రైతు, 23-1-1943

"సనాతనత్వంతోనూ, అర్థంలేని అంధవిశ్వాలతోనూ, కదుడు కట్టుకు పోయిన సంఘంలో ఒంటరిగా నిలిచి, ధైర్యసాహసాలతో శంఖాన్ని పూరించిన విప్లవకవి మనకికలేడు ఏటికి ఏదురీది, తన ఆదర్శమే ప్రధానంగా గైకొని కలంచేతపట్టి, ఎదురొచ్చిన మహామహులను పల్టీలుగొట్టించిన కార్యశూరుడు, సాహసి, స్వతంత్రప్రేమి ఇక కనుపించడు. పూర్వవేదాంత మత బోధల్నీ, పూర్వ మూఢాచారాల్నీ దూయబట్టి, కుళ్ళుతూవున్న సమాజానికి కాలానుగుణ పరిణామవాదాన్ని ఋజువుచేసి చూపి, తన విధ్యుక్త ధర్మాని నెరవేర్చిన అగణిత ప్రతిభాశాలిని మన మెప్పటికినీ చూడజాలము".

— ఆంధ్రాలేబర్ - 24-1-1943

అనేకమంది పండితకవులు, సుప్రసిద్ధరచయితలు కవిరాజు నిర్యాణం పట్ల అశ్రుధారలు గార్చారు. యడ్లపల్లి దేవయ్య గారి... "కన్నీటిధార" చూడండి.

1 సీ. "ప్రాతగాథకు వడపోత పోయగనౌచు
సూతాశ్రమములోని సుగుణు డేడి;
బుధవర్యేణులు మెచ్చి పొంగిపోయెడినూత్న
భావోన్నతినిజూపు ప్రముఖు డేడి ?
తెలుగుభాషకు క్రొత్త తెన్నులఁ జూపించి
విప్లవంబును తెచ్చు వీరుఁ డేడి ?
జాతీయకవనంబు చలపట్టి మున్ముందు
చాటి చెప్పెదనన్న చతురు డేడి ?

గీ. కటకటా ? యిది యేనాటి కర్మమమ్మ
అంధకార మాంధ్రకవిత నావరింపఁ
దెలుఁగువారల గుండియల్ దిగ్గురనగ
జేసితిని మృత్యువా! యిట్టిచేత తగునె?"

దుఃఖ నిమగ్నమై జాతి కన్నీరుకార్చినంతమాత్రాన కవిరాజు యెడల భక్తి శ్రద్ధలు చూపించినట్లుకాదు. వారు తలపెట్టిన ఉద్యమాన్ని కొనసాగించడానికి, వారు నడియాడిన ఉత్తమ మార్గాన్ననుసరించడానికి ఆంధ్రలోకం ఆయత్తం కావాలి.



1. ములుకోల – 1-2-1943.

# సూతపురాణము

సాంఘిక వ్యవస్థలో మార్పువచ్చేముందు భావంలో మార్పు రావాలి. ూఢనమ్మకాలు మటుమాయంకావాలి. అంధ విశ్వాసాలు అంతరించాలి. న్నింటి భారమూ భగవంతునిమీద వేసే అలసత్వం పటాపంచలు కావాలి. న జీవితం యిలా ఉండటానికి, తన చుట్టూవున్న పరిసితులే కారణంగాని రేదో అదృశ్యశక్తి-లేదా-శక్తులు కారణమన్న అపోహ తొలగాలి. అలా ిగినప్పుడే మనిషి తనశక్తిని తాను తెలిసి కొంటాడు. తను ఇలావుండటానికి రణం తనలాంటి వాడేనన్న సత్యం తెలియగానే తన స్థితిని బాగుచేసు డానికి నడుం బిగిస్తాడు. పట్టుదల వహిస్తాడు. కార్యరంగంలోకి ాకుతాడు.

హైందవ మతం యిందుకనేక అడ్డంకులు కల్పించింది. వర్ణాశ్రమ ర్మాలను నెలకొల్పింది. దేవుణ్ణి, దేవతలనూ సృష్టించింది. ద్విజత్వం-బ్రతుకే ండు జన్మలు చేసి పవిత్రమైన అగ్రజాతిగా కొందరిని ప్రచారం చేసింది. రికొందరిని బానిసత్వంలో శాశ్వతంగా ఉంచే సూత్రాలను "మనుధర్మ స్త్రం" పేర సృష్టించింది. జాతివిభేదాలు రెచ్చగొట్టింది. శూద్రజాతికి వాలు చదివేహక్కు లేదంది. ఒకవేళ చదివితే సీసం కరిగించి చెవులలో యమంది. గుడులలోనికి పోవడం పాపమంది. రాజు దైవాంశ సంభూ డు గనుక తప్పు చేయడంది. ప్రజలకు ప్రశ్నించే హక్కు లేదంది. ంతా మన పూర్వజన్మ సుకృతంపైనే ఆధారపడి ఉంటుందంది. ఈ జన్మలో వంచేస్తే నరకంలో యమ బాధలకు గురికావలసి ఉంటుందని భయ

పెట్టింది. ఈ జన్మలో పుణ్యంచేస్తే స్వర్గానికి సోపానాలు వేయడమే దంది. కర్మ ఫలితం అనుభవింపక తప్పదంది ? అంతా మీ కర్మ ఒక్క ముక్కతో విశ్వమంత మనిషిని మట్టిముద్దగా మార్చే మానవునిలోని శక్తిని నీళ్ళుగార్చేసింది.

ఇలాంటి సంఘస్థితి అగ్రజాతివారికే అసహ్యత కలిగించింది. పుట్టించింది ఈ దుస్థితిని తొలగించి సంఘాన్ని సంస్కరించవలసిన కతను కందుకూరి వీరేశలింగం పంతులుగారు గుర్తించారు. 1894సం రాజమహేంద్రవరంలో నెలకొల్పబడిన 'ప్రార్థన సమాజం' లో పం గారు గావించిన... ఉపన్యాసంలోని కొంత భాగమును ఇచ్చట ఉట న్నాను. [1] ''స్వప్రయోజన పరులైన కొందరు సర్వజనులను మూఢత్వ ముంచి, దేవతారాధనమునుమాని తమ్మారాధించుటయే పరమా బోధించుటచేత పరులను చెఱచి తామును పాడగుచున్నారు. ఒర జెఱువదలచుకొన్నవాడెప్పుడును తాను బాగుపడడు. తమ పాదధూళి శిర దాల్చుటయే పరమార్థమని ఇతరులకు సదా బోధించుచుండుటచేత వారిక విద్యయయు సత్య విద్యలన్నియు మూలబడినవి. అందుచేత పర్వతము నదులకును బిడ్డలు పుట్టుట వారికి గొప్ప సత్యము. కల్లు సముద్రములు నేతి సముద్రములును వారి భూగోళ శాస్త్రము. సూర్యచంద్రులను పాము మ్రింగుట వారి ఖగోళశాస్త్రము. స్వకాయకష్టము విడిచి ఋట్టి స ములు బోధించి జీవించుట వారి కులవృత్తి. ఇట్టి జ్ఞానవంతులు తామే స జ్ఞులమను కొని యున్న నాలుగు శాస్త్రములను తామే యభ్యసించి ఇతరు చదువ నీయక పూర్వోక్త సత్యములను ప్రవచించియే యాత్మాభరణము కొనుటచేత వారికి నిజమైన జ్ఞానము సంపాదించుటకుగాని, వృద్ధిపొంది టకు గాని జనులలో వ్యాపింప జేయుటకుగాని యావశ్యకము లేకపోయిన అందుచేత క్రొత్తవిద్యలు రాకపోగా క్రమ క్రమముగా నున్న విద్యలు స తము నశించి వారి కితరులను వంచించుటలే కులవిద్యలైనవి. ఈ కార మును బట్టి మనదేశము నందు భూజనులకు మాత్రమేకాక భూదేవతలకును

1. వర్ణము.-శ్రీ కంధుకూరి వీరేశలింగంపంతులు

నవృద్ధిలేక మూఢత్వం సంప్రాప్తమయినది. మనదేశముయొక్క బీదతన
నకు గూడ కొంత వరకీ వర్ణభూతమే కారణము. కల్లలకొడిగట్టి కూటసా
ములు పలికి దుర్దానములు పట్టి పొట్టపోసుకొను కుక్షింభరాధములు తమ
శ్చరిత్రమునకు సిగ్గుపడుటకు మారుగా, సత్యసంధులయి యను
త్రమును ధర్మమార్గము నతిక్రమింపక కష్టార్జిత ధనముతో జీవనము
ము బ్రాహ్మణేతరుల కంటెను జాతిమాత్రము చేతనే తామధికుల మయితిమని
్వపడుచు వారి గాలిసోకినను తాము మైలపడుదుమని భావించుచున్నారు.
కై దుర్గర్వముచేత మనుష్యలక్షణములైన దయా దాక్షిణ్యాదులును, నీతియు
నవారి హృదయ వాసమునుండి పారి పోగా వానిస్థానమున రాక్షస
ణములైన నిర్ధయత్వాదులును దుర్నీతియు హృదయ కుహరములయందు
వేశించి యథేచ్ఛగా రాజ్యము చేయుచున్నవి. అగ్రజాతివారమని గర్వపడు
ందసులు తమకన్నుల యెదుట చెట్టు విరిగి శూద్రునిమీద పడినను
యికిదీయక దయా శూన్యులయి తాకినచో దమకు మైలసోకునని దూరముగా
లగుచున్నారు''. స్వార్థపరులైన అగ్రజాతి తమ నిరంకుశత్వాన్ని
ంబెట్టుకోడానికి అనువుగా సృష్టించిన పౌరాణికాది గ్రంథాలు; స్వర్గనరకాలు
కవంక - మతం, భగవంతుడు మరో వంక - ఈ స్థితికికారణాలని
మస్వామి గారు భావించారు. వారు పెను తుఫానులా విజృంభించి
ధ్యాత్మిక వాదం పేరు మీద గానూ, వర్ణవ్యవస్థపేరు మీదుగానూ జరుగు
న్న కల్మషాన్ని శాశనం జేయాలని సంకల్పించారు.

చౌదరి గారు సకల పురాణాలనూ, సాంగోపాంగంగా చదివారు.
ందలి పరస్పర విరుద్ధ గాథలు వారి కనేక సందేహాలను గలిగించాయి.
సందేహాలను తీర్చుకోడానికి విజ్ఞాన ధురంధరుల మనిపించుకొన్న వారి
ద్దకు వెళ్ళారు. ఆ పండితులు వారి సందేహాలను తీర్చడానికి బదులు అసలు
లా ప్రశ్నించడమే తప్పన్నారు.

"అనుమాన మిది యెట్టు లపనయింతు వాయన్న
సపచారమని పల్కునార్యు(డొక(డు
సందేహ మీవంచ సంభవించెనటన్న
నపరాధమని చెప్పు నార్యు(డొక(డు
మలికితం బీగతి మలసె నామతినన్న
నది దోషమని యా(డు నార్యు(డొక(డు
విచికిత్స యీయోజ విస్తరించెనటన్న
నహితాచరణమను నార్యుడొక(డు

శంకలను బాపనేరక మంకుతనము.
జూప నెవ్వడు(తల యూచు(జూచి చూచి?
యుక్తిలేని మాటకు(జెవియొగ్గ(గల(డె
వరు(డెవండేని విస్రంభవరు(డుదక్క?"

ఈ విధంగా ప్రశ్నించడమే తప్పు అని పెద్దలనేటప్పటికి రామస్వామి గారిలో వున్న "హేతువాద శక్తి" విపరీతంగా విజృంభించింది, సత్యాన్వేషణకు పూనుకొనేటట్లు చేసింది.

ప్రపంచంలోని దురాచారాలను రూపు మాపి, నీతిని నెలకొల్పడానికి రామస్వామి గారు సూతపురాణం రచించినట్టుగా ఈ క్రింది పద్యం వల్ల తెలుస్తున్నది.

"ధర్మము ధర్మమంచు(బెటబారులు త్రొక్కుచు నానలేకదు
ష్కర్మము లాచరించు కలికాలపు(బెద్దల(గాంచి తప్పు(డై
మర్మము విప్పి చెప్పి మను మార్గమునన్ నడిపింప లోకమున్
నిర్మలు(డైన సూతముని నీతులు పల్కె(డు నాముఖంబునన్"

చిరకాలజీవి, పరమకరుణా స్వభావుడు, గంగానదీతీరమున తపోనిష్ఠా గరిష్ఠుడు అయిన సూతమహర్షిని రామస్వామి గారు సందర్శించి, పుణ్యభూమిగా గణనకెక్కిన ఈ భారతదేశంలో భగవంతుని పేరు మీదుగానూ, స్వర్గ - నరకాల పేరుమీదుగాను, పూర్వగ్రంథాల పేరుమీదుగానూ జరుగుతున్న ఆపచారాలనూ, అన్యాయాలనూ, అసత్యాలనూ సూతునిముందు ఏకరువు పెట్టారు. రామస్వామి గారికీ సూతమహర్షికీ సుదీర్ఘమైన వాదోపవాదాలు జరిగాయి. ఎట్టకేలకు భారతదేశంలో జరుగుతున్న వంచనను, మోసాన్ని అవగాహన చేసికొన్న సూతముని రామస్వామిగారిని లోకకళ్యాణార్థం ఓకావ్యం వ్రాయమనగా వారి ఆజ్ఞానుసారంగా పాతపురాణం గాని ఈ సూతపురాణాన్ని రచించారు. సూతపురాణ రచనావశ్యకతను పీఠికలో రామస్వామి గారు ఇలా వివరించారు. ''ప్రాకృతజనంబునకు వేదార్థము సులభైక వేద్యము కాదని యోజింగి వైదికులును, నిష్కాములును, లోకసంసర్గ రహితులును, నిసర్గభూతదయాశీలురును నయిన ఋషిచంద్రులు నిర్వ్యాజకరుణా విశేషంబున 'స్త్రీ శూద్ర ద్విజబంధువులకు'' ముక్తి మార్గముఁజూపి తరింపజేయుటకునై వేదార్థము నుటంకించి పురాణములు వ్రాసిరని ఆర్యోక్తి. ఈయార్యోక్తియందు విశ్వాసముంచి మూఢలోకంబు పురాణము లాదేయములనియుఁ, దత్కారణమున బూజ్యములనియు, దదంతర్గత ధర్మములు నీతులు, కథలు శిరోధార్యములనియు విశ్వసించుచున్నది. ఈ విశ్వాసము వలనఁగలిగిన ప్రతిఫల మాత్మద్రోహముగాఁబరిణమించుటఁజేసి పురాణము లెంతవరకుఁ బ్రతికూలములో, ఎంతవరకు నీతి బాహ్యములో ఎంత వరకు బక్షపాతభూయిష్ఠములో మోసపుగన్నుతోనున్న విద్వల్లోకమునకుఁజూపించు తలంపుతో సూతపురాణము రచింపబడినది. తత్కారణమున సూతపురాణము కారణజన్మ.'' దేశకాల పరిస్థితులను గమనించి గతానుగతికంగా ఆంధ్రప్రాయంగా పోతున్న ప్రజాజీవితంలో భావవిప్లవాన్ని, కలిగించడానికిగాను కలాన్ని పట్టిన యుగకర్త కవిరాజు. సత్యాన్వేషణ దృష్టితో తాను యధార్థమని విశ్వసించిన సిద్ధాంతాన్ని నిర్భయంగా లోకానికి ''సూతపురాణం'' ద్వారా వెల్లడించారు.

'సూతపురాణం' నాలుగు ఆశ్వాసాల రసవత్కావ్యం. ప్రథమాశ్వాసంలో కౌశికునికి జ్ఞానోదయం కలిగించిన ధర్మవ్యాధుడనే కసాయివానికథ, భద్రాద్రి గోపన్నను రామదాసుగా మార్చిన కబీరుదాసు వృత్తాంతము, ద్వితీయాశ్వాసంలో దేవతలను గూర్చి, దేవలోకాన్ని గూర్చి చర్చించడం జరిగింది. తృతీయాశ్వాసంలో ప్రహ్లాద చరిత్ర, యథార్థరామాయణం, చతుర్థాశ్వాసంలో శ్రీకృష్ణ చరితము, కురుపాండవులకథ చక్కగా వివరింపబడ్డాయి.

ఈ గ్రంథ పీఠికలో కవిరాజు కృత, త్రేతా, ద్వాపర, కలియుగ ధర్మాలను విపులీకరించారు.

మతవ్యవస్థలో మహాకుట్రవున్నదని రామస్వామి గారి నమ్మకం. తాను నమ్మిన సిద్ధాంతాలను ఆచరణలో పెట్టడానికే తనకవితను సాధనంగా వినియోగించారు. జన్మాధిక సూత్రకారణంగా అగ్రజాతి సంఘంలో తామే పెత్తనం జేయాలనడం, ఇతర జాతులు తమ "కర్మ" ఫలితం అనుభవించక తప్పదనడం రామస్వామిగారిని విస్మయ చకితులను చేసింది. హిందూ మతానికి మూలస్తంభమైన కర్మ సిద్ధాంతాన్ని వారు ఎంత నిశితంగా విమర్శించారో చూడండి :-

గీ. "విభుఁడొకఁడు చేయునంట పై పెత్తనంబు !
కర్మయొకఁడు సంసారచక్రంబుఁద్రిప్పు
నంట ! ! ద్వంద్వ ప్రభుత్వమిం దమరలేదె?
ఎంతకాలంబు సాఁగునో యిట్టిచిట్ట !

గీ. దక్షిణాఫ్రికా యందు నిర్దయులు తెల్ల
వారు భారతీయులఁబెట్టుపాట్లఁగాంచి
గొల్లుమని యేడ్చు నెంతో గగ్గోలు పడుచుఁ
బనవుచుండును నీనాటిఁ బ్రాహ్మణుండు.

గీ. కాని తానుమాత్రమొ యంటరానివాండ్రు
ముట్టరాదూళ్ళను ప్రవేశ పెట్టరాదు,
పొమ్మనుచునుండు మాలల బోధపడదు
తండ్రి ! నేంటి బ్రాహ్మణుని చిత్రప్రవృత్తి''

అలాగే పునర్జన్మ సిద్ధాంతాన్నికూడా ఆయన త్రోసి పుచ్చారు ఈ క్రింది పద్యంలో.

''ఎన్ని పుట్టువుల్ దొల్లి నేనెత్తినానొ
యెఱుకలేన్ యున్నదదృష్ట గరిమచేత
నదియె కల్గినఁదల్లి దండ్రులందఱకును
వట్టిపోవుదు దండముల్ పెట్టలేక''

రామాయణ, భారత, భాగవతాలను సూతపురాణంలో నిశితంగానూ, నిష్పాక్షికంగానూ, కళాత్మకమైన విమర్శనా దృష్టితోనూ పరిశీలించారు రామస్వామిగారు. తెలుగుదనం ఉట్టిపడేటట్టుగానూ, భాషా విషయికంగానూ, కవిత్వదృష్ట్యా పాతపురాణాలపై గొడ్డలిపెట్టుగా విసరబడిన గొప్ప విమర్శనాత్మక గ్రంథం సూతపురాణం. ఆంధ్రసాహిత్య క్షేత్రంలో విమర్శనాత్మకమైన రచనలపంట మిక్కిలి తక్కువ. రామస్వామిగారివలే చక్కగా, చిక్కగా విమర్శనలు వ్రాయగలిగిన కవులనుగానీ, పండితులనుగానీ వ్రేళ్ళమీద లెక్క బెట్టవచ్చును. సూతపురాణంలో రామస్వామిగారు పాతపురాణాలలోని అభూతకల్పనలను ఎలుగెత్తి చాటారు. మచ్చుకి ఈ క్రింది పద్యాలను పఠించండి.

సీ. "అంబుధిస ప్తకం బాపోశనముఁ జేసె
నొక్కరుండనిచెప్పు నొక్క కథను
సర్వభూచక్రంబుఁ జాపచుట్టగఁ జుట్టె
నొక్కరుండనిచెప్పు నొక్క కథను
సప్తాశ్వజాయకై సానఁ బట్టెను బట్టి
యొక్కరుండనిచెప్పు నొక్క కథను
కొండకై ఎగిరెడి కొండఱెక్కలు గూల్చె
నొక్కరుండని చెప్పు నొక్క కథను.

గీ. క్రోతికొండ ముచ్చులకును గొండలకును
మానవులు పుట్టిరనునట్టి 'మాయమాట'
లన్ని కథ లీ పురాణము లందె కలవు
పిట్టకథలకు నివియెల్లఁ బుట్టినిండ్లు."

సీ. "మండూక్యముని లోకమాన్యుండు మండూక
మునకు జన్మించినాఁడనెడి రీతి
సుశ్లోక చరితుండు శుకయోగి శుకిగర్భ
మున సంభవించినాఁడనెడి రీతి
మౌనితల్లజుఁ డైనశౌనక బ్రహ్మర్షి
శునిగర్భమునఁ గల్గె ననెడు రీతి
అఖిలాస్త్ర సంవేదియైన యశ్వత్థామ
యశ్వమునకుఁబుట్టె ననెడి రీతి

గీ. వినుము ప్రాచీనబర్హికి వేయిగనులు
కలవని పురాణములు పల్కుఁ గంఠమెత్తి
వేయికన్నులు నాకుఁ గన్పించలేదు
పొడలుమాత్రము కన్పించె నొడలినిండ."

వాల్మీకో, వ్యాసుడో నిజంగా ఈ పురాణాలను వ్రాసివుంటే వాటిలో యిన్ని అసంబద్ధాలు (Improbabilities) ఉంటాయా? కాబట్టి "వ్యాసుడు వ్రాయలేదు, ప్రతిభాధ్యుడు సూతుడు చెప్పలేదు" అన్నారు రామస్వామిగారు. అయితే, ఈ పురాణాలను ఎవరు వ్రాసినట్లు? ఆంధ్ర దేశంలో ప్రచారంలో వున్న అనేక చిత్రవిచిత్రమైన కథలు తెనాలిరామలింగని మెడకంట కట్టినట్లుగా, అగ్రజాతి స్వార్థబుద్ధితో రచించిన గ్రంథాలను, వ్యాసునిమెడ కంటగట్టిందని సూతుడు రామస్వామిగారితో యిలా అంటాడు.

శా. నా పేరన్ వెలయించి నామెడకు నంటన్‌గట్టి తద్గ్రంథముల్
నాపై నేరము మోపగాఁదలఁచి యన్యాయంబు న్యాయంబుగాఁ
బాపంబున్ సుకృతంబుగాఁగ రచియింపం జాలినా రెవ్వరో!
నాపైఁబెట్టినయట్టి యీ యగడు మాన్పంగాఁ బ్రయత్నించెదన్."

పాతపురాణాలలోని అంశాలను నిజాలని భ్రమపడరాదనీ, కల్పనా పటిమకంటే మించి వాటికి ప్రాధాన్యతలేదని కవిరాజుగారి దృఢ విశ్వాసం. ఈ ప్రగాఢ విశ్వాసంతోనే ఒక్క పట్టున—

'లోకులు దిట్టిన నిజమే, వాకొనగా గట్టి పట్టుబట్టిన వాడన్
లోకుల, యిష్టానిష్టములా! కవిలోకంబు కలము నాకట్టంగ'

అంటూ 1925 సం. లో మొదలు పెట్టి సూతపురాణం నాలుగు ఆశ్వాసాలు రచించారు. అగ్రజాతి అధికారసాధనాలను నిశితంగా విమర్శించి, హేతువాదానికి (Rationalism) ప్రత్యేక స్థాన మిచ్చి, బానిసత్వంలోవున్న ప్రజాబాహుళ్యానికి చైతన్యం కలిగించి, మూఢవిశ్వాసాలను పటాపంచలుజేసి, అగ్రజాతి నిరంకుశత్వం యొక్క పునాదులను కదలించిన "భావవిప్లవ విధాత" రామస్వామిగారు.

ఆంధ్ర సాహిత్యంలో సూతపురాణ ప్రచురణతోనే హేతువా
సాహిత్యయుగం ప్రారంభమయింది.

దేవభాషయైన సంస్కృతాన్ని ద్విజేతరులు చదవకూడదనీ, చదివి
నరకప్రాప్తి కలుగుతుందని విప్రులంటున్నారనీ, వివేకవంతులైన
అభిప్రాయమేమిటి? అని రామస్వామిగారు అడిగారు. అందుకు సూతుడ
ఇలా అంటాడు.

శా. "కార్యాకార్య వివక్షనుం దెలిసియుం గాలుష్యముందూటcగా
ధైర్య స్థైర్యములేక ధర్మముల నుద్ఘాటింతురే? భూసురుల్
మర్యాదన్ దిగద్రావి యీసరణి రామస్వామి! చిత్రంబహో!
ఆర్యావర్తము పుణ్యభూమియటె కట్టా! యేమికానున్నదో!!"

దేవభాష నభ్యసించడానికి శూద్రులకు అర్హతలేదనీ, తెనుగ
చదవడానికి భూసురులు యోగ్యులుకారనీ భావించే వారికోసం "కబీరుదాసు
పూర్వజన్మవృత్తాంతము"ను మిక్కిలి మనోహరంగా వర్ణించారు.

గోదావరీ మండలంలోని ద్రాక్షారామంలో దేవశర్మ అనే భూసురునికి
ఒక బాలుడు జన్మించాడు. తల్లిదండ్రులు కుమారునికి "శాస్త్రి" అని
నామకరణం చేశారు. శాస్త్రి పిన్నవయస్సులోనే గురుముఖంగా చతుష్షష్టి
కళలను కూలంకషంగా నేర్చుకొని, పాండిత్యప్రతిభా పరిణతుడయ్యాడు.
శాస్త్రి చక్కని గానకోవిదుడు, కంఠమెత్తి సామగానంజేస్తే తుంబురుడు
త్రుళ్ళిపడి తాంబురఅటుపారవేసి, చెవులు నిక్కించి వినవలసిందే.
సంస్కృతంలో చదవని చదువే లేదు. కాని తెలుగు భాషను చదవడం వారి
ఇంట సంప్రదాయంకాదు. అందుచేత శాస్త్రికి తెనుగు భాషను నేర్పించడానికి
దేవశర్మకు ఇష్టంలేదు కాని అన్ని భాషలలోను పండితుడనిపించుకోవాలనే
తాపత్రయంకొద్దీ శాస్త్రి, తండ్రి మాటలను పెడచెవినిబెట్టి తెనుగుభాషను

అభ్యసించడం ప్రారంభించాడు. ఒక సంవత్సరంలోనే ఆ భాషను ఆమూలాగ్రంగా నేర్చుకోగలిగాడు. కాని ఏం ప్రయోజనం? తెనుగు చదవడంతో అతనికి "మనోజాడ్యం మోసులెత్తి" బుద్ధికి విడాకులిచ్చాడు. అతనికి స్వాస్థ్యం లేకుండా పోయింది. దేవశర్మ ఆరోజుకారోజు దిగులుతో కృశించి పోసాగాడు. ఎట్టకేలకు శాస్త్రి మరణించి కొంతకాలం నరకం అనుభవించి, శ్రీరంగంలో ఒక ఆవుదూడగా జన్మించాడు. పాపం! తెనుగుభాషను నేర్చుకొన్నందుకు శాస్త్రికి ఎంత దుర్గతి పట్టింది!

ఈ విధంగా "శూద్రులు సంస్కృతభాషను, భూసురులు తెనుగు భాషను చదవకూడదు" అని అగ్రజాతి సంకుచిత మనస్తత్వంతో ఏర్పరచిన నిబంధనలను నిశితంగా విమర్శించారు రామస్వామిగారు. వారి పరిహాసం పరాకాష్ఠను చేరుకొంది.

ద్వితీయశ్వాసం రామస్వామిగారి కమనీయమైన కవితా శైలికొక మచ్చుతునక. అందులోని ప్రతిపద్యం ఒక రసగుళిక. 'నందనోద్యానము'ను వారు ఆపాత మధురంగా వర్ణించినది ఈ ఆశ్వాసంలోనే. ఇందులోనే కవిరాజు ప్రతిభావ్యుత్పత్తులు ద్యోతకమౌతాయి. "గంగావతరణము"ను విమర్శించినది కూడా ఇందులోనే. సగర చక్రవర్తి పుత్రులు యజ్ఞాశ్వమును అన్వేషిస్తూ పాతాళలోకంలో సమాధి వ్యవస్థలో వున్న కపిలమహర్షిపై నేరమారోపించి అతని కోపాగ్నికి బూడిదరాసులై పోయారనీ, ఉత్తమలోక ప్రాప్తికై వారి అస్థికలపై, మనుమడైన భగీరథుడు కాలి బొటనవ్రేలిపై నిలబడి, బ్రహ్మాండమైన తపస్సు చేసి, భూలోకంలోకి గంగను తెచ్చాడని పాతపురాణాలు ఘోషిస్తూన్నాయి. అది యథార్థమని విశ్వసించని రామస్వామిగారు గంగావతరణ ఘట్టాన్ని పేలపిండిగా ఊదివేశారు. ఆ సందర్భంలోని ఈ రెండు పద్యాలను మచ్చుకి ఇక్కడ పొందుపరుస్తున్నాను.

సీ. "గగనంబులోనుండి గంగమ్మ శివుమస్త
మున దూఁకె ననుమాట ములుచమాట
అతి తపోనియతిచే నల భగీరథుఁడు గం
గను దెచ్చె ననుమాట కల్లమాట
గంగాజలంబుచేఁగంధి నిండింపఁగా
బడియె సుమ్మనుమాట బడుగుమాట
శైవ జటాజూట సక్తయై తిరుగాడె
వేల యేండ్లనుమాట వెఱ్ఱిమాట.

గీ. సగరసుత భస్మరాసుల సరవి దడపి
స్వర్గమునకంపె ననుమాట వట్టిమాట
[illegible]నేర్పెడి కవుల గంటాలవ్రాఁత
కాదనఁగరాదు ప్రాచీన కవులుగాన."

సీ. "కైలాసగిరి ముందుఁగల గండశైలంబు
పుడుపులిచ్చెడి లింగమూర్తి గాఁగ
అల్లిబిల్లిగఁజుట్టు నల్లు పుష్పలతా చ
యంబు చంద్రార్ధ జూటంబుగాఁగ
ప్రస్థంబుపైనుండి పడుచున్న జలధార
తరళగంగా ప్రపాతంబు గాఁగ
పడి జాలుగాఁబాఱు వఱ్ఱు భగీరథు
నడుగంటి చను గంగ నడకగాఁగ

గీ. నమ్మకం బుట్టిపడునట్టు నక్కబుద్ధి
పూర్వకంబుగా లోకము బుండలించి
చిత్రకథ వ్రాసినారు ప్రాచీనకవులు
స్వార్థమో ! పరార్థమొ భగవంతుఁడెఱుఁగు''

తృతీయాశ్వాసంలో దవిడుల పట్లా, ద్రావిడదేశం పట్లా రామస్వామి గారికి గల గాఢాభిమానం ద్యోతక మౌతుంది.

యధార్థ రామాయణములోని 'రావణాసురుని' వర్ణన పై విషయాన్నే ధృవ పరుస్తున్నది.

''పది దిక్కులను గెల్చి బహుజయ స్తంభముల్
పాతి పెట్టించిన బల్లిదుండు
పది శాస్త్రములు గట్టిపట్టుతోఁ బఠియించి
ప్రజ్ఞాధురీణుఁడౌ పండితుండు
పదునాల్గులోకముల్ బవరాన నోడించి
కాలి క్రిందనుబెట్టు కాలిబంటు
పదియారు కళలఁ బ్రపంచంబుఁదనియించు
శశిచెంపఁ గొట్టిన సౌమ్యమూర్తి

కడుపులో చల్ల రవ్వంత కదలకుండ
ద్రవిడ జాత్యబ్ధి మాని యథార్థవాది
ప్రాజ్యరాజ్యమేలుచు నుండె రావణుండు
దర్పితాహిత లోక విద్రావణుండు.''

చతుర్థాశ్వాసంలో శ్రీ కృష్ణుడవతార పురుషుడుకాడనీ, అతడొక రాజకీయవేత్తనీ ఆర్యుల అనుగ్రహంతో, వారి బంధుత్వంవల్ల తన జాత్యంతర్భాగాలైన భోజవృష్ణ్యాది జాతులలో బాంధవ్యం ఏర్పాటుచేసుకొని రాజ్యాభిషిక్తుడై ఆర్యమతోద్ధరణకు కృషిచేశాడని భావించారు రామస్వామి గారు. అతడు ద్రావిడుడైనప్పటికీ, జాత్యాభిమానాన్ని త్యజించి, అనేక మంది ద్రావిడులను వధించాడు. కట్టకడకు అతడు కృతార్థుడు కాలేక పోయాడు. శ్రీ కృష్ణుని అనంతరం యాదవ కులానికి చెప్పరాని దుర్గతి పట్టిందని రామస్వామి గారితో సూతుడుయిలా అంటాడు.

సీ. ''కామోపభోగముల్ కాంక్షించి వాంఛించి
చెలరేగి యాదవ స్త్రీజనంబు
మితిమీరి గతిఁదప్పి మ్లేచ్ఛకిరాత ని
షాద పురుషాళి వజ్జఁజేరి
కాంతారవీథులఁగదలిపోయిరి వారు
మరులెత్తి సరిక్రొత్త మగలతోడ
శ్రీ కృష్ణసంతతి చిరయశోవంతుని
చెలిమి చుట్టరికంబుఁజేసియుండి

గీ. యతఁడు చనినంత కుల గౌరవాదులైన
సరకుసేయక దుశ్చింత జారపాళిఁ
గూడియేగిరి కామార్త కుటిలు లగుచు
నేమికలదు రామస్వామి ! యింకఁజెప్పఁ

సూతపురాణం ఇంకా ముద్రణకాక పూర్వమే, దానిలోని పద్యాలు ఆనాటి కవులదాకా ప్రాకివచ్చాయి. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు కూడా అందులోని కొన్ని పద్యాలను ఎవరినోటనో విన్నారట; ఆ పద్యాలు వారిని ముగ్ధుల్ని చేశాయట. కవిరాజుగారికి జాబురాసి పిలిపించుకొని, అంతవరకు

రాసిన పద్యాలన్నీ కవిరాజుగారి ద్వారానే విన్నారట. రామస్వామిగారి భావనా పటిమకూ, కల్పనా వైచిత్రికీ అచ్చెరు వందిన వారి గురువర్యులు కింకవీంద్రఘటా పంచాననులైన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు—

కం. [1]"బూతుపురాణముకాదిది
ప్రాంతపురాణమునుగాదు, పాతకహరమౌ
సూతపురాణం బియ్యది
పూతపురాణంబు పుణ్యపురుషావళికిన్."

అంటూ "యోగ్యతా పత్రం" ఇచ్చారు.

1958వ సం. గుడివాడలో కవిరాజుగారి వర్ధంతి జరిగినప్పుడు ఉపన్యసిస్తూ వేలూరి శివరామశాస్త్రిగారు ఈ విషయం రూఢిపరిచారు. సూతపురాణంలోని ఆ కందపద్యం శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారిదేననీ, ఆ కావ్యానికి యోగ్యతా పత్రంగా, శాస్త్రిగారాపద్యాన్ని చౌదరిగారికి వ్రాసి యిచ్చారనీ శివరామశాస్త్రిగారు చెప్పారు. ఈ విషయం చెళ్ళపిళ్ళతో సన్నిహితంగావున్న కారణాన తనకూ, తనలాంటి ఏ ఒకరిద్దరికోతప్ప ఎక్కువ మందికి తెలియదని కూడా వారే అన్నారు. శివరామశాస్త్రిగారు యధార్థాన్ని బైటపెట్టారు గనక సరిపోయింది. లేకపోతే అప్పటికీ, ఎప్పటికీగూడా ఆ పద్యం చౌదరిగారిదనే అభిప్రాయంతోనే ప్రజలు వుండవలసివచ్చేది. [2]దిగవల్లి వేంకట శివరావుగారు కూడా పై విషయాన్నే ధృవపరిచారు.

దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు "సూతపురాణ మును బోలు మరియొక సృష్టి ఇంతవరకును ఉత్పన్నము కాలేదు. కాబోదు.

1. ఆంధ్రప్రభ వారపత్రిక 30-12-1959.
2. రాజమండ్రి సమాలోచన - శ్రీ దిగవల్లి వేంకట శివరావుగారు.

సంస్కృతపురాణములలోని అభూతాంశములు, స్వకపోల కల్పిత గాథలు సూతపురాణములో గోచరింపవు ఇందులోని కవిత సుధా మధురము. మొత్తము గ్రంథమొక అమృత ఝురి. తెలుగు సాహితి కొక నూతనసృష్టి! క్రొత్త వెలుగు, ఇలాంటి ఉత్తమ పౌరాణిక విమర్శ నా గ్రంథమును ఆంధ్రులకు ప్రసాదించిన రామస్వామి చౌదరి గారికి పౌరాణిక ప్రపంచమున వాల్మీకికిగల స్థానము గలదు'' అని రామస్వామి చౌదరి గారిని అభినందిస్తూ వారే స్వయంగా ఆ గ్రంథాన్ని సమీక్షించారు,

ఉన్నవ లక్ష్మీనారాయణ గారు తమ అభిప్రాయాన్ని ఈ విధంగా వెల్లడించారు : ''త్రిపురనేని వారిది పండిత వంశము. కవిరాజున కపారమైన పాండిత్యము గలదు. సంస్కృతాంగ్ల భాషలలో గాఢమైన ప్రవేశమున్నది. అందు చౌదరిని పండిత కవి యని చెప్పనొప్పును. సూతపురాణము రచించు నాటికి వారి కవిత్వము పండినది. శివకవులను మించి జానుతెనుగులో వ్రాయగలిగిరి. మధురమైన శైలి. సంభాషణలో అంత పెటుకుగా మాట్లాడే మనిషి అంత మృదువుగా ఎలా వ్రాస్తాడా అనిపిస్తుంది. వారి గ్రంథము లన్నిటిలో సూతపురాణ ముత్తమకావ్యము. అందులో అమృతపు సోనలు గలవు.''

శతావధాని వేలూరి శివరామశాస్త్రి గారు ''వ్యక్తిగతమైన భావాలను స్వతంత్రంగా వ్యక్తంచెయ్యటం అందరి చేతగాదు లోకానికి ఇష్టమైనా కష్టమైనా లక్ష్యం చేయకుండా స్వభావసిద్ధంగా స్వధర్మాన్ని వ్యక్తంచేసిన వ్యక్తి కవిరాజు. కవిత్వం అంటే కేవలం శబ్దాడంబరంతో కూడిన సమాన భూయిష్ఠమైనది కాదు. ఇప్పటి పొట్టి పొట్టి పొడి ముక్కల భావకవిత్వమూ కాదు. రామస్వామి గారి సూతపురాణం ఒక ఆశ్చర్యకరమైన గ్రంథం. నాకూ వారికీ బాల్యంనుండీ పరిచయం ఉంది. తెలుగుతనం తొణికిసలాడే లాగనూ. కవిత్వ దృష్ట్యానూ చక్కగా రచింపబడిన గ్రంథమిది.

ఇందుకో అపురూపమైన రవ్వల్లాంటి తెలుగు పదాలు ఎన్నోవున్నాయి. కవికిగల ద్రావిడాభిమానం ఇందులో వ్యక్తమౌతుంది'' అన్నారు.

[1]''సూతపురాణం గ్రాంథిక భాషలో ప్రాచీన సంప్రదాయాలలోనే రచింపబడినా, సాహిత్యా దర్శాలకు సంప్రదాయాలకు ఎదురు తిరిగిన రచన కాబట్టి ఇది నవ్యసాహిత్యంలోనే చేరుతుంది'' అన్నారు విశ్వనాథ సత్యనారాయణగారు.

ఇంకా మరికొందరు కవులు సూతపురాణాన్ని రచించినందుకు రామస్వామి గారిని ఎంతగానో కొనియాడారు. ఈ క్రింది పద్యాలను చూడండి.

చం. ''శ్రుతుల్ పురాణముల్ స్మృతులు చూచియు నందలి సత్యము జగ
ద్ధితముగఁదెల్ప నెంచి మదినిచ్చక ముంచక సర్వమానవ
స్తుతులకు పాత్ర మౌనటుల 'సూతపురాణము' నున్ రచించి స
న్నుతిగనినట్టి నీ మహిమనుంగొనియాడ వశంబె ? చౌదరీ !''

—దేవినేని సూరయ్య

ఉ. ''ప్రాత పురాణముల్ కలుషభావయుతమ్ములు కల్లబొల్లికి౯
బాతఱలన్న మీ యమృతవాక్కుల సారము దివ్యవాణియై
సూతపురాణ రూపమున శోభన మోహన మంజుల పేశలో
పేతసుధార్ద్ర శీతల కవిత్వరుచుల్ వెలయించెఁ బక్వమై.''

—చిన్నము రామయ్య చౌదరి

1. నవ్యసాహిత్యం — భారతి ఏప్రిల్, 1940.

# భగవద్గీత

భగవద్గీతకు అనేకమంది భాష్యాలు వ్రాశారు. ఇవన్నీ ప్రాచీన సంప్రదాయాను సారంగా రచింపబడినవే. ఈ వ్యాఖ్యాతలలో ఎవరికివారు, వారి వారి సిద్ధాంతానికో, మతానికో అన్వయించి భాష్యం వ్రాశారు. దీనిని బట్టి చూస్తే గీతలో వాడిన భాష ఇంకెన్ని వ్యాఖ్యానాలకైనా దోహదం కలుగజేస్తుందనవచ్చును. రామానుజుడు విశిష్టాద్వైతపరంగానూ, శంకరుడు అద్వైతపరంగానూ, బాలగంగాధర తిలక్ కర్మయోగపరంగానూ, గాంధీ మహాత్ముడు అనాసక్తి యోగపరంగానూ గీతా వ్యాఖ్యానాలు చేశారు. ఇదే విధంగా ఇంకా అనేక మంది వ్యాఖ్యాతలకు గూఢార్థాలు, బహిరర్థాలు, అంతరార్థాలు, అతీంద్రియార్థాలు గోచరించాయి. ఇప్పటికీ గోచరిస్తున్నాయి కూడా. అందుచేతనే ద్వైతాద్వైత విశిష్టాద్వైత మతాల కన్నింటికి 'గీత' మూలాధారమయింది.

1941 సం. పలనాటి వీర చరిత్రను ఇతివృత్తంగా గైకొని రామస్వామిగారు 'భగవద్గీత'ను రచించారు. కురుక్షేత్ర యుద్ధభూమిలో శ్రీకృష్ణుడు అర్జునునికి గీతోపదేశం చేశాడనే ప్రతీతి ఉన్నది గదా. అదే విధంగా కారెంపూడి కదనరంగంలో బ్రహ్మనాయడు బాలచంద్రునికి గీతోపదేశం చేశాడని భావించిన రామస్వామిగారు చక్కని వ్యంగ్యవైభవంతో ఈ అధిక్షేప గ్రంథాన్ని రచించారు. అయితే కురుక్షేత్ర యుద్ధాన్ని కారెంపూడి కదనంతో పోల్చవలసిన అవసమేమిటి?

మహాభారత యుద్ధానికి వలే పల్నాటి యుద్ధానికి కూడా సోదరుల రాజ్యకాంక్ష మూలకారణం. ఇప్పుడు మహాభారత, పల్నాటి యుద్ధాలకు గల పోలికలు స్పష్టంగా తెలుస్తాయి. ఉత్తరదేశంలో దాయభాగానికై అన్న

దమ్ముల బిడ్డలు కొట్టుకొని చచ్చినది కురుక్షేత్ర రణరంగం. ఇటువంటి దాయభాగ ద్వేషచే అన్నదమ్ములు పోరాడి మరణించినది కారెంపూడి కదనరంగం. కురుక్షేత్ర సమర భూమిలో గార్షిక భగవద్గీత ఉపదేశం జరిగిందని ప్రతీతి. అదే విధంగా కారెంపూడి యుద్ధభూమిలో పలనాటి కృష్ణుడు బ్రహ్మనాయడు పల్నాటి పార్థుడైన బాలచంద్రునికి గీతోపదేశం చేశాడని రామస్వామిగారు భావించారు. ఈ భావం నూతనమయినది. భారత, యుద్ధానికీ, పల్నాటి యుద్ధానికి చాలా పోలికలుండటంచేత భారత వీరులను పల్నాటి వీరులతోనూ, ద్రౌపదిని నాగసానితోనూ, శ్రీకృష్ణుణ్ణి బ్రహ్మ నాయనితోనూ పోలుస్తూ రామస్వామిగారు అపూర్వమైన అధిక్షేపకావ్యం రచించారు.

రామస్వామి గారు ఎంతో శ్రద్ధతో గీతారచనను ప్రారంభించారు. గురిజాల రాజ ప్రాసాదంలో ఉన్న నలగామరాజు తన ఆంతరంగిక సచివుడైన గింజయుని ముఖతః యుద్ధవార్తలను యథాతథంగా వినాలన్న కుతూహలంతో అతణ్ని అడిగే ఘట్టం ఈ భగవద్గీతకు ప్రారంభం.

క. 'ధర్మాత్ములు మా వార ల
ధర్ములు మలిదేవ భూత ధాత్రీశ్వరులున్
ధర్మక్షేత్రంబు, మహా,
కర్మక్షేత్రంబు నైన కారెంపూఁడిన్.

క. చతురంగ బలమ్ములతోఁ
బ్రతిపక్ష జిగీష రెండు భాగులమగ లూ
ర్జిత గతి దండువిడిసి యు
ద్ధతులై యేమేమి చేసి రవతలఁజెపుమా

ఈ పద్యాలను చదువగానే వ్యాసుని భగవద్గీతలోని మొదటి శ్లోకం 'ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః మామకాః పాండవాశ్చైవ

కిమకురత్వ సంజయః 'జ్ఞాపక మొస్తుంది. నలగామరాజు చెప్పినదంతా ఆలకిం చిన గింజయుడు, తొట్రుపడకుండా, వూసగుచ్చిన రీతిగా ఇలా అంటాడు.

తే. గీ. 'నేల యీనిన చందమై నిండియున్న
మన దళంబులఁ తిలకించి మరల మరలఁ
జూపు మరలించి మార్తుఁడవై వుఁ జూచి
నాగులేటికి దొరసాని నాగసాని'

ఏమి జరిగిందో వివరంగా చెబుతాడు గింజయుడు ఉత్కంఠను రెక్కొలిపే ఈ ఘట్టం భావికావ్య హ దయానికి మార్గదర్శకంగా ఉంది.

ఇక బాలచంద్ర విషాదయోగంలో ఇరుపక్షాల సైన్యాలు (మలి దేవాదులదొకపక్షం. నాయకురాలిది మరో పక్షం) కారెంపూడి యుదభూమిలో మోహరించి ఉండటం బాలచంద్రుడు పరికించాడు. అతని హృదయం విషాదమేఘచ్ఛన్నమయింది. ఆతని శరీరం నిలువెల్లా కంపించింది. ముచ్చెమటలు పోశాయి. మోకాళ్ళూ, మోచేతులూ చచ్చుబడి పోయాయి. చేతినుండి అనుకోకుండానే ఖలీనం జారి క్రింద పడిపోయింది. జాతిగుఱ్ఱం మీదనుండి బాలచంద్రుడు కూడా దిగజారిపోయాడు. గుండె దడదడలాడి చలించిపోయింది. శోకవ్యాకుల హృదయుడైన బాలచంద్రుడు ''నన్నీ ఘోర కార్యానికి ప్రోత్సహింపకు. నేనీ యుద్ధాన్ని చేయజాలను'' అంటాడు బ్రహ్మనాయనితో.

వెంటనే బ్రహ్మనాయడు ''మలిదేవాదులు నిన్ను నమ్మి యుద్ధ భూమికి వచ్చారు. శత్రువులైన నలగామరాజు పక్షాన్ని దునుమాడి వారి అశ నిరాశ జేయడానికి ఖడ్గం సారించు'', అంటాడు బాలచంద్రుణ్ణి. దానికి బాలచంద్రుడు యిలా ప్రత్యుత్తరమిస్తాడు.

ఉ. 'కొంచెము తాల్మిలేక రిపుకోటిని జంపుము చంపుమంచు గో
రించుచు నుంటి వెట్లు పొనరించెదఁ బెంచిన తాత తండ్రులన్
బెంచిన చుట్టపక్కములఁ బెంచిన మామల మేనమామలన్
బెంచినమాట నన్ను మఱపించునె ? చంపుటయన్న మాటలే ?

ఉ. పిన్నట నా ట నుండియును బెంచిన వారలఁ ద్రుంచి వైవగాఁ
జిన్నతనాన నాడుకొను స్నేహితులం బరిమార్చి పుచ్చఁగా
నన్నలరించు మిత్రులను నాకడనుండిన ప్రాతనేస్తులన్
జెన్నఁటినై వధింపఁగను జేతులు రావు నిజంబుఁజెప్పితిన్.

ఉ. కూలికినై విసంబు నొకగ్రుక్కెఁడు గ్రోలెడువారు వీరినిన్
లాలనఁజేసి బెట్టుగఁజలంబును బెంచుచుఁబోరితంబుకై
త్రోలిననున్ వధింపు మని తొందఱఁజేసిన వీరి గూల్చఁగాఁ
జాలను జెన్న కేశవుని సాక్షిగ నీ పలనాఁడు సాక్షిగా.'

బాలచంద్రుని హృదయ దౌర్భల్యాన్ని జూచి ఆశ్చర్యచకితుడైన బ్రహ్మనాయడు అతణ్ణి సమరోన్ముఖుణ్ణి చేయడానికి శస్త్రసన్యాసం చేస్తే పల్నాడంతా పక్కన నవ్విపోతుందంటాడు. ఆనాడు కురుక్షేత్ర రంగంలో అర్జునుడు అస్త్రసన్యాసం చేసినప్పుడు, శ్రీకృష్ణుడు అతన్ని ఎలా రణాసక్తుణ్ణి చేశాడో, అదేవిధంగా కారెంపూడి రణరంగంలో, చేతి లోని గుజ్జపు కళ్ళెమును జారవిడిచిన బాలచంద్రునిలో సమరోత్సాహం ఉద్దీప్తం చేయటానికి బ్రహ్మనాయడు యిలా అంటాడు.

ఉ. "ఈ సమరంబు మర్త్యుల కనేక విధంబుల మేలు సేయుఁబే
రాసల భోగలలాసపరాయణులైన నరేంద్ర చంద్రులున్
జేసిన ఘోరపాప ఫలశేషముఁబొందెద రిందు శస్త్ర స
న్యాసము నీవు చేయఁబలనాఁడిఁక నవ్వదె పక్కపక్కనన్?

ఆ. పోతుగడ్డ మీదఁ బుట్టిన పురుషుండు
కత్తిచేతఁ బట్టఁ గల్గువాఁడు
ప్రధన భూమిలోనఁ బగరకు వెన్నిచ్చి
పోవువాఁడు లేఁడు నీవు దక్క

ఆ. నాగసానినురియ నైగ నిగ్యముఁ జూచి
పగర మొగ్గరంబు మొగముఁ జూచి
శత్రుయోధవరుల చాకచక్యముఁ జూచి
బాలచంద్ర! యింత పందవైతి?'

ఇంతగా బోధించినా బాలచంద్రునికో రణోత్సాహం కలుగలేదు. అతడు శోకమోహ సంతప్తుడు కావడమే దీనికి కారణమని గ్రహించాడు బ్రహ్మనాయడు. ''బాలచంద్రా! ఏమిది! ఈ విధంగా భయపడటం క్షత్రియ వీరుడవగు నీకు తగదు. ప్రాజ్ఞులైనవారు జనన మరణాలను లెక్కచేయరు. పాంచభౌతికమగు ఈ దేహం నశిస్తుందిగాని ఆత్మకు నశింపంటూలేదు. ఆత్మకు నశింపులేదుగాన దేహ నాశనానికి వగవవలసిన పనిలేదు. స్థూల పదార్థమగు దేహ మెన్నటికైనా నశింప వలసిందే కదా! మానవుడు చినిగిన బట్టలను విడిచి క్రొత్త బట్టలను ధరించునట్లుగా, ఆత్మ పాత శరీరాన్ని విడిచి, మరో శరీరంలోకి ప్రవేశిస్తుంది. వికారాలు దేహానికేగాని ఆత్మకంటవు కాబట్టి విక్రమ స్ఫూర్తితో కదన భూమిలో నున్న శత్రు సైన్యాన్నంతా చీల్చిచెండాడ వలసింది. నీవు యుద్ధంలో మరణించితివా స్వర్గద్వారాలు తెరువబడుతాయి. జయించితివా రాజభోగాలనుభవిస్తావు'' అంటూ సాంఖ్యోపదేశం చేస్తాడు. ఇలా బోధించినా బాలచంద్రుణ్ణి భీతి వదలలేదు.

బాలచంద్రుని మనసులో ఎన్నో ప్రశ్నలు రేకెత్తుతాయి స్వర్గం-నరకం,-శరీరం-ఆత్మ, జన్మ-పునర్జన్మలను గురించి తెలుసుకోవాలని తండ్రిని ప్రశ్నిస్తాడు.

"చచ్చిన పిదపన్ నరకమె
వచ్చునొ స్వర్గంబు యూడి పడునో చెప్పన్
వచ్చునె యెవ్వని కేనియు
నిచ్చకములఁ జెప్ప లాభమేమి మహాత్మా !

ఆత్మయను వస్తు వున్నదో యసలు లేనె
లేదొ నాకు నమ్మిక గల్గఁ లేదుగాన
మొఘులులో నీరునమ్మి యేమూర్ఖుఁడైన
జెరువుగట్టలఁదెగఁగొట్టి చెఱుపఁగలడె ?

అంతేగాదు—

జీర్ణ వస్త్రంబు నంద చినుఁగ కఱలు
నందె యుండి మనుష్యుని నంట నటుల
దేహము పొనర్చు కర్మ సందోహ మంట
దాత్మ దేహంబుఁద్యజియించి యరుగు నపుడు"

ఇలాసందేహాలతో సతమత మౌతున్నాడని గ్రహించిన బ్రహ్మనాయడు, అతని రాగద్వేషాలను నిర్మూలించడానికి జ్ఞానయోగం బోధించసాగాడు. "నాచేత ద్వాపరయుగాంతంలో పార్థునకు ప్రబోధించబడిందీ జ్ఞానయోగం. అప్పుడు నేను వాసుదేవుణ్ణిగా పేరుపొందాను. తరువాత బుద్ధుడుగా అవతరించాను. నేడు బ్రహ్మఋషి సత్తమున్ణి. ద్వాపరయుగం నాల్గవ పాదంలో నరులు పాపాత్ములై చరించారు. అందుచేత భారతదేశం ముందెన్నడూ ఎరుగని భయంకర యుద్ధాన్ని కల్పించి, ఇరుపక్షాలవారినీ హతమార్చి, ధర్మం వృద్ధిజెందేటట్లుగా చేశాను. కొన్ని వేలేండ్లు ధర్మం నాలుగు పాదాలా నడిచింది. తదుపరి కృష్ణపక్షంలోని చంద్రునివలే క్షీణింపసాగింది. ఎప్పుడు

ధర్మానికిగ్లాని ఉత్పత్తిల్లుతుందో, ఎప్పుడు ధర్మం కప్పబడిపోతుందో, ఆయా సమయాల్లో సాధుసంత్రాణం కొరకూ, దుష్కృత వినాశం కొరకూ, ధర్మ సంస్థాపనార్థమూ నేను ఉద్భవిస్తూ ఉంటాను'' అంటాడు బ్రహ్మనాయడు.

అప్పుడు బాలచంద్రుడు ''ఓతండ్రీ! కురుక్షేత్ర యుద్ధ సమయంలో కృష్ణుడు 'నేనే చాతుర్వర్ణ్యాన్ని సృష్టించాను'' అన్నాడు గాండీవితో. మరి కృష్ణుని కంటే ముందుగా గౌతమ మహర్షి 'భూమి మీదవున్న వర్ణాలు మూడు మాత్రమే' అన్నాడుకదా? ఈ రెంటికి సమన్వయం ఎలా కుదురుతుంది? ఈ వర్ణవ్యవస్థ పుట్టుపూర్వోత్తరాలను కూలంకషంగా చర్చించి జ్ఞానోదయం కలుగజేయవలసింది'' అంటాడు బాలచంద్రుడు. అంతట బ్రహ్మనాయడు యిలా అంటాడు.

తే. వర్ణములు నాల్గు తొలుత నేర్పఱచి పిదపఁ
బ్రజ సృజించితి ననుమాట వట్టి మాట
ప్రజల సృష్టి జేసి గుణకర్మలచేఁత
వర్ణములను మూఁడింటి నేర్పఱచినాఁడ.

సీ. బ్రహ్మ విద్యాసక్తి బహుభక్తి నెవ్వాఁడు
సతతంబు యత్నముల్ సలుపుచుండు
ఖడ్గ విద్యా పరిష్కారుఁడై యెవ్వాఁడు
జగదుపకారంబు సలుపుచుండు
వాణిజ్య గోపరిపాలన కృష్ణుల నె
వ్వాఁడు తన్మయుండయి పనులుచేయు
అఖిలలోకైక కల్యాణంబు సాధింప
విస్తార సంఘాభివృద్ధి కొఱకు.

తే. క్రమముగా వారు బ్రాహ్మణ, క్షత్రియులును
వైశ్యులని చెప్పి వివరించి, బాలచంద్ర
నిర్ణయించితి శ్రద్ధతో నీ వెఱుంగు
మాదియందుఁ బ్రజాసృష్టియైన పిదప.

తే మూఁడు వర్ణముల్ సృష్టించినాఁడ నీ చ
తుర్థవర్ణమ్ము మానవుల్ ద్రోహచింత
సృష్టిఁ జేసిరి స్వార్థ మపేక్షఁ జేసి
తారతమ్యంబుఁ గల్పించి తల్లడిల్ల.

తే. ఇంతచేసియు రప్పంత తృప్తిపడక
నాల్గు వర్ణమ్ము లైదు వర్ణములఁ జేసి
పంచజను లంచుఁ జెప్పిరి వంచకులయి
నీతిశాస్త్రముల్ వ్రాసిన నిపుణమతులు.

ఆర్యులు మనదేశానికి రావడం, వారికీ అంతకుముందు మన దేశంలో వున్న ద్రావిడులకూ అనేక వేలసంవత్సరాలు యుద్ధాలు జరగడం, మోస బుద్ధిగల ఆర్యులు కడకు జయించడం, దేశాన్ని ఆక్రమించుకోవడం, ఓడిపోయిన ద్రావిడులను బానిసలుగా చేసుకోవడం, వారికొరకు నూతన వర్ణం [శూద్రజాతి] సృష్టించడం జరిగింది. ఈ పరిణామవాదాన్ని అర్థం చేసుకోకుండా కొందరు వృత్తుల్ని బట్టి వర్ణభేదా లేర్పడ్డాయంటారు. అది కూడా వాస్తవం కాదు. నిజంగా వృత్తులనుబట్టి వర్ణాలేర్పడితే ఈ ప్రపంచంలో ఎన్ని వృత్తులున్నాయో అన్ని వర్ణాలుండాలి గదా. : మరి అలాలేవు. కాబట్టి శూద్రవర్ణాన్ని స్వార్థబుద్ధితో ఆర్యులు ఏర్పరచారనేది విస్పష్టం. ఇది తెలియని వానికి మోక్షం లేదంటూ బ్రహ్మనాయడు యిలా అంటాడు.

ఉ. ఈ పరిణామవాదమును నెవ్వఁడు నమ్మక మూఢబుద్ధి నా
మూఁపుననుండి యొక్కరుఁడు మోముననుండి యొకండు తక్కవా
రా పయి నాదు గజ్జలను హజ్జలఁ బుట్టిరియంచుఁ జెప్ప నా
పాపికి ముక్తి చేపడదు బాలుఁడ! జన్మము లెన్ని యెత్తినన్.

తే. శాస్త్రముల నెల్లఁ జదివి విజ్ఞాన మెఱిఁగి
సంశయింపక సర్వథా చర్చఁ జేసి
నిజ మెఱుంగవలయు నిది నేర్వకున్న
మూఢవిశ్వాసమునఁ జేటు మూడుచుండు.

తే. కాన నజ్ఞాన సంభవమైన సంది
యముల భేదించివైచి జ్ఞానమున నీవు
కర్మములఁజేయ సమకట్టి నిర్మతను
లెమ్ము యుద్ధమ్ముఁజేయ ధైర్యమ్ముతోడ'

ఆ తరువాత బ్రహ్మనాయడు, శ్రీకృష్ణునివలే, కర్మ, విభూతి యోగాలను కూడా బాలచంద్రునికి బోధిస్తాడు.

వ్యాస భగవద్గీతలోని విభూతి (మహిమ) యోగంలో శ్రీకృష్ణ పరమాత్మ "సమస్త భూత హృదయాలలో ఉన్న ఆత్మను నేనే భూతాల ఆది మధ్యాంతం కూడా నేనే. సూర్యులలో విష్ణువును నేనే. నక్షత్రాలలో చంద్రుణ్ణి నేనే. దేవతలలో దేవేంద్రుణ్ణి నేనే. ఇంద్రియాలలో మనస్సును నేనే. యజ్ఞాలలో జపయజ్ఞాన్ని నేనే. పర్వతాలలో హిమాలయాన్ని నేనే. వృక్షాలలో శ్రేష్టమైన అశ్వత్థ వృక్షాన్ని నేనే. దేవర్షులలో నారదుణ్ణి నేనే. ఏనుగులలో ఐరావతాన్ని నేనే. ఆయుధాలలో వజ్రాయుధాన్ని నేనే. ఆవులలో కామధేనువును నేనే. మృగాలలో సింహాన్ని నేనే. పక్షులలో గరుత్మంతుణ్ని నేనే. సమాసాలలో ద్వంద్వ సమాసాన్ని నేనే. జ్ఞానవంతులలో జ్ఞానం నేనే.

సర్వభూతాలకూ బీజం నేనే. నా దివ్యవిభూతుల కంతం లేదు. ఇది నా సంక్షిప్త విభూతుల వివరణ'' అన్నాడు. ఈ భావం స్వార్థపరుల చేతులలో పడి మలినమై పోయింది. ఎవ్వరికివారు 'అహం బ్రహ్మాస్మి' (నేనే పరమ బ్రహ్మను) అనుకొనే దుర్భర పరిస్థితికి దారితీసింది. ప్రజలకు ఈ భావం మీద నున్న మోజును కడిగి వేయక తప్పలేదు చౌదరిగారికి. అందుకు పూనుకొని ఎంత హృద్యంగా అవహేళన చేశారో చూడండి. చౌదరిగారి భగవద్గీతలో పల్నాటికృష్ణుడైన బ్రహ్మనాయడు, పల్నాటి పార్థుడైన బాల చంద్రునితో యిలా అంటాడు.

క. ''మెకముల ''హిపొపొటమసు'' ను
సుకములలోఁ బల్లె నాఁటి యుకమును రాలన్
జెకుముకి రాయిని నేనే
శకటములందెల్ల ధూమశకటము నేనే.

క. మూనలలో వరి మూనను
వానరుల ''ఉరాంగు టాంగు'' వానర మేనే
మీనులలో జొఱ మీనును
సోనుల నార్వెల్లి నాగసోనిని నేనే.

క. మ్రాఁకుల చిటారు కొమ్మల
యాకుల మెడసాచి మెసవునట్టి ''గిరాఫీ''
నేకుల ఖాదీ యేకును
గాకులయం దెల్ల బొంతకాకిని నేనే,

క. కారులలో నవకారును
నేరులలోనెల్ల నాగులేరును నేనే
చేరెఁడు నీళ్ళు దొరకని యె
డారులలోన 'సహారా' యెడారిని నేనే.

క. కంకులలో వరి కంకిని
రంకులలోనెల్లఁ బొడల రంకును నేనే
యంకెలలోఁ బదమూఁడును
వంకలలోఁ జంద్రవంక వంకను నేనే.

క. వెలుగుల రక్కెస వెలుగును
బులుఁగులలో రామబందు పులుఁగును నేనే
కలుఁగులను బుట్టకలుఁగును
తెలుఁగులలో నెల్ల మాల తెలుఁగును నేనే.

క. ఆసలలో నడియాసను
బూసలలో నెల్లఁగొలికిపూసను నేనే
రాసులలో నక్రాశిని
బాసలలో నెల్లఁ దెల్గు బాసను నేనే.

క. పద్యములఁగంద పద్యము
విద్యలయందెల్లఁజోరవిద్యను నేనే
వాద్యములఁ బటహ వాద్యము
ఖాద్యములం దెల్ల మాష ఖాద్యము నేనే.

క. నదముల 'కాంగో' నదమును
బదముల యందెల్ల నేలపదమును నేనే
కొదమల సింగపుఁ గొదమను
రథములలో యజ్ఞ ఫెూణి రథమును నేనే.

క. కలములను గాలి కలమును
హలములలోఁ ద్రాగుఁబోతు హలమును నేనే
ఫలములను జూతఫలమును
బిలములలో గుత్తికొండ బిలమును నేనే.'

ఈ విధంగా తన విభూతులను వివరించి కట్టకడకు బ్రహ్మనాయడు యిలా అంటాడు.

ఆ. 'నా విభూతిచయ మనంత మైనను సంగ్ర
హించి చెప్పినాఁడ నేను నీ య
భీప్సితంబుఁ దీర్పనింతకు వివరించి
చెప్పఁగాదు సమరసీమ యందు.'

వ్యంగ్యవైభవంతోనూ, సత్యసౌరభంతోనూ యిలా సాగి పోతుంది చౌదరిగారి లేఖిని. కృష్ణభగవద్గీత లోని విభూతియోగం పట్ల భక్తిశ్రద్ధలు చూపించేవారు కూడా బ్రహ్మనాయని ఈ గీతోపదేశంలోని వ్యంగ్యోక్తికీ, చతురతకూ నివాళులెత్తి తీరుతారు. రామస్వామి చౌదరి గారి రచనా వైదుష్యం అట్టిది. సరళంగా, సున్నితంగా విషయాలను అవగాహనకు వదలడమూ, ఆలోచనలను రేకెత్తించి, పఠితల జిజ్ఞాసను పెంపొందించటమూ, వారిని వివేక మార్గానుయాయులనుగా చేయడమూ చౌదరి గారి ప్రత్యేకత.

విశ్వరూప సందర్శన యోగంలో అర్జునునకు శ్రీకృష్ణుని విశ్వరూప సందర్శనం భయసంభ్రమాలను కలుగజేసింది. తుదకు సౌమ్యరూప సందర్శనం అతనికి మనశ్శాంతి కలిగించింది. అదేవిధంగా బ్రహ్మనాయని విశ్వరూపాన్ని జూచి, భయకంపితుడై సాష్టాంగ ప్రణామ మాచరించిన బాలచంద్రుడిలా అంటాడు.

తే. 'దేవ ! నీ శరీరమునందు దేవతలును
సిద్ధ చారణ గుహ్యక శ్రేణి, సాధ్య
గరుడ గంధర్వ యక్ష కిన్నరులు కూడి
బలసియున్నట్టు పొడకట్టు బ్రహ్మతోడ.

తే. యపన పహ్లవ బర్బర ద్రవిడ శక య
రబ్బి మంగోలు మాగియ స్లావు హూణ
నీగ్రొ చీన షింటో హిబ్రు నిఖిల జాతు
లన్ని నీ యందె కులకుల లాడుచుండె.

క. ఎటు చూచిన కన్గవలే
ఎటు చూచిన ముక్కు మొగములే పరమాత్మా !
యెటుచూచినఁ గాళ్ళేతులె
యెటుచూచిన దిక్కులేదు వృజినధ్వంసా !

తే, అతి భయంకరమైన మీ యాయుధములు
నతిభయంకరమైన మీ యాకృతియును
గాంచినంతటనే స్వేదకణము లలమ
నల్లకల్లోలమయ్యె నా యుల్ల మెల్ల'.

"మీ రూపాన్ని జూచి నా మనసు బెంబేలు పడుతూ ఉంది. మీ నిజ రూపాన్ని 'చూపండి' అంటాడు బాలచంద్రుడు.

తే 'ఒక్క గద యొక్కశంఖమ్ము నొక్కచక్ర
మొక్కఖడ్గంబు ధరియించుచుండు నాల్గు
చేతులు గల మూర్తిని బ్రదర్శింపుమయ్య
వేలకొలఁది చేతులుచూచి బేలు పోతి.'

అప్పుడు బ్రహ్మనాయుడు యిలా అంటాడు :

ఉ. "ఎందఱు నా స్వరూపము నిరీక్షణ సేయఁగఁ గోరి తొల్లి రా
త్రిందివము తపంబు నొనరించి యెండకు వానకోర్చి? వా
ఱందఱిలో నొకానొకరుఁడైనఁ గనుంగొనఁ జాలినాఁడె? నీ
యందలి ప్రేమభావమున నద్భుతదర్శన మిప్పుడిచ్చితిన్.'

ఆంధ్ర నాట వెలసిన అవ్యవస్థిత స్థితిని నిర్మూలించాలనీ, వర్ణ వ్యవస్థను సమూలంగా నాశనం చేయాలనీ చౌదరి గారి ఉద్యేశం. మానవు లందరూ ఒక్కటే. జన్మను బట్టి అధిక్యానాధిక్యాలను నిర్ణయించడం అధర్మం. కాని స్వార్థపరులూ, ద్రోహచింతనులూ అయినవారు తమ తమ సుఖ సంతోషాల కోసం, కొన్ని జాతుల వారిని శాశ్వతంగా అణిచిపెట్టి ఉంచడానికి ప్రయత్నించారు. ఈ ద్రోహవ్యవస్థ ఎక్కువకాలం నిల్వదనీ, సత్యం ఏనాటికైనా వెలికిరాక తప్పదనీ వారికి తెలుసు. ఆ శుభసమయం కోసం తనేకాదు, తన జాతి యావత్తూ పోరాడాలనీ, అందరూ సుఖ శాంతు లలో జీవించాలనీ రామస్వామి గారు ఎంతగానో ఆరాట పడ్డారు. అందు కోసం అప్పుడమలులో నున్న భావాలనూ, ఆచారాలనూ, వ్యవస్థలనూ భస్మీపటలం జేసి సర్వమానవ సమతాధర్మం గల ఒక నూతన ప్రపంచం నిర్మించాలని రామస్వామి గారు కలలు కన్నారు. ఈ ఉద్దేశాలనే విశ్వరూప సందర్శన సందర్భంలో బ్రహ్మనాయుని నోట యిలా వెల్లడించారు.

తే. 'బ్రాహ్మణాది చండాల పర్యంత మైన
యన్ని జాతుల వారల నాసపెట్టి
యిటకుఁ దో డెచ్చితిని వధియింప నెంచి
తెలుఁగు జాతి పున సృష్టి కలన కొఱకు.

తే. ఆత్మవిశ్వాస మడుగంటె నంతరించెఁ
బ్రత్న ధీ బల దోర్బల ప్రౌఢి యెల్ల
బ్రతికి యుండెను జీవచ్ఛవంబురీతిఁ
దెలుఁగుజాతి పునస్సృష్టి వలదె చెపుమ !

తే. కర్మశూరులు కాకాత్త గంధు లగుచు
నౌర ! యాచారయువని కాభ్యంతరమున
మెలఁపుతో దాఁగుచున్నారు మ్లేచ్ఛబుద్ధిఁ
దెలుఁగుజాతి పునస్సృష్టి వలదె చెపుమ !

తే. ఒక్కజాతియ దుద్భవ మొందికూడ
స్పర్శదోషంబు దృష్టిదోషం బటంచుఁ
బతితమై పోవుచుండెఁ బ్రభ్రష్ట మగుచుఁ
దెలుఁగు జాతి పునస్సృష్టి వలదె చెపుమ !'

బాలచంద్ర విషాదయోగం, సాంఖ్యయోగం, జ్ఞానయోగం, కర్మయోగం, విభూతియోగం, విశ్వరూప సందర్శనయోగం, అను ఆరు యోగాలలోనూ, పద్దెనిమిది అధ్యాయాల కృష్ణభగవద్గీత'ను పరిహసిస్తూ రామస్వామి గారు అపూర్వమైన బ్రహ్మ భగవద్గీత'ను ఆంధ్ర ప్రజలకు అందించారు. పాత భగవద్గీతలో ప్రతిపాదించిన సిద్ధాంతాలను తుత్తునియలు చేశారు. [1]'రామస్వామి చౌదరి గారి భగవద్గీత' ప్రచురణతో గీతాహృదయం బ్రద్దలయింది. భగవంతుడు హాస్యాస్పదుడయ్యాడు. వ్యంగ్య రచన సంఘ సంస్కరణకు ఎంత చక్కగా ఉపయోగిస్తుందో ఈ గ్రంథం ద్వారా నిరూపించారు చౌదరి గారు. ఆంధ్ర సాహిత్యంలో ఇప్పుడుకాని, పూర్వం కాని,పద్యంలోగాని,వచనంలోగాని ఎవ్వరూచెయ్యని, చేయబోనిపనిని వీరు భగవద్గీతలో చేశారు. ఆంధ్ర కవిత్వం ఎన్నడూ ఎరుగని చక్కని సెటైర్'. చక్కని హాస్యం వీరివల్ల తెలుగు వారికి లభించాయి'' అన్నారు డాక్టర్ జి. వి. కృష్ణరావుగారు.

రామస్వామి చౌదరి గారి భగవద్గీతను చదివిన జలసూత్రం రుక్మిణీ నాథశాస్త్రి గారు [2]''గీతను అలా సెటైర్ చెయ్యడం, పల్నాటి చరిత్రను జోడించి తెనుగుదనం తేవడం, ఆ రెంటి సామ్యాలనూ హత్తించడం, ఆ పద్యాలు, ఆ భాష అవన్నీ అపూర్వాలుగా. ఫీలయ్యాను... పీఠిక చదువు తున్నంత సేపూ ఆశ్చర్యమేగదా, ఆ విషయ వివరణానికీ, ఆ పద

1. కావ్యజగత్తు - డాక్టర్ జి. వి. కృష్ణరావు
2. కవిరాజు సన్మాన సంచిక

ప్రయోగాలకూ విషయం విషయం నేను నేర్చుకోవడమే మరి... విభూతి యోగాన్ని పేలవంగా కాకుండా అంత రమ్యంగా సెటైర్ చేసినందుకు మాత్రమే కాదు సంతోషించింది. కవిరాజు గారు కాక ఇంకొకరైతే - 18 అధ్యాయాలూ చెప్పి, చాట భారతం అనిపించి-విషయాన్ని పేలవంచేసి, పుస్తకాన్ని నీరసం చేసేవారు. ఈయన అసలు భగవద్గీతలో ఉన్నది అంతా విడిచి, నలుగురూ అయినదానికీ, కానిదానికీ, ఉప్పూ పత్రికా కాకుండా కోట్ చేస్తుంటారే వాటికి-ఈయన సెటైర్ వ్రాసింది. అందుకూ సంతోషించాం. ఉన్న పురాతన విషయాలు నమ్మకాలుగా మారి, గలభా చేస్తున్నప్పుడు రామస్వామి చౌదరి గారు ఎదిరించా రనటంలోని ఉంది ఆయన ప్రతిభా-పట్టుదలా నలుగురికీ కలిసి వద్దామనే గుణమూను, లేకుంటే మల్లెపూలమీద, కోయిలమీదా, వడగాలిమీదా, ఇంద్రధనస్సు మీదా పద్యాలు రాయలేకనా - ఈ బాధంతా ఆయన పడ్డది—— అనేక విషయాలను శ్రద్ధతో తఱచి, ఆచి, తూచి, నిజాన్ని నిర్భయంగా బయట బెట్టినవారు మనలో చాలా తక్కువ. త్రిపురనేని రామస్వామి చౌదరి గారూ, పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి గారూ నాకు వీళ్ళద్దరి విషయంలో చాల గౌరవం. వారి వాదాలలోనూ, అభిప్రాయాలలోనూ మనస్సుకు నొప్పికలిగే అంశాలు కొన్ని ఉండవచ్చు. కాని సెంటిమెంటును చంపి, నిజం ఆలోచిస్తే వారి భావాలు ఎంత సమంజసాలో మనకు బోధపడుతుంది'' అన్నారు.

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, ఆస్థానకవి శ్రీపాద కృష్ణ మూర్తిశాస్త్రి గారిని నే నొకసారి కలుసుకోవడం జరిగింది. ఆ సందర్భంలో శాస్త్రి గారు కుశలప్రశ్నల అనంతరం నాతో పారిహాసిక సాహిత్యాన్ని గురించి మాట్లాడుతూ ''ఆంధ్ర సాహిత్యంలో వ్యంగ్యోక్తిని అత్యంత ప్రతిభా వంతంగా వాడుకున్న మహాకవి రామస్వామి చౌదరి. వారి భగవద్గీత ఏ విషయంలోనూ సంస్కృత గీతకు తీసిపోదు. పూర్వజన్మంపట్ల అచంచల

విశ్వాసం గల నాకు అలనాటి వ్యాసుడే ఈ అవతారము నెత్తినాడా యనిపించి నది. భగవద్గీత వంటి మహోత్తమ గ్రంథాలద్వారా, నిస్తేజమయిన జాతికో చైతన్యం కలిగించి, ముందడుగు వేయించిన చౌదరిగారికి ఆంధ్రజాతి తరతరాలుగా ఋణపడి ఉండగలదు. ఇది నా ప్రగాఢ విశ్వాసము; దృఢనమ్మకము'' అన్నారు.

ఉన్నవ లక్ష్మీనారాయణ గారు ''నాచనసోముని కవిత్వము వలె గీత లోని పద్యములు తరిమెన వెట్టినట్లు తీరి అందచందములు గలిగియున్నవి.' అన్నారు.

ఆంధ్రులు అనేక విషయాలలో అదృష్టవంతులు. ముఖ్యంగా ఆంధ్రభూమి సంస్కర్తలకు పుట్టినిల్లు. మహామనీషి, సత్యవాది, త్రిపురనేని రామస్వామిగారు ఇలాంటి అపూర్వమయిన 'భగవద్గీత'ను సృష్టించి, ఆంధ్రుల ప్రతిభను మారుమ్రోగునట్లు చేయడం తెలుగువారి కందరికీ గర్వకారణం కదా!



# నాటకాలు

కావ్యాలు శ్రవ్య కావ్యాలనీ, దృశ్యకావ్యాలనీ రెండు విధాలు. ఈ రెండు రకాల కావ్యాలలోనూ పాత్రపోషణ, వర్ణన, రసము మొదలైనవి సమానమైనప్పటికీ, వాటిని అభివ్యక్తం చేయడంలో కొంత భేదముంటుంది. ఈ భేదం ప్రత్యేకంగా రచనాసంవిధానానికి సంబంధించినది. శ్రవ్య కావ్యాలలోని 'వస్తువు' కేవలమూ పాత్రల ముఖతః మాత్రమే కాకుండా, కవి ముఖతః కూడా వెలువడుతూ ఉంటుంది. అంటే తాను చెప్పదలచుకొన్న విషయానికి వాహకాలుగా మాత్రమే పాత్రలు ఉంటాయన్న మాట. ఐతే, ఈ పాత్రలు కవి చేతిలోని కీలుబొమ్మలు మాత్రం కావు. కారాదు కూడాను. వాటి వ్యక్తిత్వం వాటికి విధిగా ఉంటుంది. పాత్రలద్వారా చెప్పడానికి సాధ్యపడనప్పుడు మాత్రమే కవి తాను ప్రవేశిస్తాడు. ఇక దృశ్య కావ్యాలలోని పాత్రల రూపాలను నటులు ధరించి, సంభాషణ రూపంలోనూ, అభినయాదుల చేతనూ ప్రదర్శింపగా సామాజికులు చూచి ఆనందిస్తారు. ఇవే నాటకాలు, వీటినే రూపకాలనీ అంటున్నారు. కథలోని పాత్రల రూపం, నటులకు ఆరోపించ బడుతుంది కాబట్టి, వీటికి రూపకాలనే పేరు గలిగింది. వీటి ప్రయోజనం 'సద్యః పరన్విృతి, సాంఘికోద్ధరణం'. మన పూర్వులు 'నాటకాంతం హి సాహిత్యం' అనీ, 'కావ్యేషు నాటకం రమ్యం' అనీ అన్నారు. దృశ్యకావ్యాలలో ఉన్న మరొక సుగుణం — ఇది ప్రజానీకానికి అత్యంత సన్నిహితం కావడం, ఒక గ్రంథం చదివి ఆనందించలేని వ్యక్తి, ఒక నాటకాన్ని చూచి ఆనందించ వచ్చు. విషయం పాత్రలద్వారా, సంభాషణ రూపంలో అభివ్యక్తీకరింప బడటం వల్ల, నిరక్షరాస్యులు కూడా నాటకంచూసి, విషయాన్ని గ్రహించడానికి అవకాశం ఏర్పడుతుంది. అంటే ఒక నీతినో, ధర్మాన్నో, సందేశాన్నో, నూతన భావాన్నో, సంస్కరణనో, లక్షలాది ప్రజల వద్దకు తీసుకెళ్ళడానికి, నాటకం అత్యంతోపయుక్తమైన, అత్యుత్తమమైన సాధనమన్నమాట !

ఈ విషయం తెలిసిన కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు, నాటకాన్ని తమ అభిప్రాయాల ప్రచారానికి సాధనం చేసుకొన్నారు. సాధారణంగా ప్రచార నాటకాలలో, నాటకీయత లుప్తమయి, ప్రచారం కొట్టవచ్చినట్లుగా కానరావడం కద్దు. నినాదాల పుట్టలుగా అవి మారడమూ మనకు తెలుసు. కాని కవిరాజులోని ప్రత్యేకత అక్కడే ఉన్నది. సాహిత్య పరంగా అత్యున్నత శ్రేణికి చెందినవారి నాటకాలు నిర్దేశించిన సాంఘిక ప్రయోజనాలను సాధించడమే కాకుండా, ప్రజాదరణను కూడా పొందాయి.

'కురుక్షేత్ర సంగ్రామం' - 'శంబుక వధ' - 'ఖూనీ', కవిరాజుగారి ముద్రిత నాటకాలు. 'కారెంపూడి కదనం', 'కొండవీటి పతనం' - 'రాణా ప్రతాప్' - 'నరకం', 'అంపకం', అనేవి అముద్రితాలు.

ముందుగా అముద్రిత నాటకాలను గురించి కొంచెం తెలుసు కొందాం. మొట్టమొదటి రూపకం కారెంపూడి కదనం పలనాటియుద్ధం ఇతివృత్తంగా గైకొని ఇది రచించబడింది. ముఖ్యమైన పట్టణాలలోనేగాక అంగలూరు, చేటపల్లి మొదలైన గ్రామాలలో సైతమూ ఈ నాటకం ప్రదర్శింపబడింది. దీని వ్రాతప్రతి చాలా కాలం వరకూ చౌదరిగారింట్లో వుండి, వెలుగు జూడకుండానే ఖిలమై పోవడం ఆంధ్రుల దురదృష్టమనే చెప్పాలి.

స్వాతంత్ర్య పోరాటం ముమ్మరంగా జరుగుతున్న రోజుల్లో రామస్వామిగారు 'కొండవీటి పతనం', 'రాణా ప్రతాప్' నాటకాలు రచించారు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగానూ, స్వాతంత్ర్య ఉద్యమానికి అనుకూలంగానూ 'వ్రాయబడిన నాటకాలు ఇవి. బిపిన్ చంద్రపాల్ ఆంధ్రదేశ పర్యటనను ...కరించుకొని అనేకచోట్ల ఇవి ప్రదర్శింపబడ్డాయి. ఈ నాటకాలు ...కంలో దేశభక్తినీ, స్వాతంత్ర్యానురక్తినీ, వీరావేశాన్నీ కలిగించాయి. ...ప్రధానంగా గలిగి ఆంధ్రజాతిని ఉత్తేజితలూగిస్తున్న ఈ నాటకాల ...నలతో బ్రిటిషుప్రభుత్వం భీతిచెంది, ఈ నాటకాలను నిషేధిస్తూ

జి.వో ను జారీ చేసింది. అందువల్ల కృష్ణాజిల్లా కలెక్టర్ నాటక ప్రతులన్నీ స్వాధీనం చేసుకొన్నాడు. అంతేగాదు వాటినన్నీ కట్టగట్టించి తగల బెట్టించాడు. అముద్రిత నాటకాలైన 'నరకం', 'అంపకం' కూడా అదృశ్య మయ్యాయి. చౌదరిగారి ఇతర గ్రంథాలవలే 'నాటకాలు' కూడా ఆంధ్ర దేశంలో పెద్దగాలి దుమారాన్ని లేపాయి. ఈ పెనుగాలికి తట్టుకోని ఒక పెద్దమనిషి 'సాహిత్యరంగం కురుక్షేత్రరంగంగా మారిపోయింది' అని ఆశ్చర్యపోయాడు. ఇప్పుడు వారి ముద్రిత నాటకాలను ఒక్కొక్కదాన్ని గురించి సంక్షిప్తంగా తెలుసుకొందాం.

## కురుక్షేత్ర సంగ్రామము

లోకమంతటా అప్పటివరకు కౌరవులు దుర్మార్గులనీ, అవినీతిపరులనీ, పాండవులే సన్మార్గవర్తనులనీ, పూజ్యులనే భావం ప్రచలితమై ఉంది. ఇది యథార్థంగాదని గాఢంగా విశ్వసించారు చౌదరిగారు. అంధవిశ్వాసాలతో నిండి నిబిడీకృతమయిన సమాజంలో చైతన్యం కలిగించడానికిగాను ఈ 'కురుక్షేత్ర సంగ్రామము' రచించబడింది. తొలి ముద్రణ 1910 సం.లో జరిగింది. దీనిలోని ఇతి వృత్తం మహా భారత యుద్ధానికి సంబంధించినది. అందుచేత ఇది వీరరస ప్రధానమైన నాటకం. మరొకరైతే దీనికి 'పాండవ విజయము' అని పేరుపెట్టి ఉండేవారు. కాని కవిరాజు ఆ విధంగా చేయలేదు. అందుకు కారణం పాండవులకు లభించిన విజయం ధర్మమార్గసంగతం కాదని చౌదరిగారు అభిప్రాయపడటమే ! ఎందుకలా అభిప్రాయపడవలసివచ్చిందో ఈ నాటక ఉపోద్ఘాతంలో అడవి సాంబశివ కవిగారు యిలా విశదీకరించారు.

"హస్తినాపుర రాజ్య సింహాసనము చక్రవర్తు లారోహించుటచే మొదటినుండియు గౌరవము నందియుండినది. దీని నధిరోహించిన

పూరుభరతాదులగు శంతనువఱకుఁగలఁరాజులందరు జ్యేష్ఠాను క్రమముగనే రాజ్యభారము వహించుచుండిరి. ప్రదీపునకు శంతనుఁడు, బాహ్లికుఁడు ననువారు పుత్రులు. అందగ్రజుఁడగు శంతనుఁడు రాజయ్యె అవరజుండగు బాహ్లికుఁడు రాజభరణము నందుచు రాజ్యహీనుఁడై యుండి భారత రణంబున మడిసె. శంతనునకు నగ్రసుతుఁడు భీష్ముఁడు. ఇతడు పితృర్థము సన్యస్త రాజ్యుండయ్యెను. సత్యవతీ ప్రథమ పుత్రుఁడగు చిత్రాంగదుఁ డనపత్యుండై గతించుటచే, విచిత్రవీర్యుండనువాని యవరజుడు సింహాస నాసీనుఁడై యనపత్యుడై దివికరుగఁ దక్షేత్రమున వ్యాసునిచే దేవర న్యాయంబున ధృతరాష్ట్ర పాండురాజులు గలిగింపఁబడిరి. ధృతరాష్ట్రుండు జాత్యంధుఁడు గావున రాజ్యార్హుఁడు కాఁడయ్యె. తదనుజుఁడగు పాండురాజును బాండురోగ పీడితుఁడగుటచే రాజ్యార్హుఁడు కాఁడందురు. పాండురాజు నిజ పరాక్రమముచే నెల్ల దిక్కులు జయించి రాజ్యాసనంబున నంధుండగు తన యన్ననునిచి తానే రాజ్యము చేసెను. ధృతరాష్ట్రునకు దుర్యోధనాదులు సుతులు. పాండురాజు కొమరులు ధర్మరాజాదులు. ఈ యిరు తెగల వారికి రాజ్య సింహాసన విషయమై పోరాటము సంభవించినది. పాండు పుత్రులకు ధృతరాష్ట్రుఁడు పితృభాగమని రాజ్యమున సగము పంచి యిచ్చి నట్లును, బాండవులు మరల నిట్టి యర్ధరాజ్యమునే కోరి సుయోధన నిరాకృతులై యుద్ధము చేసిరనియు నాంధ్రభారతమందలి కథవలనఁ దెలియుచున్నది. రాజ్యానర్హత ధృతరాష్ట్ర పాండురాజుల కిరువురకుఁ బ్రాప్తించియుండఁగా నెటులైన ధృతరాష్ట్రుఁడు సింహాసనాసీనుఁడయ్యెఁ గదా ! అప్పుడు జేష్ఠాను క్రమముగల రాజ్యపీఠమునకు సుయోధనుడే హక్కుదారుఁడై యుండును. పాండవాగ్రజుఁడట్టి రాజ్యమునుగాని యదియవిభాజ్యమౌటచే నందలి భాగ మును గాని కోరుట కర్హుఁడు కాడు. ఇది ధర్మ శాస్త్రానుగుణమైన పద్ధతి.

ఆంధ్ర భారతమునందీ సందియ మెచ్చటను బరిష్కరింపఁబడలేదు. ఇదిగాక ధృతరాష్ట్ర పాండురాజు లిరువు రాజ్యార్హులు గామిచే నరాజకమగు

రాజ్యమును భీష్ముడు ధృతరాష్ట్రుని నామమాత్ర రాజుంగావించి తానే రక్షించుచుండుటచే వారి సంతానమగు యుధిష్ఠిర దుర్యోధనులలో నెవ్వరు పెద్దవారో వారు రాజ్యపీఠము నధిరోహించుట కర్హులందురేని సర్వజ్యేష్ఠుడగు ధర్మరాజే రాజ్యమునకు నుత్తరాధికారియగుగదా. అట్టగుటచేతనే ధృతరాష్ట్రుడు తన సుతుడగు దుర్యోధనుడుండగాధర్మరాజునకే యువరాజ్య పట్టాభిషేకము జేసెను. యువరాజ్య పట్టాభిషిక్తుడెవడో వాడే రాజ్యమునకు నుత్తరాధికారి యనుట లోకప్రసిద్ధమగు నాచారమేగదా. ఇట్లుండగా ధృతరాష్ట్రుడు యువరాజ్యపట్టాభిషిక్తుడగు ధర్మరాజునకు నర్ధరాజ్యంబిచ్చి ఇంద్రప్రస్థనగర మునకు కనుపుటకు కారణమేమి? భీష్మాది కురువృద్ధులీ రాజ్యవిభజన కెట్లంగీకరించిరి? ఇది శాస్త్రగర్హితము కాదా? మఱియు పాండురాజు తన పరాక్రమముచే బెక్కు దేశంబులు జయించి హస్తినాపుర రాజ్యముతో జేర్చెను గదా?

''ఆ రాజ్యమునం దతని పుత్రుల కధికారంబుండునందమన్న దాను రాజునని ప్రకటించి పాండురాజు రాజ్యంబు నార్జించలేదు. రాజ్యాధికారి యగువాని పేరుమీదనే తాను యుద్ధముచేసిన తదుపార్జితము రాజునకే చెందును గాని వానికందధికారంబు లేదు. పోని పాండురాజు కష్టపడి రాజ్యాభివృద్ధి చేసినాడని ధృతరాష్ట్రునకు నతనియందుగల విశ్వాస గౌరవమునకు జిహ్నముగా దత్పునికి కొంత రాజ్య మిచ్చెనందుమా ధృతరాష్ట్రుడు రాజ్యప్రదాన కాలమం దట్లనలేదు.

గీ॥ 1''సర్వలోక కర్మ సాక్షి యీ కృ డు
సాక్షిగాఁగ మీకు సకల వృద్ధ
రాజులొద్ద నర్ధ రాజ్యమిచ్చితిఁబాండు
రాజు విభవమెల్ల రమణఁ గొనుఁడు''

1. ఆంధ్రమహాభారతము

అనిచెప్పెను. కావున నెట్లు విచారించినను ధర్మారాజునకు నర్ధరాజ్యమిమ్మని కోరు నధికారము లేశమాత్రము లేదు. అధికారమున్న సర్వ రాజ్యమును గోరు నధికారమే యుండవలయును. అట్లు సర్వరాజ్యాధికారమే కలదు. పెద్దతండ్రి యందలి గౌరవముచేత నతనికి సగము వదలెనందురా యవి భాజ్య రాజ్యము విభజించుటకు యోగ్యత లేదు ఇదివఱకి రాజ్యమట్లెన్నడు విభక్తము కాలేదు. పోనీ! విభజించిరన్నను శంతను భ్రాతయగు బాహ్లికుండు సజీవుడై యుండగ వానికి భాగమీయకుండుటకు కారణము లేదు. విచిత్రవీర్యు ననంతరము ధృతరాష్ట్ర పాండురాజు లిరువురు సింహాసన మధిరోహించుట కనర్హులుకాగా రాజ్య మరాజకమగునేని శంతను సోదరుడగు బాహ్లికునకు నా రాజ్యాధికారము సంక్రమించ వలసినదేకదా ! అట్లు కాలేదు. ధృతరాష్ట్ర పాండునృపతులలో నెవరో యొకరు రాజయి యుండవలెను. పాండురాజు సింహాసనాసీనుడు కాలేదు. ధృతరాష్ట్రుడే రాజయినాడు.

ఉ॥ 1"ఆయము సర్వమున్విడిచి యన్య నృపుల్వనిసేయుచుండ గాం
గేయ భుజాలంబున నికృత్తవిరోధి సమాజుఁడై కుమా
రాయత శక్తిశాలి ధృతరాష్ట్రుడు రాజ్యముచేసె"

అని కంఠోక్తి ధృతరాష్ట్రుడే రాజ్యము చేసినట్లు వ్రాయ బడి యున్నది. పాండురాజే రాజ్యాధికారి కానప్పుడు సుతులు 'తమ యయ్య సగంబిల పంచి యిమ్ము" అని యగుటకు అధికారము లేదు. ఈ కారణముల వలన పాండవు లకు రాజ్యాధికారము లేనట్లు స్పష్టమగుచున్నది. ఏది యెట్లున్నను నంధ నృపతి తమ్ముని బిడ్డల యందలి పక్షపాతముచేత గొంత రాజ్యమిచ్చినందున దుర్యోధనుండా రాజ్యవిభాగము నంగీకరింపక తండ్రి కెదురాడలేని

1. ఆంధ్ర మహాభారతము

మోమాటముచే నప్పటికి కేమియు ననక పదపడి ద్యూతవ్యాపారముచే దానిని మరల దీసికొనియె. అట్లు తీసుకొనునప్పుడు పండ్రెండేండ్లు వనవాసము నొక్కయేడు అజ్ఞాత వాసమును పాండవులు చేయవలయునని నిబంధన యేర్పఱుప బడెను. ఇట్లు సేయుటకుగల సూక్ష్మాభిప్రాయము, సాధారణముగా బండ్రెండు సంవత్సరము లొకరియాస్తి వారి యనుభవములోనుండి తొలగి పరాధీనమై యుండినయెడల వారికి దానియందలి స్వత్వము నశించునను ధర్మశాస్త్రాంశమే. ఇట్లు చూచినను పాండవులకు పదమూడేండులు తమ యనుభవములో లేని రాజ్యమునందు హక్కు నశించెం గావున నద్దాని వారు మరల కోర గూడదు. ఎన్ని విధముల నాలోచించినను పాండవులకు రాజ్యాధికారము లేదనియు, వారు దానింగోరి యుద్ధము సేయుట అన్యాయ మనియు కనుపించుటకు సందియము లేదు.

'కురుక్షేత్ర సంగ్రామం'లో పాండవుల దాయభాగార్హతను కవిరాజు ప్రశ్నించినపుడు పండితలోకం ముక్కుమీద వేలువేసుకొంది.

మహాభారతంవంటి విపుల విషయగ్రథిత గ్రంథంనుండి విషయాన్ని తీసుకోవడమే కాకుండా, దాన్ని తన దృక్పథంనుండి నాటకంగా వ్రాయ బూనడం చౌదరిగారు తలపెట్టిన సాహస కార్యాలలో ఒకటి.

నాటక ప్రారంభం ప్రేక్షకుల మనస్సులను ఇట్టే ఆకట్టుకొనేలా ఉండాలి. వారిదృష్టిని నాటకంపైకి కేంద్రీకరింపచేయాలి. వివిధ విధాలుగా ఉండే ప్రేక్షకలోకం, తెరలేవగానే, దృశ్యంలోకి రావాలి. అంటే — ప్రారంభం చిత్తాకర్షణీయంగా ఉండాలన్నమాట. నాటక శిల్పం కరతలా మలకంగా ఉన్న కవిరాజు సంజయ రాయబారంతో ఈ నాటకాన్ని ప్రారంభించారు. ఈ విధంగా ప్రారంభించడం వల్ల అప్పటి కురు పాండవుల పరిస్థితి ఎలా వుందో ప్రేక్షకులకు వెంటనే స్ఫురిస్తుంది. ఇవు

పక్షాల మధ్యనూ రాయబారం నడుపుతూ సతమతమౌతున్న సంజయుని ఒక్క చిన్న పద్యంలో అత్యంత రమణీయంగా చిత్రించారు రామస్వామిగారు.

తే. "ఆఁబోతులు రెండు పోరాడుచుండ
నడుమనున్న లేగలకాళ్ళు నలఁగునట్లు
పుడమికై కురుపాండవుల్ పోరనున్న
నొరులు చచ్చెద రిటునటు తిరుగలేక".

ఇది మూడంకాల నాటకం. మొదటి అంకంలో సంజయ, కృష్ణ రాయబారాలు రెండవ అంకంలో భీష్మ యుద్ధం, మూడవ అంకలో ద్రోణయుద్ధం చమత్కారపూరితంగా వర్ణించబడ్డాయి. పాండవుల కంటే కౌరవులే నీతిపరులనీ, పాండవుల కసలు రాజ్యార్హత లేదనే అభిప్రాయాన్ని వారి నాటకంలో బలీయంగా వెలిబుచ్చారు. ఈ గ్రంథం వారు తమ చిన్న నాట వ్రాసింది. నాటక రచన పూర్తి అయిన అనంతరం వారి గురువర్యులైన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారికి రామస్వామిగారు చదివి వినిపించారు. సావధానంగా విన్న శాస్త్రిగారు "ఏమి రామస్వామి ! పాండవులకు అరణ్య, అజ్ఞాతవాసాలదృష్ట్యా పదమూడు సంవత్సరాలు గడిచాయి కాబట్టి వారికి న్యాయశాస్త్ర రీత్యా రాజ్యార్హత లేదన్నావు. బాగానే ఉంది. ఆయితే సత్యానికి పన్నెండు సంవత్సరాల లిమిటేషన్ ఉంటుందా ?" అని ప్రశ్నించారు.

"అదికాదండీ! దుర్యోధనుడి పక్షాన ఉన్న 'లీగల్ యాస్పెక్ట్స్' (Legal aspects)ను లోకానికి తెలియజేయడమే నా అభిమతం" అన్నారు రామస్వామిగారు మందస్మిత వదనంతో.

పాండవులకంటే కౌరవులే నీతిపరులని నిర్భీకంగా సాహసించి, పాత సంప్రదాయాల నుల్లంఘించుట చేత, బ్రాహ్మణ వర్గం ఒక్కసారిగా కవి

రాజుపై కక్ష్యకట్టి జేసింది. ఈ నాటకం ప్రథమ ముద్రణ ఘాటైన విమర్శనలకు గురి అయింది. రామస్వామిగారు 1916 సం. జనవరి ఏడవ తేదీన శ్రీ లింగం వీరభద్రయ్యగారికి ఒక లేఖ యిలా వ్రాశారు.

[1]"నా కురుక్షేత్ర సంగ్రామముపై నెవ్వరో యిద్దరు విద్యార్థులు విమర్శనము వ్రాసిరట! వ్రాయుట యుక్తమే! విమర్శనమువలనగాని సత్యాసత్యములు బయటపడజాలవు. నేను విదేశమునందున్న యప్పుడు మాత్రము వ్రాయుటచే, విమర్శకులు సద్బుద్ధితో వ్రాసిరని యెంచుటకు వీలుండదు? ఎవ్వరీ విద్యార్థులు? ఏ స్కూలులో చదువుచున్నవారు? తమంతట తామే వ్రాసిరో, ఎవ్వరి ప్రోద్బలము చేతనైన వ్రాసిరో, కనుగొని నాకు తెలియజేయవలయును. తెఱచాటున బొమ్మయొకటి యుండి యాడించు చుండునని యనుమానము కలుగుచున్నది. ఇదియెంతవరకు నిజమో రూఢిగా కనుగొని, సత్యమును తెలుపుదువని నమ్ముచున్నాను. తెఱచాటున నెవ్వరున్నను భయపడను. కాని నిజము మాత్రము కావలయును." విశ్వనాథ సత్యనారాయణగారు, కొడాలి ఆంజనేయులుగారు ఈ నాటకమును విమర్శించిన వారిలో ముఖ్యులు. అటు తరువాత కొంతకాలనికి కవిరాజు భావాలే సరియైనవి విమర్శకులు అంగీకరించక తప్పలేదు. కొడాలి అంజనేయులు గారు "కవిరాజు గారి కురుక్షేత్ర సంగ్రామాన్ని నేనూ, విశ్వనాథవారు విమర్శించాము. 1920 సం. నుండీ దేశం పొందిన పరిణామంలో పాటు నేనూ పరిమణామం చెందాను. నేను అట్టి విమర్శన గ్రంథములు గొప్పవని గ్రహించాను. రౌండ్ టేబుల్ సమావేశంలో అంబేద్కరు గాంధీజీని వ్యతిరేకించినప్పుడు నామనస్సు నొచ్చుకొన్నది కానీ తర్వాత ఆలోచించగా మనమే వారి స్థానమున వున్నచో అంతకంటె హెచ్చు ఆందోళన కావించెడి వారమని నిశ్చయించుకొంటిని. అదే మార్గమున కవిరాజు గారి భావవిప్లవం జరిగింది. కాన వారి ప్రతి గ్రంథమును విజ్ఞాన దృష్టితో చదువ వలెనని నాకోర్కె" అన్నారు.

1 కవిరాజు లేఖలు-డైరీలు, 1972

అడవి సాంబశివకవిగారు. "భారత కథ ననుసరించి వెడలిన కొన్ని నాటకములను తిలకించితిని. కాని కథా సందర్భము, కూర్పు నేర్పు, రంగ నిర్మాణము మొదలైన వానియందు జాలవరకు నీ గ్రంథమే మెరుగుగనున్నది. కథా సందర్భమును రమణీయముగ నలవఱచు నేర్పు కవికి మిక్కుటముగ గలదు, శైలి మృదుమధురము" అన్నారు.

"త్రిపురనేని రామస్వామి గారు ఒక ప్రాంతానికిగాని, ఒకవర్గానికిగాని చెందిన వ్యక్తికాదు. ఆయన ఒక ఉద్యమం. భారత రచనకు పాండవుల మునిమనుమడైన జనమేజయుడు కారకుడగుటచేత పక్షపాత దృష్టితో వ్రాయబడినదని కవిరాజు నమ్మి నిష్పక్షపాతంగా దానిని విమర్శించారు. ధర్మపక్షం పాండవులది కాదని, కౌరవులదేనని నిరూపించారు. భారతం అందరిసొత్తు. దాన్ని విమర్శించినందుకు ఒక మతాన్ని ద్వేషించారని కవిరాజున కాపాదించడం న్యాయం కాదు" అన్నారు శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి.

ఇటువంటి అభినందనలు, అభిశంసలూ కూడా అసంఖ్యాకంగానే ఉన్నాయి. విషయం కొత్తదైనప్పటికి, రచనా సంవిధానంలో రామస్వామి గారు ప్రజాభిరుచులను పాటించారు. కేవలం సంభాషణాత్మకమైన నాటకాలకంటే గద్య, పద్యాత్మకాలు మరింత రాణిస్తాయని వారికి తెలుసు. ఈ కారణంగానే వారి నాటకంలో సందర్భోచితంగా పద్యాలను వాడారు. ఇక సంభాషణల శిల్పవిన్నాణం సరే సరి! ప్రేక్షకుల హృదయాలనుండి రివ్వున దూసుకు పోగల శక్తి వాటికున్నది.

ఈ నాటకంలోని కవితాధార, పదప్రయోగ నైపుణ్యం, పద్యముల నడక హొయలు అపూర్వం. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారి ప్రభావం ఈ గ్రంథంలో గాఢంగా కనిపిస్తున్నది.

మచ్చుకో పద్యం ఉదహరిస్తాను.

చం. 'రథియుఁట కాలకేయముఖ రాక్షసపక్షస్మర బాహుశాలి, సా
రథియుఁట సర్వలోక పరిరక్షణ శీలుఁడు కృష్ణమూర్తి, త
ద్రథముఁట వీతిహోత్రుని కృతజ్ఞతఁ దెల్పు ఫలంబు, మీమనో,
రథముఁట దీర్పకున్నె? కురురాజసమూహము లెన్నివచ్చినన్'

ముట్నూరి కృష్ణారావు గారికి ఈ పద్యం చదివి వినిపించినప్పుడు తేజోవిలసితమైన వారి కళ్ళు విస్ఫారితాలయ్యాయి. సంస్కరణాభిలాష, సాంఘిక విప్లవమూ దృష్టి యందుంచుకొన్న చౌదరి గారు యుగ యుగాల నుండి ఈ తెలుగునాట కరుడు గట్టిన అంధ విశ్వాసాల మీద ఒక్కుమ్మడిగా ప్రళయ ప్రభంజనునివలే విజృంభించి తిరుగుబాటు చేశారు. అందుచేతనే వారిని 'విప్లవకవి' అని గౌరవించుకొంటున్నది ఇప్పటి సంఘం.

## శంబుక వధ

ఇది చౌదరి గారి రెండవ రూపకం. దీని రచనకు కావలసిన సమాచారం డబ్లిన్ లోని గ్రంథాలయాల నుండి సేకరించారు. భారతదేశ చరిత్రను పరిశీలించి వ్రాయబడింది. మన దేశ చరిత్రను పరిశీలించి చూస్తే ఆర్య, అనార్య సంఘర్షణలు ముమ్మరంగా కనిపిస్తాయి. అనాదినుండి ఆర్యులు ద్రావిడులను పెక్కు ఇక్కట్లకు గురిచేస్తూనే వచ్చారు. మధ్య ఆసియా నుండి వచ్చిన ఆర్యులు వర్ణవ్యవస్థను ఏర్పరచడమే కాకుండా, ఈ దేశం మీద ఆధిపత్యం కూడా సంపాదించారు. ద్రావిడులపై అనేక ఆంక్షలు విధించి నిర్దయగా అణగద్రొక్కారు. రామరాజ్యంలోనే ఆర్యుల బాధ

ద్రావిడులకు తప్పలేదు. ఆర్య పక్షపాతియైన శ్రీరామచంద్రుడు ద్రావిడులను అష్ట కష్టాలూ పెట్టాడు. [1]'కృశాంగున్, నిరాహారున్, శోణజటాచ్ఛటాధరున్, మహోగ్రాచారు, నేకాగ్రతా పారీణాత్ము నధోముఖున్, ఖసితకుంభత్పాండుర శ్రీనిధిన్, ధీరత్వాకరు జీరధారు, దీవ్యత్త పస్సాన్వితుడైన శంబుకుని 'అనార్యతాపసి' అనే కారణంతో దయాదాక్షిణ్యాలు లేకుండా శ్రీరామ చంద్రుడు సంహరించాడు - అంటే - రామరాజ్యంలో అనార్యులకు తపస్సు చేసుకునే కనీస హక్కు కూడా లేదన్నమాట ! ఈ సాంఘిక అధర్మాన్ని అద్దంపలే ప్రతిబింబింప జేస్తూ, రసోచిత పద ప్రయోగంతో నాలుగంకాల రూపకంగా రూపొందించారు రామస్వామి చౌదరి గారు. ఇది తొలిసారి 1920 సం.లో ప్రకటించబడినది. ఇందులో స్వతంత్ర సిద్ధికొరకే శంబుకుడు ప్రాణత్యాగం చేశాడనీ, ద్రావిడులను దాస్యంలో వుంచడానికిగాను శ్రీరామ చంద్రుని మతగురువైన వశిష్ఠుడు పన్నిన కుట్రను రామస్వామి చౌదరి గారు ఎలుగెత్తి లోకానికి చాటారు. పందలాది రామాయణాలు వ్రాసిన వారున్నారు కాని ఏ ఒక్కరూ శంబుకునకు జరిగిన అన్యాయాన్ని వ్రేలెత్తి చూపించ గలిగారా ? లేదు.

ఈ నాటకంలోని సంభాషణలు సామాన్యుని హృదయానికి హత్తు కొనేలా ఉన్నాయి.

చైనులు : ద్రావిడులయందు నూతన శక్తి యొండుద్భవిల్లినది. ఆర్యులతో సమాన స్వత్వమును గోరుచున్నారు. దీని అంతకును మూలకరద మా శంబుకుడు. వానినీ గడతేర్చిన గాని యీ యాందోళనము సమసిపోవదు.

1. కంకంటి పాపరాజు - ఉత్తరరామాయణం.

సోమయాజి: అయితే నీవు శంబుకు నెఱుంగుదువా? వాడెంత పనిజేయు చున్నాడు? తొల్లి తపోభంగమై ద్రావిడుడై పుట్టెనుగాబోలు.

చైనులు : ఆ! యెఱుంగుదును. పరమ సాధువు. విజ్ఞాని, పరోపకారము దలపెట్టడు.

సోమయాజి: నీ మాటలు చిత్రముగా నున్నవి. అట్లయినచో నిది యంతయు నేమిటి? ఎందులకు వచ్చిన పని?

చైనులు : ప్రజలందరు సమానముగా బరిపాలింప బడవలయుననియు సమానమగు హక్కు లుండవలయుననియు నాతని వాదము. అందులో మత విషయమున నీషణ్మాత్రమైన భేదముండ గూడదని యాతని యభిప్రాయము. అందుచే నతడిట్లు చేయుచున్నాడు.

సోమయాజి: అట్లయితే ఋషిప్రోక్తములగు గ్రంథములన్నిటిని సున్న చుట్టవలసినదేనా?

చైనులు : స్వత్వసామాన్యమునకు బ్రతిబంధకములగు నీతులన్నియు గర్హ్యములనియే యాతని యభిప్రాయము.

సోమయాజి: ఓహో! కొంపకు నిప్పు ముట్టించుచున్నాడే? అతడిప్పుడెక్కడ నున్నాడు?

చైనులు : మన పట్టణంబునకు బరిసరంబుననే సరయూనదీ తీరమున చిదానందాశ్రమ మని పేరు పెట్టుకొని యొక యాశ్రమము నిర్మించుకొని తపస్సు జేసికొనుచు, నప్పుడప్పుడు శిష్యులకు తత్త్వోపదేశము గావించుచున్నాడు.

సోమయాజి: (మండిపడుచు) ఏమి! తపస్సా? శూద్రుడు, తపస్సా? శిష్యుల కుపదేశములా? ఏమివింత? రామరాజ్యంలోనే యిట్టి వింతలా? ఇప్పుడు మనము చేయవలసినది యేమి?

ఈ నాటకం తెలుగునాట సాధించిన ప్రయోజనం అమూల్యమయింది. 1934 సం.లో ఈ నాటకం రెండవకూర్పు జరిగింది. దీని తొలి పలుకుల్లో నాటకకర్త యిలా వ్రాశారు :

"పదిహేనేండ్లవాడు శంబుకవధ ఆంధ్రలోక ప్రచారంబునకై వెడలి నప్పుడు లోకము సంపూర్ణ విముఖముగ నుండెను. పలుకరించువారు లేరు. ఆదరించువారు లేరు. అయినను మొండికట్టెయై, దేశదేశములు తిరిగినది. రంగూను వెళ్ళినది. దక్షిణ ఆఫ్రికా వెళ్ళినది. లెక్కలేనన్ని దూరులు పడుచు, లెక్కపెట్టక యిల్లిల్లు తొంగి చూచి తనకు తోచినరీతి నీతులు చెప్పినది. కట్టకడకు విముఖంగా నున్న లోకం కొంతవరకు సుముఖమైనది. పలుకరించిరి. ఆదరించిరి. ఆతిథ్య మిచ్చిరి, ఆహ్వానములు వచ్చెను, పిలుపులు వచ్చెను. 'మా యూరువచ్చి యుపన్యసింపవలయు' నని ప్రజలు కోరిరి. పిలుపు వచ్చినచోటికెల్ల నేగినది. ఉపన్యసించినది. ప్రజలయొక్క దృక్పథములో మార్పు కలిగించినది. భావ పరిణామము చేకూర్చినది". అనేక చోట్ల "శంబుక వధ" దిగ్విజయంగా ప్రదర్శించబడటం నేను స్వయంగా చూశాను.

ఉ. "చాకలివాని మాటలు నిజమ్మని నమ్ముచు శంకితాత్ముడై
యాకమలాయ తాక్షిని, సమంచిత సాధ్విని, బూరగర్భిణిన్
లోకులు నవ్వఁగారడివిలో వసియింపఁగ నట్టెపంపఁడే
యాకకునింతయేని నెదురాడని తల్లియటంచుఁగాడొకో"

శంబుకుడు ఈ పద్యం పాడి నప్పుడు, ప్రేక్షకులలో కలిగిన సంచలనం ఇప్పటికీ నా కళ్ళలో మెదులుతూ ఉంది. సంస్కరణాభిలాష గల నాటక

సమాజలెన్నో దీనిని ప్రదర్శించాయి. అంత వరకూ భగవంతుడుగా ఆరాధించబడుతున్న శ్రీరాముని యదార్థరూపాన్ని యీ నాటకం ప్రదర్శించింది. నాటకం చూచినప్పుడు శ్రీరామచంద్రుడు శంబుకుణ్ణి అన్యాయంగా సంహరించినందులకు అతనిపై మనకు కరుణ కలుగుతుంది. శ్రీరామునిపై కోపం మాత్రం రాదు ఈ విధంగా కరుణ రసం పెల్లుబుకుతుందీ నాటకంలో. పాత్రపోషణలో చౌదరి గారిది అందెవేసినచేయి. వశిష్ఠుడు పన్నిన కుట్రను మన కళ్ళకు కట్టినట్లుగా చిత్రించారు. ఈ నూత్నకాంతులకు ఆంధ్రులు దిగ్భ్రమ జెందారు. ఆ వెలుగులో సత్యాన్ని వారు చూడ గలిగారు. ఫలితంగా రామాయణ గాథపట్లనే వారికి అనేక సందేహాలు కలగసాగాయి. ఈ సందేహాలకు సంతృప్తికరమయిన సమాధానాలను వారు, వేరే గ్రంథంనుండీ పొందలేకపోయారు. దీనిపై తర్క-వితర్కాలు బయలు దేరాయి. శంబుక వధ న్యాయంకాదని అనేక మంది భావించసాగారు. ఊరూరా, వాడవాడా, కవిరాజు కనేకమంది ఏకలవ్య శిష్యులు తయారయ్యారు. ఈ మార్పు చూసి కలవరపడి పెక్కుమంది బ్రాహ్మణులు శంబుకవధపై దాడిచేశారు. కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రి గారు శంబుకవధను విమర్శించారు. బ్రహ్మయ్యశాస్త్రి గారు రామస్వామి గారి వాదమంతా అంగీకరిస్తూ, శంబుకవధను ప్రేరేపించినది వశిష్ఠుడు కాడనీ, నారదుడనీ. నారదుడు బ్రాహ్మణుడు కాడనీ, దేవర్షియనీ, అందుచేత ఈ నిందను బ్రాహ్మణుల నెత్తిమీద వడవేయడం ధర్మం కాదనీ అన్నారు. ఈ వాదం కొంతవరకు సత్యమే అని ఒప్పుకొంటూ రామస్వామిగారు శాస్త్రి గారికి యిలా సమాధానం ఇచ్చారు. "నారదుడు దేవర్షి అయినను బ్రాహ్మణుల చేతిలోని కీలుబొమ్మ అనీ, శంబుకవధ న్యాయమా ? అనే సంగతి చర్చించేటప్పుడు ఆఘాతుక కృత్యం చేయడానికి శ్రీరాముణ్ణి ఎవరు ప్రేరేపించిందీ అనే విషయం గమనింపదగింది కాదని అన్నారు. ఇంతేకాదు, నారదుడు మోసంతో శ్రీరామునిచేత శంబుకవధ చేయించాలనుకొన్నప్పుడు వంశగురుడైన వశిష్ఠుడు అది జరుగకుండా చేయాల్సి ఉంది. అట్టి ప్రయత్నం వశిష్ఠుడు

చేయలేదు కాబట్టి వశిష్ఠునికి శంబుకవధ ఇష్టం అనడం స్పష్టం. వశిష్ఠుడు శంబుకవధకు బహిరంగంగా ప్రోత్సహించకపోతే. బహుశః కనుసైగ చేసి వుండవచ్చుననేది లోక విదితం. ఈ సమాధానంతో అగ్రజాతి రామభక్తుడొక డుగ్రుడై [1]అది అంగలూరు కాదు. రాక్షసుల లంక. అదీ త్రిపురనేని వంశంకాదు. త్రిపురాసుర వంశం, అతడు రామస్వామికాదు, రావణస్వామి. అతడు వ్రాసేది సూతపురాణం కాదు, బూతుపురాణం. రావణుడు దేవతల్ని బాధిస్తే, ఈ రావణస్వామి భూదేవతలను బాధిస్తున్నాడు" అంటూ ఈ నాటక ప్రతిని ముక్కలు ముక్కలుగా చింపి పారేసి తన ఆక్రోశాన్ని వెళ్ళగ్రక్కాడు. పరిస్థితులు ఆ విధంగా వున్న రోజుల్లో స్థిత ప్రజ్ఞుడయిన రామస్వామి చౌదరిగారు ఎన్నో ఆటంకాలనూ, ఎన్నో విపత్తులనూ ఎదుర్కొని, అగ్రజాతి నిరంకుశత్వంతో హోరాహోరీగా పోరాడారు.

ఆర్యఋషులు అప్పుడప్పుడూ ఒకచోట సమావేశమై సామాజిక వైయక్తిక ప్రవర్తనకు సంబంధించిన నియమాలను రూపొందిస్తూ ఉండేవారు. వాటినే స్మృతులు అంటారు. స్వార్థబుద్ధితో సృష్టించిన ఆ స్మృతిసాహిత్యం వల్ల వివిధ వర్ణాల మధ్య ఐక్యత నశించి, జాతి నిర్వీర్యమయిందని గుర్తించిన రామస్వామి చౌదరిగారు స్మృతిధిక్కారానికి పూనుకొన్నారు.

వారి నూతనోద్యమ రూపురేఖలను వివరిస్తూ శంబుక మహర్షి లేఖలో యిలా వ్రాయిస్తాడు.

మ. 'అతిలోభంబునుబూని యాత్మహిత కార్యస్థాపనాచార్యులై
స్మృతి నిర్మాణ విదగ్ధులై తనరువారిన్ సభ్యులం జేసి త
ద్గత పక్షుండవు ధర్మ పీఠమునయం; దేకూరు చున్నంత మా
గతియే మౌనా యెఱుంగఁజాలమొకో యింకన్ రామచంద్రప్రభూ!

1. ఆంధ్రప్రభ వారపత్రిక 15-2-1960.

మ. మత నిర్మాణముకై వచించి ఋషులామ్నాయంబులన్ బిమ్మటన్
స్మృతులంజెప్పిరి యార్యసంఘ మొగి వర్ధిల్లంగ మే మందుచేఁ
జతురామ్నాయములందలంచుచు నమస్కారంబులం జేయుచున్
స్మృతిధిక్కారముఁ జల్పుచూనితివి మా క్షేమాభిలాషంబుచే.'

"మా రాష్ట్రవాసుల కెల్ల సమానములగు హక్కులిచ్చి పక్షపాత రహితముగ రాజ్యమేలుట మాకు విధ్యుక్తధర్మం" అని శ్రీరామునిచే అనిపించి లోకానికి తమ ఆదర్శం వెల్లడించారు.

వంగదేశంలో రాజారామమోహనరాయ్ వలే ఆంధ్రదేశంలో సంఘ సంస్కర్త అయిన చౌదరిగారు మతమౌఢ్యాన్ని విమర్శించారన్న కారణంతో కవిరాజుగారి ఉద్యమాన్ని అణచివేయాలన్న ప్రయత్నాలు ముమ్మరంగా కొనసాగాయి. ఇలాంటి ప్రయత్నాలు చరిత్రకు క్రొత్తకావు. బ్రాహ్మణుల యెడ పరుషంగా పలికినందులకే మన దేశంలో బౌద్ధ, జైన మతాల సాహిత్యం నశింపజేశారు. యజ్ఞ యాగాదులు పిక్కిలి హేయము లన్నందుకు చార్వాకుడు, వైశంపాయనునిచే రాక్షసుడుగా చిత్రించ బడ్డాడు. అదే విధంగా, "బ్రాహ్మణ ద్వేషి", "నాస్తికవాది" ఇత్యాది పేర్లు పెట్టి చౌదరిగారిని అణగ ద్రొక్కాలని ప్రయత్నించారు. కాని ఏ ప్రయత్నమూ ఫలించలేదు. విద్యా గంధం లేక పోవటంచేత రామస్వామి చౌదరిగారితో మాట్లాడితే తమకు కూడా బ్రాహ్మణ ద్వేషులనే ముద్ర పడుతుందని బ్రాహ్మణేతరులు జంకసాగారు. ఇలాంటి తమ పరిస్థితిని ఈ నాటకంలో బహు చక్కగా చిత్రించారు చౌదరిగారు. "ద్విజులు మిమ్ము పాషండు డనియు, మత ద్రోహివనియుఁ దెగడుచురు. ద్విజేతరులలో విద్యాగంధము లేమిచే బ్రాహ్మణ ద్వేషివనియు గొణుగుచురు కట్టకడకు మీరిరుతెగలకుఁగాని వారగుటయే ఫలితము" అని శంబుక సంయమీంద్రునిగూర్చి అంగదుడు చెప్పిన పరిస్థితి కేవలం ఆనాటి రామస్వామిగారి పరిస్థితే.

# ఖనీ

అంగరాజు కుమారుడయిన వేనుడు దుష్టుడయినట్లుగానూ, ప్రత్యక్షంగా కనుపించనిదాన్ని నమ్మనట్లుగాను, రాజు దైవాంశసంభూతుడన్న సిద్ధాంత రీత్యా అహంకారంతో ప్రవర్తించాడనీ, చిట్టచివరకు మహర్షుల కోపాగ్నికి ఆహుతి అయినాడని భాగవతంలోని చతుర్థ స్కంధం వల్ల తెలుస్తున్నది. భాగవతంలోని వేనుడు పాషండుడు; నాస్తికుడు. ఈ వేనుని గాథను ఇతివృత్తంగా తీసుకొని విశ్వనాథ సత్యనారాయణగారు అనేక అభూత కల్పనలతో 'వేనరాజు' అనే పదిఅంకాల నాటకాన్ని సృష్టించారు. భాగవతంలోని వేనునికి, ఈ నాటకంలోని వేనునికీ పోలికలే కనిపించవు. వందుల కథ కేవలం విశ్వనాథవారిచేత కల్పించబడింది. ఈ నాటకంలో విశ్వనాథవారు మరచిపోయిన తాతలనాటి కథలను త్రవ్వి పెళ్ళగించి ఆర్యఋషుల మహాత్మ్యాన్ని, వారి వృత్తశీలాలనూ క్రొత్త మాటలచే లోకానికి బోధింప బూనుకొన్నారు. అందులో వారు భగవంతుని ఉనికిని ఈ విధంగా నిరూపించడానికి ప్రయత్నించారు.

గౌతముడు : భగవంతుడు లేడా?

వేనుడు : ఉన్నాడా?

గౌతముడు : ఉన్నాడు.

వేనుడు : ఎట్లు?

గౌతముడు : ఈ ప్రపంచము కార్యము. దీని కర్తడు కారణము.

వేనుడు : ఈ ప్రపంచమే నిత్యము. ఇదియే అన్నింటికి కారణం.

గౌతముడు : అస్థిరముగాన నిత్యము కాదు. అందుకని కారణం కాదు.

వేనుడు : అట్లయిన నీవు చెప్పు భగవంతునకు వేరే కారణముండ వచ్చును.

గౌతముడు : లేదు. అట్లు కారణమునకు గారణమనగా నంతు లేకుండా పోవును: దాని ననవస్థాన దోషమందురు తార్కికులు.

ఈ విధమైన తర్క కుతర్కాలతో వైదిక మతాన్నీ, అస్తిక ధర్మాన్నీ ప్రచారం చేయబూనిన విశ్వనాథవారు కృతకత్యులు కాలేక పోయారు. వేనరాజును పరిశీలించి చూస్తే తానొక ఆర్యఋషి సంతతి వాడననే నమ్మకంతో, కృతికర్త వేనవధను సమర్థించటానికి పడరాని పాట్లు పడినట్లుగా బోధపడుతుంది.

విశ్వనాథవారి రూపకాలను పరిశీలించిన పోణంగి శ్రీరామ అప్పారావు గారు వేనరాజుపై ఈ క్రింది అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. [1]"1934 సంవత్సరంలో వేనరాజు ఆంధ్రనాటకకళా పరిషత్తు సభలలో ప్రప్రథమంగా ప్రదర్శింపబడింది. ఆనాడు స్థానంవారు పృథువు, గోవింద రాజుల సుబ్బారావుగారు అంగరాజు, మాధవపెద్ది వెంకట్రామయ్యగారు గౌతముడు, శేషాచార్యులుగారు వేనరాజు, విశ్వనాథవారే స్వయంగా ఆచార్యత్వమును వహించిరి. కాని ఆనాడది విజయవంతం కాలేదు. ఇది వైదిక నాటకమని పలువురు పెద్దల విశ్వాసం. తత్ఫలితంగా ఆనాడు పెద్ద అల్లరి జరిగినది. నాటకం సగంలోనే ఆగిపోయినది. దానికి కారణం నాటకమునందొక లోపమున్నది. మొదటి భాగమున తర్కవితర్కము లెక్కువ. ఇది రంగ స్థలం మీద రక్తికట్టుట కష్టం. ప్రేక్షకులు కూడా అందులకు సిద్ధపడి వచ్చినప్పుడే అందలి స్వారస్యమును గ్రహింపగలరు. లేనిచో ఇట్టి నాటకములు రంగస్థలం మీద విజయవంతం కాలేవు".

విశ్వనాథ సత్యనారాయణగారి వేనరాజు, 'ఖూనీ' నాటక రచనకు ఎలా కారణభూతమయిందో రామస్వామిచౌదరిగారు తమ పీఠికలో ఇలా ఉల్లేఖించారు. "ఒకనాటి ప్రొద్దున మా స్నేహితుడు శ్రీ నండూరి శేషాచార్యులుగారి యింటికి నుబుసుపోకకు పోయితిని. మేజా బల్లపై విశ్వనాథ సత్యనారాయణగారు రచించిన 'వేనరాజు' వ్రాతప్రతి పడియున్నది. తీసి

1. ప్రవతి – జనవరి, 1959.

చదువుట కారంభించితిని. చదివిన కొలది యాందోళన పడితిని. చదువుట పూర్తికానిచే నాచార్యులుగారి యనుజ్ఞతో నా గ్రంథమును నింటికిం గొంపోయి పూర్తిచేసితిని. కలవరపాటు గలిగినది నిజముగ వేనరాజు మనుజుల పుఱ్ఱెలతో జెరలాడు నంతటి క్రూరుడా? తన్మూలమున వధ్యుడా? యను సందియము కలిగినది. వెంటనే భాగవతంలోని వేనరాజు కథను జదివితిని. నిట్టూర్పు విడిచితిని. నా సందియము పటాపంచలైనది. వేనరాజు నిక్కముగ "ఖూనీ" చేయబడెనని నాకు బోధపడినది. "వేనరాజు" నాటకముచే వేనరాజునకుం దీరని మహాపచారము చేయబడినదని నాకు గట్టి నమ్మకం కలిగినది. ఈ యపచారమును వెంటనే తుడిచివేసి వేనరాజు నిజస్వరూపము లోకమునకు బ్రదర్శించుట ధర్మమని తోచినది. దీనికి ఫలముగా "ఖూనీ" యను నీ చిన్న గ్రంథమును వ్రాసితిని. ఇది నా "ఖూనీ" జన్మకథనము'.

ఇప్పుడు "ఖూనీ" నాటకంలోని వేనుని స్వరూప స్వాభావాదులను గురించి తెలుసుకొందాం. వేనుడు నిస్సందేహంగా మహాపురుషుడు. అతడు సింహాసనం అధిష్టించినప్పటినుండి అతని రాజ్యంలో కరువుకాటకాలు లేవు. 'ధర్మ సంస్థాపనా పటిష్టంబైన యాతని ద్రాఘిష్టఖడ్గ ధారాధాళ ధళ్యము'ను జూచి జారచోరులు పరసీమలకు పలాయన మంత్రం పఠించారు. జానపదులు సైతం గుండెమీద చేయి వేసుకొని నిర్భయంగా కాలం గడపసాగారు. యావన్మంది ప్రజలు సుఖ జీవనం చేయాలనీ, పశు, పక్షి, క్రిమి కీటకాదులు సైతమూ బాధపడరాదు అనే వేనుని ఆశయాలు. స్మృతికర్తలయిన ఋషులు తమ స్వార్థంకోసం స్థాపించిన సనాతన ధర్మాన్ని ఎదురించిన వీరుడు వేనుడు. అతని రాజ్యంలో జంతుబలి, యజ్ఞయాగాదులు పూర్తిగా నిషేధించ బడ్డాయి. అతని పరిపాలనలో వేనమతం ప్రబలి, వేదమతం సర్వనాశన మయింది. దేశంలో పొటమరిస్తున్న స్వతంత్ర భావాలను ఆర్యఋషులు తమ [illegible]త్వాన్ని నిలబెట్టుకోడానికే నశింపజేశారని తలంచిన వేనుని, ఆర్య ఋషులు - లేదా - విశ్వనాథ సత్యనారాయణగారు ఖూనీ చేశారని

కవిరాజుగారు భావించారు. వేనరాజు నాటకంలో వేనరాజుకు తీరని అపచారం చేయబడిందని గ్రహించిన రామస్వామిచౌదరిగారు, వేనుని నిజస్వరూపాన్ని లోకానికి తెలియజేయాలనే కాంక్షతో "ఖూనీ" నాటకాన్ని 1935 సం.లో రచించారు. ఇందులో నాలుగు రంగాలున్నాయి. వేనరాజు నాయకుడు. అతని సైన్యాధిపతి దృష్టవర్మ ఉపనాయకుడు. దృష్టవర్మ మునుల చేతుల్లో కీలుబొమ్మగా మారి, గాఢ నిద్రలోవున్న వేనుని గుండెల్లో బాకుతో పొడిచి, చంపుతాడు. తుట్టతుదకు దృష్టవర్మ తన అపరాధాన్ని తెలుసుకొని పిచ్చివాడయిపోతాడు. తానుగూడా పృథువుచేత కత్తితో పొడవబడి మరణిస్తాడు, అంతటితో ఈ నాటకం అంతమౌతుంది. కాబట్టి ఇది విషాదాంత నాటకం. (tragedy)

రామస్వామిచౌదరిగారు ఆంగ్లంలో కూడా ఉద్దండ పండితులు. షేక్స్పియర్, బెర్నార్డుషా, వ్రాసిన నాటకాలు వారికి కొట్టిన పిండి. వారు పాశ్చాత్య నాటకప్రదర్శనలనేకం చూశారు. అందుచేత కవిరాజుగారిపై పాశ్చాత్య నాటకకర్తల ప్రభావం కొంత ప్రసరించింది. అందుచేతనే నాటకాన్ని విషాదాంతం చేశారు. ఈ నాటకంలోని ప్రతిపాత్రలోనూ, సంభాషణలోనూ రామస్వామి చౌదరిగారి ప్రతిభ గోచరిస్తూ వుంటుంది.

'ఖూనీ' నాటకంలో రామస్వామి చౌదరిగారు నాస్తికత్వానికి దారి చూపుతూ 'పూర్తిగా నాస్తికుడయినట్టు పొడగట్టని వేనుణ్ణి పరమనాస్తికునిగా చిత్రిస్తున్నాను' అన్నారు. సర్వాంతర్యామి అని చెప్పబడే భగవంతుని నిష్ప్రయోజకత్వాన్ని నిరూపించారు.

వేను : ఎవ్వడీ మహానుభావుడు ? ఈయన ప్రకృతియేమి ? ఇంతవఱ కెప్పుడును నా రాజ్యంబున గన్పట్టలేదే ? ఇంతకు జెప్పవైతివి. ఈయన యుద్యోగ మేమి ?

శున : సర్వాంతర్యామి, సర్వప్రపంచ సృష్టిస్థితి లయహేతుభూతుడు. దుష్టుల శిక్షించుట, శిష్టుల రక్షించుట యీయన యుద్యోగము. అహోరాత్రములీ ప్రపంచముల( గనిపెట్టుకొనియుండు.

వేను : పాపమెంత బాధపడుచుండునో నిద్రాహారములుమాని, రేబవలు కనిపెట్టుకొని యుండి. ఈ మహామహుడేనా నాకు నరకలోకము దానము చేయునది ? జీవహింస సల్పుచున్నందులకు మీకు స్వర్గము, దానిని బాపుచున్నందులకు నాకు నరకము ! ఈ దేవుని మీరు క్రొత్తగా సృజించినట్లున్నది. ఈ మీ దేవు(డు తన ధర్మమును గూడ మఱచువాడుగ నున్నాడు ఎంతమంది దుష్టులు శిక్షను దప్పించుకొని పోవుచున్నారీ లోకమున ! ఎంతమంది శిష్టులు శిక్షింపబడు చున్నారు

గౌత : కటకటా ! భగవాను(డుకూడ నీ పరిహాసమునకు( బాత్రుడయ్యె. నీకు బ్రాయశ్చిత్తమే లేనట్లున్నది.

వేను : నాకు బ్రాయశ్చిత్తమే లేనట్లున్నది. నీకు చిత్తమే లేనట్లున్నది.

వేను : అయినచో భగవంతుడు నిష్ప్రయోజకుడా ?

శున : మహాపాతకమును మూట( గట్టుకొనుచున్నావు.

గౌత : నిష్ప్రయోజకుండెట్లగును ? అతడు సర్వకర్మములకు సాక్షి.

వేను : కూటసాక్షియా ? ఎందులకీ సాక్షిత్వము ? తన కట్టెదుట జరుగుచున్న క్రూరకర్మల మాన్పనేరక సాక్షియగుచున్నాడా ? ఏమి చిత్రము ! ఈ సాక్ష్య మెవ్వరియెదుట నుపయోగపడును ? ఎవ్వరికి ప్రయోజనకారి యగును ? విచారణకర్త యెవ్వరు ?

గౌత : నీవు పాషండుడవు. నీకు సుగతులు లేవు.

వేను : లేకపోయిన బోనిమ్ము. ''మాటిమాటికి నీకు సుగతులు లేవు, నరకమునకు బోదువు'' అని బెదిరింతువేల ? నీ బెదిరింపులు దుర్బలహృదయుని కలగింపనోపు. నావంటివానిని గాదు. లోకము గన్గప్పి, మీ దుర్వ్యవసాయమునకు దోడ్పడ భగవంతునొకని సృజించి లేనిపోని సర్వశక్తులు వాని కంటగట్టిజగమును నుద్రూతలూప యత్నించుచుండిరి. మీకా సుగతులు, నాకా లేనిది?

గౌత : మహాపాతక హేతువులగు నీ మాటలు వినజాల.

వేను : చేయగల్గుదువుకాని వినలేవు. నిజముగ నీవు సృజించిన భగవంతుడు కాడా ? నీ యవసరము కొలది నీ భగవంతుని యవతారము లెత్తించలేదా ? వేషభాషాదులు మార్చలేదా ? ఒక ప్పుడు నిరాకారు డంటివి. ఒకప్పుడు సాకారు డంటివి. ఒకప్పుడు భీకరకారు డంటివి. ఒకప్పుడు వికారు డంటివి. ఒకప్పుడు నరమాంసము వేఱొకయప్పుడు గోమాంసము, ఇంకొకప్పుడు మృగమాంసము; మఱియొకప్పుడు ఫలపత్ర పుష్పాదులు భోజ్య మంటివి. నీ బుద్ధిభ్రమణముతో బాటు భగవంతుని యాకార భాషాభూషా విశేషాదులు మాఱలేదా ? మాఱుచుండుట లేదా ? ఏల సత్యమును మఱుగుపుచ్చెదవు ?

గౌత : వేనరాజా ! నీవు నాస్తికుడవు. నీతో బ్రసంగమే పాపహేతు వగును.

ఈ సంభాషణలతో అధ్యాత్మిక సౌధం పేకమేడలా కూలిపోయి, వేనరాజుచేత పలికించిన రామస్వామి చౌదరిగారి 'హేతువాదం' శుక్లపక్షంలోని చంద్రునివలే దినదినాభివృద్ధి నొందసాగింది. పాషండులయినంత మాత్రాన మానవులు దుర్మార్గులు కారనీ, వేనరాజు పాషండుడయినప్పటికీ విశ్వనాథ

సత్యనారాయణ గారు చిత్రించినట్లుగా దుర్మార్గుడు మాత్రం కాడనీ "ఖూనీ" నాటకంలో రుజువు చేయబడింది.

ఈ నాటక ఇతివృత్తంలో పటుత్వమూ, ప్రాసంగిక కథా సంయోజన నిపుణత్వమూ, పాత్రపోషణలోని చాతుర్యమూ, సంభాషణలలోని చమత్కారమూ. ఉపపత్తి, ప్రదర్శన ఉపక్రమోప సంహార రమణీయత-కవిరాజు గారికి నాటక రచనలోగల ప్రతిభా పాటవాలను వెల్లడిస్తున్నాయి.

ఈ మూడు నాటకాలు ఆంధ్ర నాటక సాహిత్యంలో అమూల్యమయిన కళాఖండాలు.

కవిరాజు గారి నాటకా లొక యెత్తు. వాటి పీఠికలొక యెత్తు. విషయాన్ని సత్యపథంలో వివరించే ఆ పీఠికలు ఆలోచన రేకెత్తిస్తాయి. తమ వాదం యదార్థమే ననడానికి రామస్వామి చౌదరి గారిచ్చిన ఉదాహరణలు, ఉపపత్తులు, వారి పరిశీలనా పాటవాన్ని, సత్యాన్వేషణాసక్తినీ నిరూపిస్తున్నాయి.

ఈ నాటకాల విశిష్టతను గురించి సమకాలీనులు ఏమనుకుంటున్నారో చూద్దాం.

'ఖూనీ' నాటకాన్ని గురించి జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి - గారు "విశ్వనాథ సత్యనారాయణ గారు వేనరాజు వ్రాశారు, కవిరాజుగారు 'ఖూనీ' వ్రాశారు. ఆయన వ్రాశారు గనుక అది చాల ఉదాత్తంగా వొచ్చింది. అలా జరక్క 'వేనరాజు' లోని విషయాలకు ఎదురు తిరిగిన, ఏ నాబోటి ఇంకొకరో తలపెట్టి ఉన్నట్లయితే, వేనరాజుపై ప్రతిఘటన-పేలవంగా అవ్యాప్తి అతివ్యాప్తులతో నిండి ఉండేది" అన్నారు.

రామస్వామి గారిని "ఆంధ్రా బెర్నార్డుషా" అని అభినందించారు కట్టమంచి రామలింగారెడ్డి గారు. [1]"హిందూ పౌరాణిక నాయకుల ప్రవర్తనతో ముడిపడిన ధార్మిక విలువలను కదిలించిన గౌరవము కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి గారికి దక్కినది" అన్నారు ఆంధ్ర విశ్వవిద్యాలయ రిజిష్ట్రార్ శ్రీ కూర్మా వేణుగోపాలస్వామి గారు.

ప్రసిద్ధ కథకులు, నాటక కర్తలు, హాస్య రచయితలైన భమిడిపాటి కామేశ్వరరావు గారు కవిరాజు గారి నాటకాల ప్రాశస్త్యాన్ని గురించి అనేక సభలలో ఎలుగెత్తి చాటారు. "నేను సాంఘిక దురాచారాలను రూపుమాపటానికి పూనుకొన్నాను. కవిరాజు గారు పురాణ రోగాలనూ పూర్తిగా నివారించడానికి కంకణం కట్టుకొన్నారు. వారి కృషి ఫలించటం పైనే, నా శ్రమ ఆధారపడి ఉంటుంది. ముందా దీర్ఘరోగాలు పోతేగాని చిన్న చిన్న జబ్బులకు నా చిట్కాలు వాడుకలోకి రావు" అని తరచుగా సన్నిహితులతో అంటూ ఉండేవారు.

బాల వాఙ్మయబ్రహ్మగా ప్రసిద్ధికెక్కిన చింతా దీక్షితులు గారు కవిరాజు గారి సాహిత్యాన్ని ముఖ్యంగా నాటకాలను ఎంతో మెచ్చుకొనేవారు. "ఇంత మందిమి మేము ఉండి చెయ్యడానికే సాహసించలేని కార్యాన్ని మన చౌదరి చేశాడు. వారు మరికొంతకాలం మన మధ్య లేకపోవడం మన దురదృష్టం. అంతేకాదు వారు మరికొంతకాలం జీవించి ఉన్నట్లయితే ఆంధ్ర నాటకరంగం మూడు పువ్వులు, ఆరు కాయలుగా అభివృద్ధిజెంది ఉండేది" అన్నారొక సందర్భంలో.

"రాజరాజు" వంటి నాటకాలు వ్రాసి, ఎన్నో కథానికలు వ్రాసి ఆంధ్రుల అభిమానాన్ని చూఱగొన్న శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి గారు

1. ప్రసిద్ధ నాటికల తొలిపలుకు

''కవిరాజు వ్యక్తికాదు; ఒక ఉద్యమం. తుఫాను వంటివాడు. చెత్త, చెదారం, దుమ్ము, ధూళి, మురుగు సమూలంగా తుడిచి పెట్టుటకు పోవడానికి అప్పుడప్పుడు ఇటువంటి, తుఫానులు చాలా అవసరం. సరైన తరుణంలో కవిరాజు ఆవిర్భవించాడు. లేకపోతే తెలుగు సమాజం, అధమం. అర్థ శతాబ్దం వెనుకబడి ఉండేది'' అన్నారు.

కీ. శే. బళ్ళారి రాఘవాచారి గారు ''నటుడుగా నాకున్న పరిజ్ఞానంతో చూస్తే, కవిరాజు గారి నాటకాలు మహోత్తమమయినవి. చెప్పదలచుకొన్న విషయాన్ని ఉపన్యాస ధోరణిలో కాకుండా సంఘటన రూపంలోకి మార్చి చెప్పడంలో వారికి వారే సాటి. శక్తివంతమైన సంభాషణలు వ్రాయగల నాటకకర్తలు తెలుగువారిలో కొద్దిమంది మాత్రమే గలరు ఆ కొద్దిమందిలో కవిరాజు గారు ప్రథమశ్రేణిలో కొస్తారు'' అన్నారు.

ఆస్థానకవి శ్రీపాద కృష్ణమూర్తి గారు యిలా అన్నారు. ''నేను నాటకాలు వ్రాశాను. వాటిని కొన్ని నాటక సమాజాలవారు ఆడుతున్నారు కూడాను. నేను ఆశించిన ప్రయోజనం వేరు. కవిరాజు నాటకాలు చదివిన తరువాత, నాటకం ఎంతశక్తిమంతమైన ఆయుధమో గ్రహించాను. ఇప్పుడు మరల నేను నాటక రచన కుపక్రమిస్తే ఈ నాటకాలను దృష్టిలో వుంచుకొని రచన చేస్తాను''.

''కవిరాజు గారు బహుముఖ ప్రజ్ఞాశాలి. కవిగా, విమర్శకుడుగా, ఉపన్యాసకుడుగా, సంస్కర్తగా మాత్రమేగాక, నాటకకర్తగా వీరు సాధించిన ఫలితాలు ఆమోఘమైనవి. అనూచానంగా వస్తున్న ఒకానొక సాహిత్య ప్రక్రియను, సంఘ సంస్కరణకుగాను, ఇంత ఫలప్రదంగా ఉపయోగించు కొన్న వారు అరుదు'' అన్నారు ఆచార్య కురుగంటి సీతారామయ్య గారు.

"మన ప్రాచీన గాథలను కేవలం మూఢవిశ్వాసాలతో నమ్మేలోకానికి సవిమర్శకంగా, తాత్త్వికదృష్టితో, భూతకాలాన్ని ఎలా అర్థం జేసుకోవాలో మొట్టమొదటిగా తెలుగుదేశానికి తమ నాటకాలద్వారా నేర్పినవారు కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి గారు. గత కాలానికి వర్తమానానికి మధ్య ఒక పెద్ద అఖాతమున్నదని నా నమ్మకం. ఈ అఖాతం మీద వంతెన గట్టి చక్కగా శాస్త్రీయ దృక్పథంతో, గతాన్ని తెలుసుకోవడానికి 'కురుక్షేత్ర సంగ్రామము'. 'శంబుకవధ'. 'ఖూనీ' నాటకాలు తోడ్పడతాయి. ఈ అఖాతం కొందరికి కనుపించకపోవచ్చు. కాని అది వున్నమాట వాస్తవం. 800 సంవత్సరములు మహమ్మదీయుల, ఆంగ్లేయుల పరిపాలన క్రింద విచ్ఛిన్నమైపోయిన భారతీయ సంస్కృతి వికాసం పొందాలంటే శాస్త్రీయ దృక్పథంతో పురాణాలనూ, ఉపనిషత్తులనూ పరిశీలించాలి. ఆ పరిశీలించడం ఏలాగో వివరించినవారు కవిరాజు" అన్నారు డా. దాశరథి.

ఆంధ్ర నాటకరంగానికి చేసిన అమూల్యమైన సేవవల్ల రామస్వామి చౌదరిగారు ఆంధ్ర నాటక కర్తలలో అగ్ర శ్రేణికి జెందిన వారుగా పరిగణింప బడుతున్నారు.



# సూతాశ్రమ గీతాలు

కొందరు సంస్కర్తలు మార్పును ఏవో కొన్ని శాఖలకే పరిమితం చేస్తూ వుండటం కద్దు. రామస్వామి చౌదరి గారు దానికి పూర్తిగా విరుద్ధం. గణబద్ధమయిన పద్య రచనతోపాటు మాత్రాబద్ధమయిన గేయ రచనను కూడా వారు చేశారు. ఆ పద్యాలకు, గేయాలకు, ఒక ప్రధానమయిన భేదంవుంది. పద్యం పండితులకే పరిమితం కాగా, గేయం పామరజనానికి కూడా అందు బాటులో వుంటుంది. సామాన్య ప్రజానీకంలో ఏదైనా ఒక నూతన భావాన్ని బహుళ ప్రచారం జేయడానికి గేయం చక్కని సాధనం; ముఖ్యంగా స్త్రీలనూ, బాలబాలికలనూ, గ్రామీణులనూ - సంఘంలోని సామాన్య ప్రజా నీకాన్ని, గేయాలు ఆకర్షించినంతగా, పద్యాలు ఆకర్షించవు. ఈ విషయాన్ని గుర్తించిన రామస్వామిచౌదరిగారు ''సూతాశ్రమ గీతాలు'' రచించారు. సాహిత్య క్షేత్రంలో వారు చేసిన ఈ కృషి దేశాభివృద్ధికి, జాతీయోద్య మానికి ఎంతగానో ఉపకరించింది.

రాజకీయంగా రామస్వామి చౌదరిగారు జస్టిసు పార్టీకి చెందిన వారని ప్రతీతి. కాని స్థూలంగాజూస్తే వారు జాతీయ మహానాయకుల కోవకుజెందిన వారుగా కనిపిస్తుంది. సంఘంలో ఉన్న హెచ్చుతగ్గులను నిర్మూలించడమనే దృష్టితో విదేశీ ప్రభుత్వాన్ని ఆమోదించే వరకూ వెళ్ళడం వారి కిష్టంలేదు. సంఘంలో వున్న హెచ్చుతగ్గులను నిర్మూలించ వలసిందే. అదేవిధంగా పర పీడన కూడా అంతం కాలసిందే. దోపిడీ, పరపీడన ఎక్కడున్నా వాటి నెదుర్కోవలసిందే. ఈ ఉద్దేశ్యంతో వారు ''జాతీయ బ్రాహ్మణేతర ఉద్యమం'' అనే నూతన ఉద్యమాన్ని జస్టిసు పార్టీకి పోటీగా ప్రారంభించారు, ఈ ఉద్యమం తరపున బెజవాడలో జరిగిన మహాసభలకు వారే అధ్యక్షత వహించారు. కులతత్వాన్ని, కులాల పేరు మీదుగా జరిగే అత్యాచారాలనూ

ఎమర్జ్ అయ్యే వరకూ దీని స్వభావం జస్టిసు పార్టీ స్వభావమే. కాని అది దేశభక్తిని ఏ మాత్రం అడ్డుకోరాదు. మాతృదేశ సేవకు అవకాశం దొరకడం కోసమే కులతత్వ నిర్మూలనగాని, దేశాన్ని విదేశీయ పరిపాలన క్రింద వుంచడానికి కాదు అనే ఆదర్శం కలిగి వుండటమే దీని ప్రత్యేకత.

[1]"రామస్వామి గారు డబ్లిన్ నుండి 10-2-1917న కృష్ణా పత్రిక సంపాదకులకు ఒక లేఖ వ్రాశారు. అందులోని కొంతభాగాన్ని యధాతథంగా ఇచ్చట పొందుపరుస్తున్నాను. "డబ్లిను పట్టణములో నాల్గురోజులనాడు పెద్దపెద్ద యక్షరములతో "హిందూ దేశము స్వరాజ్యమునుఁ గాంక్షించుట లేదు" అని కొన్ని పత్రికలు బయలు వెడలినవి. ఇది యేమిచిత్రమోయని పత్రికనుఁగొని చదివితిని. అందు బ్రాహ్మణేతరులు చెన్నపట్టణమున సభఁజేసి బ్రాహ్మణులు తొల్లి యితర కులములకుఁ జెప్పరాని యపకారములను, ద్రోహములనుఁ జేసిరనియు, నిప్పుడు స్వరాజ్యము వచ్చినయెడల నున్నతోద్యోగియులు వారే యగుటం జేసి వెండియు నా విధముగనె బాధలు పెట్టుదురు గాన మాకు స్వరాజ్య మక్కరలేదని తీర్మానించిరనియుఁ జదివితిని నేనును బ్రాహ్మణేతరుఁడ నగుటంజేసి యీ విషయమున నా యభిప్రాయమును విస్పష్టముగా వెలిబుచ్చ వలసిన యగత్యము కల్గినది. ఈ తీర్మానము నిజమే యగునెడల సప్త సముద్రముల నీటితోఁ గడిగిననుఁ బోని కళంకమును బ్రాహ్మణేతరులకు నీ సభవా రంటించిరని నా యభిప్రాయము. ఇందు సంశయ మేమియును లేదు. కాన నే నీ తీర్మానముతో నేకీభవించనని గట్టిగా చెప్పుచున్నాను. బ్రాహ్మణేతరులయందు నీ యభిప్రాయము కలవాఁడను నేనొక్కఁడనే యైనయెడల నేనీ పాపకార్యమునకుఁ దోడ్పడలేదని యాత్మశాంతినిఁ జేసి కొనియెద. పెద్ద సంశయ మొండు బాధించు చున్నది. ఈ చెన్నపట్టణమునఁ బోవైన యీ బ్రాహ్మణేతరులకు యావద్భారతదేశమున నున్న బ్రాహ్మణేత

1. కవిరాజు లేఖలు-డైరీలు 1972. త్రిపురనేని సుబ్బారావు.

రుల పక్షమున నీగతిఁ దీర్మానించుటకు నెవ్వ రధికారమిచ్చిరి? కటా! స్వలాభపరు లెవ్వరో యీ నీచ కార్యమునకు దిగియుందురు. కాన నీ తీర్మానమును బ్రాహ్మణేతరులందరు నంగీకరించుట లేదనియు, బ్రిటిషువారి యధికారము క్రింద స్వరాజ్యమును (హోమ్ రూల్) బొందుట మాకుఁ బరమ సమ్మతమనియుఁ దెలియఁజేయు చున్నాను.

ఇక నీ బ్రాహ్మణేతరులు స్వరాజ్య మక్కరలే దనుటకుఁ గల కారణములు విమర్శించి యెంతవరకు సమంజసముగా నున్నవో విచారింప వలయును. బ్రాహ్మణులు తొల్లి బ్రాహ్మణేతరులను బాధించిరనియు, నేడును నట్టులే చేయఁగల రనియు వీరి వాదము తొల్లి బ్రాహ్మణులు తదితరులను బాధించి రన్నమాట నిజమనియే నేనును నమ్ముచుంటిని. ఇదికాదని సత్యాన్వేషణపరుఁడైన యే బ్రాహ్మణుఁడు ననఁజాలఁడు. మనుస్మృతి మొదలు నిన్న, నేడు వెలువడుచున్న నవలలుకూడ నీద్వేషభావమునే యుమియు చున్నవి. కాని దీని సూతకోలఁ జేసికొని స్వరాజ్యము వలదను మహనీయుఁ డెంత వివేకియో యోజింపుఁడు. ఒక్క యవిభక్తకుటుంబ మున్నదను కొనుఁడు. ఆ కుటుంబముయొక్క యజమాని తమ్ములను ద్రోహముచేసి ధనాపహరణముఁ జేసె ననుకొనుఁడు. అంత కాలదోషము పట్టిన యొక పత్రము యొక్క బాకీనిఁ గారణాంతరములచే నధమర్ణుఁడు తెచ్చి యీయవచ్చె ననుకొనుడు, అప్పుడు తమ్ములు చేయఁదగిన కార్యమేది? నేర్పరు లయిన నన్నకుఁ దక్కకుండ డబ్బును రాబట్టుకొనవలయును గాని మాయన్న యిదివరకే ధన మపహరించి వాఁడియ్యదికూడ నిచ్చిన యెడల మరల నపహరించునుఁ గాన నీయవలదని చెప్పుట యేమి యుచితము? ఏమి సమంజసము? మన ప్రాత, క్రొత్త పగలను దీర్చుకొనుటకుఁ బూనుకొన్నను, దీర్చికొను విధ మిదిగాదు. దీనివలన బ్రాహ్మణులు నష్టపడుటయే గాక మనము కూడ నష్టపడుచున్నాము. ఇదియా తెలివి? మనము నష్టపడకుండ బ్రాహ్మణులు నష్టపడు నుపాయము వెదకికొనుఁడు. మీరు తాకిన

వారొక్కసారి స్నానముఁజేసిన, వారు తాకిన మీరు ఓపిక యున్నయెడల పదిమారులు స్నానముఁ జేయుఁడు. మీరు ముట్టిన నీళ్ళు వారు త్రాగకున్న, వారు ముట్టిన నీళ్ళు మీరు త్రాగకుఁడు. వారి దేవాలయములలోనికి మిమ్ము పోనీయకున్న, మీదేవాలయములలోనికి వారిని రానీయకుఁడు. ఇవన్నియు గృహకల్లోలములను మనము సమర్థించు కొనలేమా? అంత అసమర్థులమును, బిఱికి పందలమునా! కాదని తలంతును మన ఇంటి గుట్టు విదేశీయులకుఁ దెలిపి వారికి లాభముఁ గల్పింపకుఁడు. బ్రాహ్మణులు మన కపకారముఁ జేసిరని హిందువుల కుత్తుకలెల్లఁ గత్తిరించుటకుఁ గత్తిని నితరులచేత నేల పెట్టెదరు? ఈ బ్రాహ్మణేతర సభయందు నీ తీర్మానమును నుపపాదించిన మహాత్ములకన్న నాకుఁ దక్కువ ద్వేషములేదు. కాని యీ నీచకార్యమునకు నొడిగట్టను. బ్రాహ్మణులు నాకడనుండి యపహరించిన హక్కులను వారి కడనుండి బలిమియై గుంజుకొనియెదఁ గాని యీ కార్యమునుఁ జేయను. తొల్లి మాట యటు లుంచుఁడు! నేడుకూడ నట్టులే చేయుదు రట! మేలు! ఈ సభవారి మేధాసంపత్తి వెల్లి విరియుచున్నది. జనసంఖ్య యందును, శరీరపాటవ మందును, ద్రవ్యము నందును మనకయిన లొచ్చయిన బ్రాహ్మణులు చేయఁబోవు దౌర్జన్యమునకు మనసు భయపడుచుంటి మని దొరతనమునకు తెలియఁజేయుట మనకు గౌరవము కాదు. ఒకవేళ నిట్టిది తటస్థింపఁగలదే యనుకొందుము. అటులయినచో నున్నతోద్యోగములయం దిన్నవ వంతుద్యోగములు బ్రాహ్మణేతరుల కుండవలయు నని మనమేల నిర్బంధింపఁగూడదు? దీనికి బ్రాహ్మణు లొప్పుకొని తీరెదరు.

మీ యందలి తీర్మానము నంగీకరింపక పోవుటయే గాక బ్రిటిషు ప్రభుత్వము క్రింద స్వరాజ్య మందుట పరమ సమ్మత మని పత్రికాముఖంబు నను, సభలమూలమునను ప్రభుత్వమునకుఁ దెలియఁ జేయుఁడు. బ్రిటిషువారి దయా దాక్షిణ్యములపై నాధారపడి స్వాతంత్ర్యమునుఁ గోరుచుంటిమా? బ్రిటిషువారల వెంటఁ బయనమలయుము. మరణముఁ దప్పిన లాభములేదు."

రామస్వామి చౌదరి గారు దరిద్ర దేవతను ఆశ్రయించిన జాతీయ గేయకవి. జాతీయాభిమానం వీడి, జస్టిస్ పార్టీ నాయకులను ఆశ్రయించి వుండే గొప్పపదవిని అలంకరించి వుండేవారు. ఆనాటి ఆంగ్లప్రభుత్వం వారికి గొప్ప పదవులను ఎరగా జూపించినా చౌదరి గారు వాటికి లొంగి పోలేదు. అందులకు కారణం వారికి పదవీ వ్యామోహం లేక పోవడమే. వారు భారతజాతికి అండగా నిల్చి జాతీయోద్యమంలో పాల్గొని, భారతమాత దాస్యశృంఖలాలను విచ్ఛేదం చేయాలని సంకల్పించారు. నీరసమూ. నిస్తేజమూ అయిన జాతిలో వీరరసంతో ఉత్సాహన్నీ, ఉత్తేజాన్నీ, కలిగించడానికి "వీర గంధము" అను జాతీయ గీతం వ్రాశారు. చూడండి.

"వీర గంధముఁ దెచ్చినారము
వీరుఁ డెవ్వఁడొ తెల్పుఁడీ !
పూసి పోదుము మెడను వైతుము
పూలదండలు భక్తితో !!

తెలుఁగు బావుట కన్ను చెదరఁగ
కొండ వీఁటను నెరిగినప్పుడు
తెలుఁగువారల కత్తి దెబ్బలు
గండికోటను కాచినప్పుడు

తెలుఁగువారల వేఁడి నెత్తురు
తుంగభద్రను గలిసి నప్పుడు
దూరమందున నున్న సహ్యజ
కత్తి నెత్తురు కడిగి నప్పుడు.

ఇట్టి సందియ మెన్నఁ డేనియుఁ
బుట్టలేదు రవంతయున్
ఇట్టి ప్రశ్నల నడుగు వారలు
లేకపోయిరి సుంతయున్,

నడుము గట్టిన తెలుఁగు బాలుఁడు
వెనుక తిరుగండెన్నఁడున్.
బాస యిచ్చిన తెలుఁగు బాలుఁడు
పారి పోవండెన్నఁడున్.

ఇదిగొ ! యున్నది వీర గంధము
మై నలందుము మై నలందుము
శాంతి పర్వము జదువ వచ్చును
శాంతి సమరంబైన పిమ్మట

తెలుఁగు నాటిని వీరమాతను
జేసి మాత్రము తిరిగి రమ్మిఁక
పలు తుపాకులు పలు ఫిరంగులు
దారి కడ్డము రాక తప్పవు

వీర గంధముఁ దెచ్చినారము
వీరుఁడెవ్వఁడోఁ దెల్పుఁడీ !
పూసిపోదుము మెడను వైతుము
పూలదండలు భక్తితో ॥

"ఉప్పు సత్యాగ్రహపు జైలు జీవితం నేనూ, ఆచార్యరంగా ఈ గేయాన్ని సంస్మరిస్తూ ఉత్తేజితులమయ్యేవారము" అన్నారు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గారు.

ఈ గీతం స్వాతంత్ర్య పోరాటపు రోజుల్లో ఆంధ్రదేశంలోని ముఖ్య పట్టణాలలోనేగాక, మారు మూలల గ్రామాలలో సైతమూ ప్రతి ధ్వనించింది. 1930వ సంవత్సరంలో గాంధీజీ ఆధ్వర్యాన ఉప్పు సత్యాగ్రహం ప్రారంభించబడింది. గాంధీజీ పూరించిన శంఖారావాన్ని ఆకర్ణించిన కవిరాజుగారు స్వాతంత్ర్య సమర రంగంలో దూకారు. 'సత్యాగ్రహోద్యమ నిధి' కి వేలకు వేలు చందా వసూలు చేశారు. కవిరాజు గారి ప్రబోధంతో తెనాలి పట్టణ పరిసర ప్రాంతాలనుండి సత్యాగ్రహులు జట్లుజట్లుగా ముందుకు రాసాగారు. [1]శరణు రామస్వామి చౌదరిగారి నాయకత్వంలో తెనాలి వస్తున్న సత్యాగ్రహ దళానికి సంతర్పణ చేయించారు చౌదరిగారు. వీర గంధంతో అక్షతలు చల్లి అంపకం పెట్టారు. ఈ సందర్భంలో ఉన్నవ లక్ష్మీబాయమ్మ గారు స్వయంగా ఆగేయాన్ని గానం చేశారు వీరరస ప్రధానమైన ఈ గీతం ఆంధ్ర జాతిని ఉద్రూత లూగించింది. సత్యాగ్రహులు జట్లు జట్లుగా ఉప్పెనగా ఉద్యమంలో దూకడం సాగించారు. ఇంతేగాదు, పికెటింగు సందర్భంలో సత్యాగ్రహులు పాడుకోడానికి 'పిలుపు' అనే మరో గేయం కూడా వ్రాసియిచ్చారు చౌదరిగారు. ఆ సందర్భంలోనే వారుగూడా అరెస్ట్ అయ్యారు. ఆయనకు తెలియకుండానే విడుదల జరిగింది. అందుచేతనే స్వాతంత్ర్య పోరాటంలో రామస్వామి గారికి ప్రముఖస్థానంవుంది.

ఆత్మాభిమానం. ఆత్మవిశ్వాసంలేని వారు ఏ పని చివరిదాకా చేయలేరు. ప్రాంతీయాభిమానం లేనివారికి, దేశాభిమానం ఉంటుందనుకోవడం కేవలం భ్రమ మాత్రమే అవుతుంది. అయితే ఈ ప్రాంతీయాభి

1. కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర

మానం, దేశాభిమానానికి ప్రోద్బల కారణ మవ్వాలేగాని, రాష్ట్రీయ దురభిమానంగా పరిణమించరాదు. అలాంటి సంకుచిత స్వభావం కలవారు కాదు కవిరాజు గారు. వారు ఎంతటి దేశభక్తులో, అంతటి స్వరాష్ట్రాభిమానులు. వారికి తెలుగు ప్రజలన్నా, తెలుగు భాషన్నా, తెలుగు దేశమన్నా అభిమానం మెండు. అందుచేతనే వారు నిద్రాణమైన తెలుగు ప్రజానీకానికి వైతాళిక గీతికలు ఆలాపించారు.

"గౌతమీ నది, కృష్ణ వేణియు,
తుంగభద్రయు, సర్వదా
జీవనదులై యొండిపోవక
యెల్ల కాలము పాఱుచున్.

బీళ్ళ నన్నిటిఁ బంట పొలములు,
పండ్లతోటలు చేయుచున్,
దెల్గుదేశం బతి సుభిక్షము
గా నొనర్చును సర్వదా

తెలుఁగు బిడ్డా! మఱచి పోకుర
తెలుఁగుదేశము పురిటిగడ్డర
కొక్కొరోకో పాట బాడర
తెలుఁగు వారల మేలు కొల్పర."

మహోజ్వలమైన పూర్వాంధ్ర దేశపు టౌన్నత్యాన్ని స్మరించి, మధురానుభూతిని పొంది, పులకితులైన రామస్వామి చౌదరి గారు తెలుగు ప్రజలకు ప్రత్యేక రాష్ట్రం కావాలని ఆంధ్ర రాష్ట్రోద్యమారంభం నుండీ అవిరళ కృషి చేశారు. విశాలాంధ్ర నిర్మాణమే కవిరాజు గారి ప్రగాఢ వాంఛగా గోచరిస్తుంది.

'రెండు కోట్లకు మించియుండిన
తెల్గువారల నక్కటా !
చీల్చి వైచిరి, నాల్గు దెసలకుఁ,
జిమ్మివైచిరి నేఁటికిన్,

కొంతమంది నిజాము రాష్ట్రము
నందుఁజిక్కిరి బేలలై,
కొంతమందియు కన్నడంబున
నుండిపోయిరి దీనులై,

లెమ్ము లెమ్ముఁక నడుము గట్టుము
తెల్గువారల నెల్ల నీ
వొక్క రాష్ట్రమునందుఁ గూర్పఁగ
గట్టి యత్నముఁ జేయుమా !"

ప్రత్యేక రాష్ట్ర సాధనలో ఒకరిని యాచించడం ఎంత మాత్రమూ ఆయన అంగీకరించే వారుకాదు. మన నాయకులు ప్రత్యేక రాష్ట్రం సాధిస్తారని చాలాకాలం రామస్వామి చౌదరి గారు ఎదురు చూశారు. కాని ఫలితం హుళ్ళికిహుళ్ళి, సున్నకు సున్న అయింది. క్రోధోద్దీపితమానసులైన కవిరాజు తెలుగు ప్రజలకు ప్రబోధం చేయక తప్పలేదు. తిలకించండి.

తెలుఁగు వారికిఁ దెలుఁగు రాష్ట్రము,
తేర తేరఁగ నూడి పడునా !
ద్రవిడ మంత్రి ముఖావలోకన
భాగ్య సంపద యబ్బినప్పుడు

తెలుఁగు మంత్రులు మంత్రవిదులై
మూఁగ నోమును బట్టి నప్పుడు,
తెలుఁగు శాసన సభ్యులెల్లరు
తెల్ల మొగములు వైచు నప్పుడు.

తెలుఁగుబిడ్డా! లేవ లేవా!
వీరపాణము సేయ రావా;!'

ఆంధ్రులలో ఐక్యత శూన్యం; బహు నాయకత్వం హెచ్చు. కొందరు ప్రత్యేక రాష్ట్రం కావాలంటే, మరి కొందరు అక్కర్లేదన్నారు. చారిత్రకంగా చెన్నపట్టణం తెలుగు వారిది. కాబట్టి చెన్నపట్టణం రాజధానిగా గల ఆంధ్ర రాష్ట్రం ఏర్పడాలి అన్నారు కొందరు నాయకులు. ఇంకా కొందరు నోరు మెదిపితే ఏమొస్తుందో భగవంతుడాయని మౌనం వహించారు. ఈ విధమైన వైరుధ్యాన్ని రామస్వామి చౌదరి గారు ఈ సూతాశ్రమ గీతాలలో మహా చక్కగా చిత్రించారు;

'ఆంధ్ర కేసరిరేయిఁ బవలును
గుహల నిద్దుర బోవునప్పుడు,
... ... ...

చెన్న పట్నము వదలి పెట్టగఁ
సాహసింపక యున్న యప్పుడు.

... ... ...

గద్దె యెక్కిన గద్దె వారలు
గద్దరింపులు మానినప్పుడు,

... ... ...

నిలువు మీసము పైని నుండిన
నిమ్మకాయలు జాఱు నప్పుడు,
అరవ నచివుని మాట లనుచో
నులికి పాటును బొందునప్పుడు.

... ... ...

ఏమి చెప్పిన నేమి వచ్చునొ
ఏమిరా భగవంతుడా యని
తెలుఁగు డాక్టరు తెలుఁగు దేశము
నాడిఁ జూచుచు నిల్చునప్పుడు

... ... ...

రెడ్డి దొర గురు పాదులకు జే
జేలు పెట్టుచు నిల్చునప్పుడు.
తెలుఁగు రాష్ట్రము పనికి రాదని
తెల్ప నేర్చితి ననెడు నప్పుడు

... ... ...

తెలుఁగు పత్రిక లసలె ముట్టుట
మానివేసితి ననెడి నప్పుడు.

... ... ...

ఆంధ్ర రాష్ట్రము గూర్చి యాంధ్ర మ
హర్షి యేదియు చెప్పనప్పుడు'

ఆంధ్రరాష్ట్రం ఎలా వస్తుంది ! కాబట్టి కుటిల రాజకీయ నాయకుల మాటలకు మోసపోవద్దని యావదాంధ్రజాతికి హెచ్చరిక చేశారు చౌదరిగారు.

'తోడుఁ బోతుల నమ్మనేలా;
కాడుఁ పఱచిరి యనఁగనేలా
తోడుతోడన్ నడుముగట్టిన
నూడిపడదే తెలుఁగు రాష్ట్రము;

మొక మొగంబులఁ జూడనేలా
రకరకంబులఁ మాటలేలా !
ఊరుఊకమును ఒక్కటయితే
ఊడిపడదా తెలుఁగు రాష్ట్రము !!'

కవిరాజు గారి అసలు హృదయం, చివరి చరణాలలో బయట పడింది. ప్రజలకు నాయకత్వం కావలసిందే! కాని ఆ నాయకత్వం ప్రజా క్షేమం కన్నా, తమ స్వార్థమే ఎక్కువగా భావించినప్పుడు ప్రజలు నాయకులను క్షమించరని, క్షమించకూడదని చౌదరిగారి ఉద్దేశ్యం. అలాంటి విపరీత విపత్కర పరిస్థితి సంభవించినప్పుడు, నాయకత్వాన్ని కాదని, ప్రజలు ఐక్యతతో ముందుకు సాగాలంటారు. ఈ ప్రబోధం ఫలితంగా ప్రజలలో ఆందోళన బయలుదేరింది. నాయకత్వం-కదలిపోయింది. కవిరాజు గారు తలంచినట్లుగానే పొట్టి శ్రీరాములు గారి పూర్ణా హుతితో యావదాంధ్ర జాతి ఏకోన్ముకమై 1-10-53న ఆంధ్రరాష్ట్రం సాధించింది.అదేఆంధ్రప్రదేశ్ అవతరణకు దారి తీసింది.

రామస్వామి చౌదరి గారు ప్రాచీనాంధ్ర నాయకుల పౌరుష పరాక్రమాలను, సాహసకృత్యాలనూ గురించిన కథలు మహాసరదాగా చెపుతుండేవారు ఆంధ్రత్వం పూర్తిగా మూర్తీభవించిన వ్యక్తి కవిరాజుగారు. వారు మిక్కిలి ధైర్యసాహసాలు కలవారని చెప్పడానికి ఒక్క సంఘటన వివరిస్తే సరిపోతుంది.

ఒకప్పుడు తంజావూరులో జస్టిసుపార్టీ సమావేశాలు జరిగాయి. అప్పుడు జస్టిసుపార్టీ నాయకుడు బొల్లి మునుస్వామి నాయుడు గారు, మద్రాసు రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా వున్నారు. నాయకత్వానికి బొబ్బిలి రాజా పోటీ చేయాలని సంకల్పించారు. ఆ మీటింగు జరక్కుండా చేయాలని కొందరు తలపెట్టారు. ఆనాటి సమావేశానికి ఎక్కువ మంది ప్రతినిధులు మునుస్వామి నాయుడు గారి పార్టీకి చెందినవారే హాజరవడంవల్ల, మీటింగు ఏర్పాటు చేయడంలో కొంత ఆలస్యం జరిగింది. ప్రజలు ఉద్రేకపూరితుల య్యారు. అందరికంటే ముందుగా రామస్వామి చౌదరి గారు కోటగోడలు దూకి హాలులో కెళ్ళారు. ప్రతినిధులంతా రామస్వామి గారిని అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నుకొని కొన్ని తీర్మానాలు ఆమోదించారు. తరువాత సమావేశము సమాప్తమయింది. అందుచేతనే కవిరాజు గారు తెలుగు వారు పిరికి వారు కాదంటూ 'తెలుగు జోదులు' అనే గీతం వ్రాశారు.

[1]'కంచి కోటలు కంచి తలుపులు
ఖంగు ఖంగున మ్రోగునప్పుడు
తంజ నగరపు కోట గోడలు
చెంగు చెంగునఁ నెగురు నప్పుడు

తిరువటంబునఁ జేర సేనలు
కెవ్వు కెవ్వన నరుచు నప్పుడు
మధుర కోట యగడ్త లన్నియు
జివ్వు జివ్వన దూఁకునప్పుడు

తెలుఁగు వారలు పిఱికి వారలో
తెలుఁగు బిడ్డా ! తెలుసు కొనుమా!'

1. సమదర్శిని 1931-32 ఉగాది సంచిక

దీనిని గురించి వ్యాఖ్యానిస్తూ 'రామస్వామి యను నౌకరు' (One Rama Swamy) అని హిందూ పత్రిక వ్రాసింది. ఆయనను బాగా తెలిసివుండి కూడా బొబ్బిలి రాజా గారికి ప్రతికూలంగా వున్నందు వల్ల ఆ పత్రిక అలా వ్రాసింది.

రామస్వామి గారది చూచి మద్రాసు పత్రికా కార్యాలయాని కెళ్ళి విజిటింగ్ కార్డు, మీద 'One Rama Swamy' అని వ్రాసి ఆ సంపాదకునికి పంపించారు, ఆ సంపాదకుడు వెంటనే తలుపులన్నీ మూసివేయించాడని వేరే చెప్పాలా ?

దేశ చరిత్రల ప్రయోజనం మన పూర్వులకు అట్టే తెలిసినట్లు కనుపించదు. అందుచేతనే, సరియైన ఆంధ్రుల చరిత్ర వారు వ్రాసియుండలేదు, ఇది జాతిపురోగమనానికి ఆటంకంగా పరిణమించింది, చారిత్రక జ్ఞానం లేకపోతే, స్వార్థపరులైన అగ్రజాతి ఏ అసత్యం ప్రచారంచేసినా అది సత్యంగా చెలామణి ఔతుందని గ్రహించారు రామస్వామి చౌదరి గారు. ప్రజలు చారిత్రక దృష్టి అలవరచుకోవలసిందిగా పదే పదే నొక్కి వక్కాణించారు. [1]కళా నైర్మల్యం పడగట్టేందుకు చారిత్రక దృష్టి అవసరం. చాలామంది రచయితలలో అది అరుదు. రామస్వామి గారికి మాత్రం ఇది బిరుదు 'అన్నారు శ్రీరంగం నారాయణబాబు. చౌదరి గారు ఎంత ఘనత వహించిన కవులో, అంత చారిత్రక పరిశోధకులు కూడా. వారు భారత దేశచరిత్రనే కాక, ప్రపంచ చరిత్రను కూడా కూలంకషంగా పరిశోధించారు. ఇందుకు వారి గ్రంథాల పీఠికలే ప్రబల నిదర్శనం. చారిత్రక సంఘటనలకు విరుద్ధంగా వున్నవాటిని 'పిట్టకథల' క్రింద జమకడుతుండేవారు. అది కారణంగానే వేదం వేంకటరాయశాస్త్రి గారి 'ప్రతాపరుద్రీయము'ను ఈ గీతాల్లో నిశితంగా విమర్శించారు చౌదరి గారు. ప్రతాపరుద్రీయం చారిత్రక

1. సన్మాన సంచిక

నాటకంగా భావించబడుతున్నది. కాని అందలి ఇతి వృత్తం చరిత్రకు భిన్నంగా ఉండి అనేక అభూత కల్పనలతోనూ, అస్వాభావికమైన పాత్రల తోనూ నిండి వుందని ప్రముఖ నాటకకర్తల అభిప్రాయం అందులోని ప్రతాపరుద్రుడు, యుగంధర మంత్రి, సుల్తాన్, పేరిగాడు మొదలయిన పాత్రలు స్వభావసిద్ధంగా లేవు. పేరిగాడు యుగంధరుడు చారిత్రక పురుషులు కానేకారు. ఈ నాటకంలోని సంభాషణలు కృత్రిమంగానూ, సంఘటనలు వాస్తవజగత్తుకు అతీతంగానూ ఉన్నాయి. ఢిల్లీలోని గంగానదిలో ఓడలు వెళ్ళటం, వాటిలో సౌదాగర్లు మకాం చేయటం లాంటివి చారిత్రక సంఘటనలు కానే కావు. పిచ్చివాడి చేష్టలు, పేరిగాడి కథ, సుల్తాన్ కథ జరిగినట్లు విశ్వసించడానికి వీలులేకుండా వున్నాయి. వాస్తవ జగత్తుకు దూరమయిన ఈ నాటకంలో చారిత్రకమయిన, భౌగోళికమయిన తప్పులు, కుప్పలుగా ఉన్నాయని తలంచారు రామస్వామి చౌదరి గారు. తెలుగుబిడ్డకు సరియైన తెలుగు చరితను తెలిసికోవలసిందిగా సలహా యిచ్చారు.

[1]'ఢిల్లిదగ్గర గంగ యుండెనా ??
గంగయొడ్డున ఢిల్లి యుండెనా ??
గంగమీఁదను బడవ యెక్కిన
ఓరుగంటిని జేరఁగలడే ?

ఔర ! వేంకటరాయ శాస్త్రీ !
ఔర ! వేంకటరాయ శాస్త్రీ !!
ఎంత బొంకును బొంకిపోతివి
చచ్చి యెచ్చట నుంటివోకద.

తెలుఁగు బిడ్డా ! తెలుఁగు చరితను
నేఁటికైనను దెలిసికోరా !!'

1. ప్రజామిత్ర ఏప్రిల్, 1935

తెలుగు రాజుకూ, తెలుగు ప్రజలకూ అపఖ్యాతిని తెచ్చే కథలు, గాథలు ప్రచారం చేయవద్దన్నారు. యుగంధరుడు, జనార్ధనుడు అనే బ్రాహ్మణ మంత్రులుగాని, పేరిగాడనే పెద్ద చాకలిగాని ప్రతాపరుద్రుని కొలువులో లేరన్నారు. ప్రతాపరుద్ర మహారాజును బందెనుండీ విడిపించిందొక బ్రాహ్మణేతర దండనాధుడనీ, అతనికి 'రాయబంది విమోచకుండనే బిరుదు గలదనీ, అతణ్ని ప్రజలు నేటికి పూర్తిగా విస్మరించారనీ తెలియచేశారు. బందెపోయిన ప్రతాపరుద్రుడు బైటపడి, సిగ్గుతో, సింహాసనం మరల అధిష్ఠించలేదన్నారు. గౌతమీనది సమీపంలో తపస్సు చేస్తూ శేషజీవితం గడిపారన్నారు. ఓరుగంటిని తిరిగి ఒక్కనాడు కూడా చూడలేదన్నారు.

''ఇలాంటిదే మరో తెలుగురాజుకు అపఖ్యాతి నాపాదించిన కథ; అదే సారంగధరుని కథ. ఇది మాళవదేశానికి సంబంధించిన గాథ. మాళవ దేశాన్ని పరిపాలించిన రాజరాజ నరేంద్రునకు సారంగధరుడు అనే కుమారుడున్నాడనీ, కేవలం నామ సామ్యంచేత తెలుగు రాజైన రాజరాజుకు ఈ కథ అంటగట్టబడిందనీ భావించిన రామస్వామి చౌదరి గారు యథార్థమైన సారంగధరుని చరిత్రను ప్రజలకు తెలియచేశారు.

'లేఁడు సారంగధరుఁడని యెడి
సుతుఁడు, రాజనరేంద్రుకున్
లేదు రత్నాంగి యను భార్యయు,
లేదు చిత్రాంగి యను వేశ్యయు,

తెలుఁగుదేశపుఁ జరిత గాదిది,
తెలుఁగు రాజుల చరిత గాదిది,
పట్టి బూటకమయ్యె నీ కథ,
పిట్టకథయే : పిట్టకథయే :
తెలుఁగుబిడ్డా : తెలుఁగు చరితను
దెల్పుచుంటిని దెలిసికొనుమా ;'

సామాన్య మానవునికి, అసాధారణ ప్రజ్ఞగల కవికి ప్రధానమయిన భేదం ఒక్కటున్నది. సామాన్యుడు సత్యాసత్యాల జోలికి పోకుండా అయిష్టంతోనే అన్నింటినీ భరిస్తాడు. కవి అలా సహించలేడు. అతని దృష్టి సత్యం మీద లగ్నమై ఉంటుంది. తాను సత్యమని విశ్వసించిన విషయాన్ని పదిమందికి తెలియజేయాలని కాంక్షిస్తాడు. అలా తెలియజేసేవరకూ అతని ఆరాటం ఉపశమించదు. రామస్వామిగారు ప్రతాపరుద్రీయ నాటకాన్ని విమర్శించిన తొలిరోజుల్లో తెలుగు నాట బ్రాహ్మణవర్గం, దాని అనుయాయులు చేసిన గల్లంతు, గందరగోళం ఇంతా-అంతాకాదు సారంగధరుని గురించిన సత్యం వెల్లడించిన కొద్ది కాలానికి 'కంపిలి శాసనం' బయటపడింది. రామస్వామి చౌదరిగారు చెప్పిందే నిజమని మరోసారి రుజువయింది.

కవిరాజుగారి హృదయం అతి విశాలం. ఆయన హృదయంలో రాష్ట్ర వాంఛ, దేశ సమైక్యత, అగ్రజాతుల నిరంకుశత్వాన్ని ఎదుర్కొనడం, దేశభక్తి మొదలయిన భావాలన్నీ సమన్వయించ బడ్డాయి.

ఈ సూతాశ్రమ గీతాలలోని భాషలో పటిమ, భావనలో బలము ఉన్నాయి. శైలి ఆపాత మధురంగా ఉండి గీతం అమృత స్రవంతిగా రూపొందింది. అందుచేతనే కవిరాజుగారి గేయ రచనా సంవిధానాన్ని సాహితీ వేత్తలే గాక, రాజకీయ నాయకులు కూడా కొనియాడారు. దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు తమ అభిప్రాయాన్నిలా వ్యక్తీకరించారు. ''మా రోజుల్లో పోలీసుల జులుం బహుజాస్తిగా ఉండేది. కాంగ్రెసు వాలంటీర్లు ఎంతగా ప్రచారము చేసినప్పటికిన్నీ పోలీసులకు భయబడి, ప్రజలు మా మీటింగులకు అంతగా వస్తూఉండేవారు కాదు. ఒకసారి ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు, కవిరాజుగారి సూతాశ్రమ గీతాలను నాకు చూపించారు. అవి నాకెంతో మహదానందాన్నిచ్చాయి. నలుగురు వాలంటీర్లకు వాటిని పాడటం నేర్పాము. 'వీరగంధము తెచ్చినారము...' పాటపాడుతూ వాలంటీర్లు వీథుల్లో తిరుగుతూ వుంటే,

ప్రజలు అసంఖ్యాకంగా వారివెంట బయిలుదేరేవారు. ఆ తరువాత మేము మీటింగులు చేసేవారము. చౌదరిగారి గీతాలు అందకుంటే-మా ఉపన్యాసం ప్రజలలోకి అంత త్వరితగతిలో వెళ్ళేది కాదు. కవిగా రామస్వామిచౌదరి స్వాతంత్ర్య సమరానికి చేసిన సేవ బహు దొడ్డది.''

గాంధీజీ సిద్ధాంతాలకు భాష్యకారులైన డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు యిలా అన్నారు: ''స్త్రీలు, పురుషులు, బాల బాలికలు కాంగ్రెసులో చేరవలెనన్న, ఆ దినములలో చాలా కష్టముగా ఉండెడిది. కొండా వెంకటప్పయ్యగారు కాంగ్రెసు ప్రచారము ముమ్మరముగా చేయు చున్నారనియు, అటులనే నీవును చేయవలయుననియు బాపూజీ నాతో ఒకసారి యనిరి. నేను బాపూజీని కారణమడిగితిని దేశభక్తి ప్రబోధితము లయిన గేయములతో కొండావారు చైతన్యము కలిగించుచున్నారని గాంధీజీ యనిరి. నేను వెంకటప్పయ్య పంతులు గారికి వెంటనే ఒక జాబు వ్రాసితిని. వారు ప్రత్యుత్తరముతో పాటు, రెండు పాటలను నాకు పంపినారు. క్రింద కవి పేరు లేదు. మా కాంగ్రెసు వర్కర్లకు కూడా వాటిని పాడమని ఆదేశించితిని. కొన్ని రోజుల తరువాత ఆ పాటలు వ్రాసినవారు కవిరాజు త్రిపురనేని రామస్వామి గారని నాకు తెలిసినది. అప్పుడే వారిని అభినందిస్తూ ఒక లేఖ వ్రాసితిని. దేశభక్తి ప్రపూరితములయినవారి గీతాలు మా శ్రమను చాలా వరకు తగ్గించినవి''

మధురకవి నాళం కృష్ణారావు గారు ''నేను కవిత్వం అల్లినాను. సన్మానాలు చేయించుకొన్నాను. బిరుదులు పొందాను. కాని, కవిత్వమనేది-సూటిగా ప్రజల హృదయ కుహరాలలోకి చొచ్చుకొని పోయేదిగా ఉండాలి. వారిని కదిలించాలి. ముందుకు నడిపించాలి. ఆ పని చాలా మందికన్నా కవి రాజు గారు ఎంతో ఘనంగా చేశారు. వారు కొంత మందికి బాధకలిగించారని చెపుతారు. 'యథార్థవాదీ, లోక విరోధి' అను సామెతవుండనే వుంది గదా!

సత్యం ఎప్పుడూ బాధగానే ఉంటుంది అనుకొని లాభంలేదు. బాధపడ్డా, ఓ సత్యం తెలిసికొన్నామన్న సంతృప్తి లభిస్తుంది. చాలామంది కవితలలో ఈ సంతృప్తికి ఆస్కారం లేదు'' అన్నారు

కోటంరాజు రామారావు గారు ''నాకు, కవిరాజు గారికి చాలా పోలికలున్నాయి. మెత్తగా, సున్నితంగా చెప్పడం ఇద్దరికి చేతకాదు. అందు కనే కవులు ఆయనను, జర్నలిష్టులు నన్ను, దూర దూరంగా ఉంచుతారు. దేనికీ భయపడక పోవడం మా ఇద్దరి ప్రకృతి. నాకు, వారికి గూడా చిరాకు జాస్తి. ఆయన ప్రజలను సత్యపథంలో నడిపించడానికి కవిత్వం చెప్పారు. నేను వచనం వ్రాశాను కవిరాజు గారి మరణంతో తెలుగు సాహిత్య రంగంలో ఏనాటికీ భర్తీచేయలేని లోటు ఏర్పడింది. అలాంటివారు ఇంత వరకు తెలుగుదేశంలో జన్మించియుండలేదు; ఇకముందు జన్మిస్తారన్న ఆశలేదు...'' అన్నారు.

రామస్వామి చౌదరి గారు 'ప్రతాపరుద్రీయము' మీద వ్రాసిన విమర్శనా గేయాన్ని చదివిన, దువ్వూరి రామిరెడ్డిగారు [1]'నాటకము-చరిత్రము' అని ప్రతి విమర్శనా వ్యాసమును వ్రాశారు. 'చౌదరి గారు ఢిల్లి యెక్కడ, గంగ యెక్కడ ? అని ప్రశ్నించినారు. నాటక ప్రపంచమును యధార్థ ప్రపంచదృష్టితో చూడజనదు. నాటకమును కొన్ని కవి సమయములకును, కళా నియమములకును లోబడియున్న అనన్యపరతంత్రమయిన సృష్టి'' అన్నారు కవికోకిల రామిరెడ్డి గారు. చరిత్రను నాటక కర్త ఎంత వరకు మార్చవచ్చును ? అను విషయాన్ని చర్చిస్తూ ఫ్రెంచి, జర్మను కవుల

1. కవికోకిల గ్రంథావళి - నాలుగవభాగం.

అభిప్రాయాలను ఉదహరిస్తూ, 'నాటకము చరిత్రకు భిన్నముగ నున్నదని విమర్శించుట పొరపాటు కాగలదు' అన్నారు రెడ్డి గారు. ఈ ప్రతి విమర్శ వ్రాసిన రెండు నెలల తదనంతరం కవిరాజు గారిని తెనాలిలో కవికోకిల రామిరెడ్డి గారు కలుసుకోవడం జరిగింది వారిద్దరూ ఈ సమస్యను ముఖా ముఖి చర్చించారు. ఆ సందర్భంలో రామిరెడ్డి గారితో 'చరిత్రను మార్పు చేసి వ్రాసే హక్కు నాటకకర్తకు ఎంతవరకుందో, 'అంతమేరకూ, ఆ నాటకంలోని చారిత్రక, భౌగోళిక అసందర్భాలను ఇతివృత్తంగా గైకొని కవిత్వం చెప్పే హక్కు కవికీ ఉంది" అన్నారు చౌదరిగారు. వారి తార్కిక ధోరణి రామిరెడ్డి గారిని ఆశ్చర్య చకితులను చేసింది. ఈ సంభాషణల అనంతరం, రామిరెడ్డి గారు "కవిరాజు గారి గ్రంథ పఠన మొకయెత్తు, వారితో సంభాషించుట మరియొక యెత్తు వారి నిరంతర గ్రంథ పఠనము, గ్రంథరచనము, వాదనా కౌశలము నన్నక్కజపఱచినవి. కవిరాజును 'బ్రాహ్మణేతర కవి' యని తూలనాడు వారికి, వారి శక్తిసామర్థ్యము లేమియు తెలియవని యనవచ్చును. పద్య, గద్య రచనములందు వారి శైలి యపూర్వము. సాంఘిక చైతన్యమును గలిగించుటకు ఈ గీతము లెంతేని అవసరము. ఈ తీరు మహాకవుల యవుసర మాంధ్రావని కెంతేని గలదు." అన్నారు.

ఆంధ్ర సాహిత్య నందనోద్యానంలో పూచిన సురభిళ ప్రసూనాలు ఈ సూతాశ్రమ గీతాలు.

---

1. 9-7-1935 కవిరాజు డైరీ పుటలనుండి.

# శతకాలు

తెనుగు నాట అమిత ప్రచారంలో ఉన్న శతకాలు రెండు-ఒకటి సుమతి శతకం-రెండవది-వేమన శతకం. అయితే, ఈ రెండు శతకాలకు ఇంతటి ప్రాచుర్యం ఎలా వచ్చింది? సాంఘిక జీవనాన్ని ఈ రెండు శతకాలూ సరిదిద్దటానికి ప్రయత్నించటమే ముఖ్య కారణంగా కనిపిస్తున్నది. ఈ శతకాలలోని పద్యం ఒకటీ రాని తెలుగు వాణ్ని చూపటం కష్టం.

చెప్పదలచుకున్న నీతీ - లేదా-ధర్మం - లేదా - ఉద్బోధ-ఏదైనా కానివ్వండి. అది రమణీయంగా ప్రతిపాదించటం అవసరం. సామాన్య పాఠకునికి అవి ఇట్టే హృదయానికి హత్తుకొనేలా ఉండాలి. వారి నిత్యజీవితాలకు సన్నిహితమైన ఉదాహరణలతో జోడించి చెప్పినప్పుడు ప్రజలు తప్పకుండా ఆలకిస్తారు. ఆచరిస్తారు కూడాను. సుమతీ శతకంలో ఈ గుణం ఉంది. ఇక, వేమన శతకం తేట మాటలతోనూ, సులభశైలితోనూ, సూటి సూక్తులతోనూ ఉండటమే కాకుండా మనోరంజకంగా కూడా ఉంది.

"ఉప్పు కప్పురంబు ఒక్కపోలిక నుండు
చూడ చూడ రుచుల జాడవేరు"

... ... ...

అల్పు డెపుడు పల్కు నాడంబరముగాను
సజ్జనుండు పల్కు చల్లగాను'

అని మాత్రమే వేమన వ్రాసివుంటే ఈ పద్యాలు ప్రజల దాకా వచ్చి ఉండేవి కావనుకుంటాను. మూడవ పాదంలోనే వేమన తన కవిత్వ

మహత్యాన్ని ప్రదర్శించాడు. "పురుషులందు పుణ్య పురుషులు వేరయా' 'కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా ?' అనటంతో వేమన తారక స్థాయినందుకున్నాడు. సామాన్య ప్రజలకు అర్థమయ్యే చక్కటి ఉపమాలంకారాలను ప్రయోగించి ప్రజా హృదయాలను చూఅగొన్నాడు. ఆనాటి సాంఘిక దురాచారాలను దూయబట్టాడు. మతం పేరిట, దైవం పేరిట జరుగుతున్న అత్యాచారాలను గర్హించాడు. మోసం. డాంబికం లేకుండా జ్ఞానం అలవఱచు కోవాలన్న భావాలు వేమన శతకంలో కోకొల్లలుగా వున్నాయి.

# కుప్పుసామి శతకం

వేమన వలే రామస్వామిగారు ప్రజాకవులుగానే ప్రసిద్ధి కెక్కారు. ప్రజల శ్రేయస్సు కొరకు కవితను వారు సాధనంగా ఉపయోగించారు. అందుచేత సంస్కరణకు వేమనయోగి మార్గాన్నే రామస్వామిగారు అవలంభించారు. కవితా రీతిలో, భావుకతలలో వేమన, రామస్వామి ఒకే కోవకు చెందినవారు. మూఢ విశ్వాసాలలో మునిగి తేలుతున్న సమాజంలో నీతి మృగ్యమౌతున్నదని వారు గమనించారు. నీతి లుప్తమైతే అభ్యుదయ పథంలో మానవుడు పురోగమించ జాలడని వారు గ్రహించారు. తేటతెల్లమగు తెనుగు నుడికారంతో కుప్పుసామి శతకంపేర "కఱదలు" కూర్చారు.

ఇది జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరిగారిని దృష్టిలోవుంచుకొని వ్రాసిన శతకం. కుప్పుస్వామిగారు, రామస్వామిగారు మంచి స్నేహితులు. తెనాలి మునిసిపల్ ఛైర్మన్‌గా వున్న రోజుల్లో ప్రతి ఆదివారం కుప్పుస్వామి గారి వద్దకు రామస్వామిగారు వెళ్తూ ఉండేవారు. రామస్వామిగారి మిత్రుడు

ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారుకూడా కలిసేవారు. ఈ ముగ్గురు సాహిత్య చర్చచేస్తూ ఉండేవారు. ఈ శతకాన్ని కుప్పుస్వామి చౌదరిగారికి వినిపిస్తూ ఉండేవారు రామస్వామిగారు. రామస్వామిగారు ఒక పద్యం చదువుతూ వుండగా, కుప్పుస్వామిగారు పకపకా నవ్వుకొంటూ "నా పరిస రాలలో వుండే వాళ్ళందరిమీదా చురకలు వేశావే" అన్నారట! ఈ విషయం నాతో చెప్పినవారు జానపద సార్వభౌమ, కవిరత్న కొసరాజు రాఘవయ్య చౌదరిగారు.

ఈ శతకంలోని మొట్టమొదటి పద్యమే మనలను ఆశ్చర్య చకితులను చేస్తుంది. మన ఆలోచనలను రెక్కలిపి, సత్యం ఆలోచించమంటుంది. అందరికి తెలిసినదైనప్పటికీ పాఠకుల సౌకర్యార్థం దాని నిక్కడ పొందు పరుస్తున్నాను.

తే. "గొంటరులఁ దుంటరుల గుమిగూర్చి సృష్టిఁ
జేసి చీటికి మాటికి గాసి వారు
తన్నుకొని చచ్చుచుండగఁ దనియుచుండు
గొప్పవానికి జేజేలు కుప్పుసామి".

సమస్త సృష్టీ భగవంతునిదే నంటున్నారు పెద్దలు. 'శివుని ఆజ్ఞలేనిదే చలిచీమయినా కుట్టదు' అన్న సామెత మనకు ఉండనే ఉన్నది. భగవంతుడు నిర్వికారుడు, నిరంజనుడు అంటున్నారు. అయినప్పుడు సృష్టిలో ఇంత మంది తుచ్ఛులు, నీచులు, దుర్మార్గులు, అసత్యవాదులు, అధర్మవాదులు, హంతకులు, కృతఘ్నులు, ఘాతకులు, జారులు, చోరులు ఎందు కుంటున్నారు? పరస్పర హననోద్రేకంతో ప్రాణులిట్లా ఎందుకు నిరంతర సమరాగ్నిలో ప్రమగ్గి పోతున్నాయి? దీనికి కారణమేమిటి? నిర్వికారత నుండి వికారత జనించటానికి ఆస్కారం లేదే! అలాగే నిరంజనత నుండి, రంజనత ప్రాదుర్భవించటానికి అవకాశం లేదే! బంగారం నుండి మరో

లోహం పుడుతుందా మరి ? లేదుగదా ! ఈ సృష్టి భగవంతునిదే అయి వుంటే- అతనిలో లేని-లేవని చెప్పపడుతున్న దుర్గుణాలన్నీ అతని సృష్టి లోకి ఎలా వచ్చాయి ? వీటికి సమాధానం చెప్పవలసి ఉంటుంది.

కాబట్టి-ఇది భగవంతుని చర్య కాదని మనం ఆలోచించుకోవలసి ఉంటుంది. ఒక వేళ భగవంతుడే అనుకొన్నా-అతగాడు స్వార్థపూరితులైన అగ్రజాతి చిత్రిస్తున్న భగవంతుడు మాత్రం అయివుండడు. ఇంత ఆలోచనా మనకు కలిగి తీరుతుంది. ఇక రెండవ పద్యం దగ్గర కొచ్చేసరికి మనకు స్ఫురించే సందేహాలు ఇన్నీ - అన్నీ కావు.

తే. "ఏడో, పద్నాలుగో, మూఁడో యెన్నొ, జగము
లెల్ల సృష్టించినటువంటి యీశుఁడొకరొ
యిర్వురో, యెందఱో వారికెల్ల వేడి
కోళ్ళనర్పింతు భక్తితోఁగుప్పసామి'.

ఇన్నిటికీ మనవారు చెబుతున్న లోకాల సంఖ్య ఇంకా అంతిమ నిర్ణయం కానట్టే వుంది. మూడు లోకాలని కొందరంటే, కాదు ఏడు లోకాలని మరికొందరు, పద్నాలుగని ఇంకొందరూ దెబ్బలాడుతున్నారు. పోనీ, దాని కర్మానికి దాన్నొదిలి వెడదామన్నా — వీటన్నింటికి కర్త ఎవరో మనకు తెలియకుండా వుంది. ఆదిశక్తి అని కొందరు, బ్రహ్మ అని కొందరు, విష్ణువేనని ఇంకొందరు - ఈ గొడవలతో చస్తున్నాం. ఈనాటి రాజకీయ వాదుల్లో కొనవస్తున్న పదవీ వ్యామోహ పరత్వానికి, ఆనాటి దేవతల చరిత్రకు తేడా ఏమీలేదు; అవునా ?

రామస్వామి చౌదరి గారి అభిప్రాయాలను తెలియ జేయటానికి మరి కొన్ని పద్యాలను పరిశీలిదాం.

మనతో మాట్లాడే వారందరూ మన స్నేహితులు కారు. పూసుకొని తిరగని వారు మన విరోధులు కారు. స్నేహితులమంటూ మన చుట్టూ 'మంద' ఎప్పుడు ఏర్పడుతుందో కవిరాజు చెబుతున్నారు :

తే. 'పూలు తెగఁబూసినప్పుడు మూగుచుండుఁ
దేనెటీఁగలు పైబడి తేనె కొఱకు
స్నేహితులు కొందఱీరీతిఁ జేరుచుందు
రప్పుడప్పుడు కనిపెట్టు నుప్పుసామి'.

ఈ పద్యం సుమతీ శతకం లోని 'ఎప్పుడు సంపద కలిగిన...' అనే పద్యాన్ని స్ఫురింప చేస్తున్నది.

ఒక రకం మనుష్యులున్నారు. వారు మన శత్రువులేమీ కానీయండి, మన ముందు తెగదూషిస్తూ ఉంటారు. మన సానుభూతిని సంపాదించాలని ప్రయత్నిస్తూ ఉంటారు. అటువంటి వారిపట్ల ఎలాంటి అప్రమత్తతతో ప్రవర్తించాలో చౌదరి గారు చెబుతున్నారు :

తే. 'పరుని నీ ముందుఁ దిట్టెడువాడు నిన్ను
నొరుని ముందటఁ దిట్టక యుండఁబోడు
చనవు రవ్వంత-వాని కొసంగరాదు
ముప్పువచ్చుఁ దప్పక దానఁ గుప్పుసామి'.

కొంతమందిలో అసూయ, ద్వేషం హెచ్చు మోతాదుల్లో ఉంటాయి. వారు ఎంత సేపటికీ వారి గొప్పతనాన్ని చాటుకోవటం తప్ప ఇతరుల గొప్పతనం జూచి ఓర్వలేరు. ఈ అసూయా భావంతోనే వారు క్రమేణా నీరసించి, కృశించి, నశించి, పోతారు. దీన్ని రామస్వామి గారు ఎంత రమ్యంగా వర్ణించారో చూడండి :

తే. 'ఒరుల గొప్పతనముఁజూచి యోర్వలేని
పురుషుఁడెందు వేదనఁబడి పొక్కి పొక్కి
తెవులులేక యే తెగటారుఁ జివరకతఁడు
తప్పదీమాట వేదంబు కుప్పసామి'.

లౌకిక ధర్మాన్ని ఎంత లలితంగా చెప్పారో చూడండి :

తే. 'రాజు వ్యభిచారియైనచో రసికుఁడంద్రు
త్రాగి తందనాలాడునో భోగియంద్రు
పాడిదప్పిన మంత్రాంగ పరుఁడటంద్రు
తప్పు తెలియని లోకులు కుప్పసామి'.

సామాజికాభ్యుదయ చక్రం ఆర్థికనేమి మీద పరిభ్రమిస్తూ ఉంటుంది. ఆర్థిక దృష్టి లేని వారి జీవితంలో అరాజకత్వం తప్పదు. ఎంతటి తుచ్ఛులైనప్పటికీ ధనం గల వారికి సంఘంలో గౌరవ మర్యాదలు లభిస్తున్నాయి. ఎంతటి నీతివంతులయినా సరే ఆర్థికంగా వెనుకబడి వుంటే వారి జీవితాలు అవహేళనకు గురి అవుతున్నాయి. అందుచేతనే కవిరాజు గారు ఇలా అన్నారు.

ఆ. 'కాని డబ్బుచేతఁ గట్టువాఁడెట్టివాఁ
డయిన గౌరవంబునందు పెరిఁగి
పరువుఁగోరి బ్రతుకువాఁడెందు ద్రవ్యంబుఁ
గూడఁ బెట్టవలయుఁ గుప్పసామి'.

ఆదాయాన్ని మించి ఖర్చుచేసే వారు సుఖపడక పోవడమేగాక, కట్టకడకు కష్టాల పాలౌతారు ? అన్నారు కవిరాజు గారీ పద్యంలో.

''ఆయమును మించి యెవ్వఁడు వ్యయముచేయు
నతనికి సుఖంబు లవవేశముబ్బఁబోదు
తుదకుఁ గడగండ్ల పాలౌను బ్రదుకు తెఱవు
కూడ లేకుండఁబోవును గుప్పుసామి''

జూదమాడుట, స్త్రీల గోరుట, కల్లుత్రాగుట, వేటాడుట, కఠినపు మాటలాడుట, పరుల సొమ్ము నపహరించుట, పరులను నిందించుట అనేవి సప్తవ్యసనాలుగా పేర్కొన్నారు ప్రాచీన నీతిశాస్త్ర కోవిదులు. కాలానుగుణంగా ఇవి మార్పుజెందాయి. ఆధునిక యుగంలో మానవుడు అనేక కొత్త వ్యసనాలకు గురి ఔతున్నాడు. ఆ నూతన సప్త వ్యసనాలు ఏమిటో చౌదరి గారు చెబుతున్నారు చూడండి :

తే. 'నవలచదువు, వ్యాఖ్యేయంబుల కవిలెకట్ట,
యోట్లు, సిగరెట్లు, సినిమాలు, చీట్లు, కాఫి,
నూత్న సప్త వ్యసనములనుచు వచింత్రు
గొప్పనీతి శాస్త్రవిదులు కుప్పుసామి'.

స్త్రీ విద్యపట్ల రామస్వామి గారికున్న అభిమానం అపారమైనది. భావితరాల ప్రజానీకం సుఖప్రదమైన జీవితం గడపాలంటే - స్త్రీ విద్య చాల అవసరమని, స్త్రీలు చదువు కొన్నట్లయితే 'గృహాన్ని స్వర్గసీమ'గా చేయగలరని కవిరాజు గారి విశ్వాసం. ఆ విశ్వాసాన్ని ఒక పద్యంగా రూపొందించారు రామస్వామి గారు.

ఆ. 'చదువులేని జాయ సల్లాపముల కన్నఁ
జదువుకొన్న జాయ చలముమేలు
వీనువిందు గాఁగ వినవచ్చునొక మాట
నప్పుడప్పుడైనఁ గుప్పుసామి'.

ఆ. భార్య చదువు పతికిఁబనికి వచ్చుచునుండు
గొడుకు చదువుకన్నఁ గొంతవఱకు
చదువుకొన్న భార్య సంసారమును దిద్ది
కొనుచుఁ బతికిఁ గూర్చుఁ గుప్పసామి.

ప్రతిభగలవాడు ఏ రంగంలోవున్నా రాణిస్తాడు. అసలు ప్రతిభ లేని వాడు ఎంత గొప్ప పదవి నలంకరించినా, ఏదో ఒకనాడు పదవీ చ్యుతుడు కాకతప్పదు. ఒకవేళ కాలం కలిసిరాక ప్రతిభావంతుడు ఒకప్పుడు పతనావస్థ జెందినా, తిరిగి ఉన్నతస్థితి పొందే అవకాశం ఉంది. ఇది ఏలా జరుగుతుందో కవిరాజు గారు వివరించారు.

ఆ. 'ప్రతిభగల్గువాఁడు పతనంబుఁ జెందిన
మరల పైకి వచ్చు మహిత శక్తి
రాలిపడిన పూలు రమణుల క్రొవ్వేద
నొప్పుఁ జూపరావె? కుప్పసామి'.

మానవతావాది అయిన కవిరాజు వ్యక్తికి ప్రాధాన్యం ఇచ్చారు. వ్యక్తి స్వేచ్ఛను, సంఘానికో, వర్గానికో, బలిపెట్టడం ఆయన అంగీకరించ లేదు. సకల భూతాలకు స్వేచ్ఛా పిపాస ప్రకృతి సిద్ధమని ఆయన ఉద్దేశం. ఈ భావాన్ని ప్రతిబింబించే పద్యమిది.

''పుట్ట నున్నపాము బుసకొట్టి పోబోవు
వీలు చిక్కినపుడు వేగిరించి
సకల భూతములకు స్వాతంత్ర్య కాంక్షయే
యొప్పు సహజముగను కుప్పసామి''

ఈ పద్యం చదివిన వెంటనే భర్తృహరి సుభాషితములలోని ''కందుకము వోలె సుజనుడు' అనే పద్యం మన స్ఫురణ కొస్తుంది. భర్తృహరి పద్యంలోకంటే కూడా యిందులోని ''ఇమేజరీ'' చాలా ఉదాత్తంగా ఉంది.

రామస్వామిచౌదరిగారు అహింసా సిద్ధాంతాన్ని అక్షరాలా ఆచరించే వారు. [1] ఆయన అహింసా సిద్ధాంతం ఎంతవరకెళ్ళిందంటే చెట్టునుండి పూలు కోయనిచ్చేవారుకాదు 'సూతాశ్రమం'లో రకరకాల పూలచెట్లుండేవి ఒక రోజున ఇరుగు పొరుగున వున్న అమ్మాయి పూజకోసం పూలు కోయాలని వచ్చి రామస్వామిగారిని అడిగింది. ''మీ దేవుణ్ణితెచ్చి మా పూలచెట్లక్రింద కూర్చోబెట్టి పూజ చేసుకొని వెళ్ళు, అంతేగాని పూలు కోయకు'' అన్నారు రామస్వామిగారు. ఆ అమ్మాయి నవ్వుకుంటూ రివ్వున పారిపోయింది.

''ఆత్మ వత్సర్వ భూతాని'' — అన్ని జీవులు నీ వంటివే అనుకో, ఎవరినీ బాధపెట్టకు'' అన్న సిద్ధాంతమే వారిది. ఇందులకు ఓ చిన్న సంఘటనను ఉదాహరిస్తే సరిపోతుంది.

చౌదరి గారు తెనాలి పురపాలక సంఘ చైర్మనుగా వున్న రోజుల్లో దుఃదృష్టవశాత్తూ గంగానమ్మ ఆ పట్టణం మీద విరుచుకుపడింది. పౌరు లందరూ భీతావహంతో ఆమెకు ముడుపులు కట్టి, కొలుపులు కొలవడానికి తయారయ్యారు. ఎన్నో-గొఱ్ఱెలు, మేకలు, కోళ్ళు-అమ్మవారి పేరిట బలి ఇవ్వడానికి సిద్ధంగా వుంచబడ్డాయి. ఈ జంతుబలికి చైర్మను గారే ''లైసెన్సు'' ఇవ్వాలి. ఈ విధమైన సామూహిక జంతుబలికి అంగీకరించను అన్నారు చౌదరి గారు. 'లైసెన్సు' ఇవ్వటానికి నిరాకరించారు. ఈ వార్త పట్టణమంతా దావానలంలా వ్యాపించింది. పౌరులలో అలజడి గలిగించింది. చౌదరి గారి వద్దకు కొందరు ''కౌన్సిలర్లు'' రాయబారం వెళ్ళారు.'లైసెన్సు'

1. కవిరాజు లేఖలు-డైరీలు 1972.

ఇవ్వవలసిందేనని పట్టుబట్టారు. జీవహింస పనికిరాదు. పట్టణ ప్రజానీకమంతా అమ్మవారి ఆగ్రహానికి గురి అయినా సరే, మూఢనమ్మకంతో జరిపే కొలువుల పేరిట, మూగజంతువుల్ని బలి ఇవ్వడానికి నేను అంగీకరించ జాలను' అన్నారు చౌదరి గారు. అంతట కౌన్సిలర్లు విశ్వాసరాహిత్య తీర్మానం తెస్తామంటూ బెదిరించారు. చౌదరిగారు చలించకుండా చిరునవ్వుతో, 'మీ ఇష్టమొచ్చినట్లు చెయ్యండి. అందులకు నేను సిద్ధంగానే ఉన్నాను' అన్నారు. విశ్వాస రాహిత్య తీర్మానం పెట్టారు. తీర్మానం నెగ్గింది. తరువాత వారం రోజుల్లోనే మళ్ళీ చైర్మను ఎలక్షను జరిగింది. కవిరాజు గారినే తిరిగి చైర్మనుగా ఎన్నుకొన్నారు. కొలుపులు మాత్రం జరగలేదు. జీవహింస ఆగిపోయింది.

మారీసుపేటలో కొందరు యజ్ఞం చేయాలని తలపెట్టారు. ''యజ్ఞం పేరుతో వారు జీవహింస చేస్తున్నారు. కాబట్టి యజ్ఞం చేయడానికి వీల్లేదు' అన్నారు రామస్వామి గారు. అంతేగాదు. నాలుగు రోజుల్లో అనర్గళంగా ఉపన్యాసాలిచ్చారు. కవిరాజు గారి అనుచరులు కొందరు యజ్ఞగుండం వద్దకు తీసుకొని పోతున్న యజ్ఞపశువు (మేక)ను బలాత్కారంగా లాక్కొని పారిపోయారు. అంతటితో ఆయజ్ఞం విఫలమయింది. ఆ పట్టణంలో మళ్ళీ అట్టి యజ్ఞాన్ని ఎవరూ తలపెట్టలేదు, అందుచేత ఈ శతకంలో జీవహింస చేయరాదంటూ జీవకారుణ్య సిద్ధాంతాన్ని చాటి, ఏసుక్రీస్తు, బుద్ధభగవానుడు మొదలగు విశ్వమానవతావాదుల కోవలో చేరారు చౌదరి గారు.

ఆ 'జీవహింస చేసి జీవింతు ననుకంటె
జెట్టయెందుఁ గూడఁ బుట్టఁబోదు
జీవహింస మాని జీవింపరాదొకో:
కొంత మేలుదానఁ గుప్పుసామి,

తే, మాంసమును భుజింప నిచ్చించి మానవుండు
  మ్రొక్కు మ్రొక్కించు దేవుని ముందుఁబెట్టి
  గొంతుగోసి యే మృగమునో కుడుచుచున్న
  గోపపడకున్నె దేవుండుః కుప్పుసామి.

ఇలా చెప్పడమే కాకుండా చిత్తశుద్ధితో ఆచరించి చూపిన మహోన్నత వ్యక్తి రామస్వామిగారు. ఆయన జీవితంలో మాంసాహారాన్ని ముట్టలేదు. ఈ విషయం కొలంబోనుండి వ్రాసిన లేఖ వల్ల తెలుస్తున్నది.

[1]"24-9-1914న ఒంటిగంటకు స్టీమరుకుఁబోవ వలసిన వాడఁ నగుటచే ఫెర్నినాండ్ నుండి సెలవు తీసుకొని స్టీమరు నెక్కితిని. నా గదిలో ప్రవేశించి పావుగంట యుండువరకు సేవకుఁ డొకఁడు నాముందు కసాయి దుకాణముఁబఱచెను. కత్తి, గరిటె, మాంసము, చేపలు చూడగనే నా శరీరము జలదరించెను. ఏమిచేయను? సేవకునితో వీనినిఁ దీసికొని పోయి శాకములన్నఁ గొనిరమ్మని యింగ్లీషులోఁ జెప్పితిని. అతని మాతృ భాష జపానుభాష. నాకురాదు కొన్ని నిముషములు దిగాలుపడి మూగభాష నారంభించితిని. అదియుఁ గూడఁ దెలియదయ్యె. జాతులతోపాటు మూక సంజ్ఞలుకూడ మార్పు నొందునెమో! ఎట్లయిననేమి భోజనశాలాధికారినిఁ బిలిపించుకొని యింగ్లీషుభాషలోనా యవస్థఁ జెప్పికొన మొదలు పెట్టితిని. నేను వెళ్ళునది డచ్చి స్టీమరు. ఇంగ్లీషుభాష వారికి బాగుగరాదు. నేనుఁ జెప్పుచున్నది యాయనకుఁ దెలియక యుచ్చైస్స్వరముతో నింగ్లీషు భాషలో మాట్లాడుమని నాకు బోధించెను. నేనింగ్లీషు భాషలోనె మాట్లాడుచున్నా నంటి. కాదు. ఇంగ్లీషులో మాట్లాడుమని కోరెను. ఇఁక నేనేమిచేయగలను? మరల నింగ్లీషులో మాట్లాడనారంభించితిని. ఆ మహానుభావుఁడు విసుగుకొని (మత్స్య మాంసాదులవంకఁ జూపి) 'ఇవి నీ కక్కరలేదా'యని ప్రశ్నించెను.

1. కృష్ణాపత్రిక, 31-10-1914.

'అవును నా కక్కురలేదు. పండ్లుగాని, శాకములుగాని యుండిన దెచ్చి పెట్టుడని కోరితిని. యథాప్రకారముగా నాకు కొన్ని ఫలములను, బంగాళా దుంపల కూరయునుఁ దెచ్చిపెట్టెను, భుజించితినిగాని స్టీమరు చలనమువల్ల కన్నులు దిరుగనారంభించె. వారు తీసుకొని వచ్చెడు పదార్థములయందు నొకవిధమగు వాసన యుండెడిది అదినాకు సరిపడలేదు. మూడవ దినమున వాంతి వెళ్ళినది. దానితో కొంతవరకు విశ్రాముముఁ గల్గినది''.

మానవుడు మర్త్యుడు. పుట్టిన ప్రతి ప్రాణీ ఏనాడో ఒకనాడు గిట్ట వలసిందే. ప్రపంచంలో శాశ్వతంగా వుండేది ఏది? ప్రతిదీ నశించవలసిందే! మరణించిన ప్రతి జీవికి తన పూర్వజన్మ సుకృతాన్ని బట్టి "పునర్జన్మ" గలుగుతుందని హిందుమత వేదాంతులంటున్నారు. "చనిపోయిన ప్రతి ప్రాణీ కర్మ ఫలితాన్ని బట్టి మరల జన్మమెత్తేటప్పుడు "పితృలోకం" ఎలా ఉంటుంది ? చనిపోయిన వారికి "పిండాలు" ఎలా చేరతాయి ?" అని ప్రశ్నించారు రామస్వామి గారు ఉదర పోషణార్థం కొందరు స్వార్థ పరులు ఈ విధానాన్ని సృష్టించారని చౌదరి గారు భావించారు.

తే. 'చచ్చిపోయిన వెంటనే జన్మమెత్తు
జీవి కుడువఁగర్మ మటంచుఁ జెప్పుచుండుఁ
రట్టులైనచోఁ బితృలోక మెట్లువచ్చుఁ
గుటిలజన సృష్టిగాదొకో కుప్పసామి'.

తే. చచ్చిపోయిన వానికే సరణిఁ జేరఁ
గలవు పిండములు నివాపజలము కూడ
నావులును భోక్తలును దృప్తులగుట కొఱకు
గూర్చి పెట్టిరి గాకేమి కుప్పసామి'.

అప్పట్లో అమలులోవున్న సాంఘిక దురాచారాలనూ, మూఢ నమ్మకాలనూ, మతం పేరుతోనూ, దైవం పేరుతోనూ జరుగుతున్న అత్యాచారాలనూ నిర్భయంగా దూయబట్టారు చౌదరి గారు.

రామస్వామి గారు సృష్టించిన సాహిత్యం సమాజంలో పతనమై పోయిన నైతిక విలువల్ని పునరుజ్జీవింప జేసిందని ఈనాటి సాహితీ వేత్తలందరూ అంగీకరిస్తున్నారు.

మానవునికి ఎన్ని సుగుణాలుంటే మాత్రం ఏమి లాభం ? ''నీతి'' ఒక్కటి లేకపోతే మిగిలినవన్నీ బూడిదలో పోసిన పన్నీరు గదా ! అందు చేత మానవులను నీతి, నియమాలతో బ్రతుక వలసిందిగా ఉద్బోధించారు కవిరాజు గారు.

ఆ. 'ఎన్ని రసములున్న నేమి రుచించును
నుప్పులేని కూర చప్పనగుచుఁ
కోటి గుణములున్నఁ గొఱగావు నీతి యొ
క్కండులేకయున్నఁ గుప్పసామి.

ఆ. నీతిలేనివాని నిరసించు జగమెల్ల
నీతిశాలి కెపుడు నెగడు లేదు
నీతిశాలినెపుడు నీతియే కాపాడు
గుజనుబారినుండి కుప్పసామి'.

ఈ శతకాన్ని ఆరంభంనుండీ అంతవరకూ కమ్మని శైలిలో నడిపించారు కవిరాజు గారు. ఇందులోని పద్యాలన్నీ పసిడి తునకలే గనుక యిలా చెప్పుకొంటూ పోవడమే జరిగితే, అందులోని పద్యాలన్నింటినీ ఉటంకించవలసి ఉంటుంది. ప్రభుత్వంవారి పాఠ్యగ్రంథాలలో ఈ శతకం లోని కొన్ని పద్యాలను ప్రచురిస్తే విద్యార్థులకు ప్రయోజనకారిగా ఉంటుంది.

# ధూర్తమానవా!

కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు ప్రారంభించి అసంపూర్తిగా ఆపివేసిన మరో శతకం "ధూర్త మానవా". ఈ మకుటంతోనే ఇందులోని పద్యాలు సమవృత్తాలుగా రచించబడ్డాయి. ఈ పుస్తకం ప్రకటించి నప్పుడు ఆంధ్ర విద్వల్లోకంలో మరో పెనుతుఫాను చెలరేగింది శక్తివంతమైన భాష మహాశక్తి వంతమైన భావం వీటి సమ్మేళనమే ఈ "ధూర్త మానవా" శతకం. కవిరాజు ఆకస్మాత్తుగా మరణించినందువల్ల ఇది అర్థ శతకంగానే నిల్చిపోయింది. దీని ప్రథమ ముద్రణ 1942 సం. సెప్టెంబరులో జరిగింది. సర్వసాధారంగా అన్ని శతకాలలోనూ మానవులకు జరుగుతున్న అన్యాయాలనూ, అధర్మాలనూ తమ ఇష్టదైవానికి నివేదించుకోవడం ఇతివృత్తంగా ఉండటం కద్దు. కాని ఈ శతకంలోని చిత్రమేమిటంటే— మానవుడే మకుటధారియైన ప్రపంచంలో భగవంతుడే కవిరాజుగారికి కలలో కనిపించి, తన పేరిట భూసురవర్గం సమాజంలోని ఇతర వర్గాలకు చేస్తున్న అన్యాయాలను గురించి విన్నవించు కొంటాడు. ఈ శతకం చదివితే ఇతర జాతులను బానిసత్వంలో శాశ్వతంగా వుంచడానికి భగవంతుణ్ణి, స్వర్గ-నరకాలనూ భూసురులు తమ సౌఖ్య సౌభాగ్యాల కోసం సృష్టించారనేది స్పష్టమౌతుంది. ఎత్తుకోలులోనే భగవంతుని చేత పిడుగుల వర్షం కురిపించారు కవిరాజుగారు. భగవంతుడు ఏమంటున్నాడో చూడండి.

ఉ. 'ఏఁబది నాల్గు లోకముల సృష్టియొనర్చుచుఁ బెంచి పిమ్మటన్
దూఁబవలెన్ హరింతునని దొంగనుడుల్ వచియింపుచుంటివే?
యేఁబది మాటలేమిటికి? ఇట్టి ప్రచారము మానకున్నచో
గూఁబలుసాగఁగఁ దీసెదను గూయకు మిట్టివి ధూర్తమానవా!

భగవంతుడు పద్నాలుగు లోకాలనూ (మూడో - ఏడో - పద్నాలుగో - ఖచ్చితంగా చెప్పలేం) సృష్టించాడంటున్న నోటితోనే, ఆయన భువన భువనాలకూ కర్త అన్ననోటితోనే ఆయనకు ప్రతి సంవత్సరం పెండ్లి జేయటానికి చందా లివ్వమని ఆడగడం మనకందరకూ తెలుసు. సకల చరాచర సృష్టికి కారణభూతుడైన ఆ మహావ్యక్తికి పెళ్ళిచేసుకొనే తాహత్తు లేదా? అలాంటి శక్తిలేదని శంకించుతున్న మానవుని గూర్చి భగవంతుడు యిలా అంటున్నాడు :

ఉ, 'ఈ టకటొంకులేమిటికి? నిల్లును వాకిలిఁ గట్టిపెట్టి యే
చేటను బెండ్లి సేయుమని యేనెపుడైనను గోరి యుంటినే?
చీటికి మాటికిన్ బరుల జేబులు గొట్టుట ధర్మ మార్గమే?
ఏటికి నీయబద్ధ మరరే! యిఁకసాగునె? ధూర్త మానవా!

మ. గుడులున్ గోపురముల్ కుశీలవుఁడవై కూర్పించి చందాలతో
మడి మాన్యంబులు నాదు పేరుననె నిర్మాణంబు గావించుచున్
వడ పప్పున్ బెరవారి కిచ్చెదవె! నీ భావంబు నందేమి గీ
ల్పడఁగానేర్చెడి? చెప్పు మింతటి దివాలాఖోరువే మానవా!'

మన స్వభావాలను బట్టే మన 'సృజన శక్తి' కూడా ఉంటుంది. స్వభావానికి భిన్నమైన సృష్టి మనవల్ల కాదు. మానవుడు భగవంతుని సృష్టించటమే కాకుండా, మానవుని లంపటత్వమంతా అంట గట్టినందులకు భగవంతుడు యిలా అంటున్నాడు :

ఉ. 'కాపురముండనిల్లుఁ నడ కత్తెరలోఁ బడియుండఁ బెండ్లమున్,
మాపులు కున్కఁగాఁ బడక మంచము, నెక్కఁగ నెక్కిరింతలున్.
సోపడఁ బైడి కంచమును జక్కగఁ గూర్చి, యుపన్యసింతువే?
నీపనిఁ బట్టెదన్ విసుము నీ విది మానవ ధూర్త మానవా!

ఉ. బొక్కెడు కూడు పట్టుమని పొట్టకు తింటినె యొక్కపూటయేన్?
జక్కక నొంటినిండ నొక జానెడు గుడ్డను గప్పుకొంటినే?
ఒక్కటి యేని ముచ్చిలిక యుంచితివే? యిక నీదుపాటు లే
నక్కయుఁ గుక్కయున్ బడదు; నావలుకుల్ విను ధూర్త మానవా'!

దుష్ట శిక్షణకు, శిష్టరక్షణకు భగవానుడు అనేక అవతారాల నెత్త వలసివచ్చిందని పురాణాలు ఘోషిస్తున్నాయి. ఇవే దశావతారాలు. పూర్వ మెపుడో నాలుగు వేదాలనూ సోమకుడనే వాడు హరించాడని అప్పుడు భగవానుడు సొఅచేవ రూపమెత్తి వాటిని రక్షించాడని చెబుతున్నారు. అందులకు భగవానుడు యిలా అంటున్నాడు.

ఉ. [1]"వేదము లెట్లు బ్రహ్మముఖ వీథులనుండి హరింపగాఁ బడున్
పాదలి సోమకాసురుడు వచ్చిత్రయిన్ హరియించె నంచు నే
చీదరఁ బొందకుండ చొరచేపను జేసితివే సనున్-సరే?
నీదయ మీద నాబ్రతుకు నిల్చెనె చెప్పుమ ధూర్త మానవా!

ఆర్య, అనార్య తెగల మధ్య జరిగిన పోరాటాలను ద్రోహులు తమ స్వార్థానికి బాగా ఉపయోగించుకొన్నారు. ఆర్యులను దేవతలుగా కీర్తించారు. అనార్యులను రాక్షసులని దూషించారు. మహాభాగవతం అష్టమ స్కంధం లోని "బలిచక్రవర్తిగాథ"ను ఇందుకు నిదర్శనంగా చూపవచ్చు.

బలి చక్రవర్తి కీర్తిని జూచి ఆర్యులకు కన్నుగుట్టి, ఒక "పొట్టి తింగణా"ను పంపించి, అతనిచేత మూడడుగుల దాన్నాని గ్రహించి, అతనిని పాతాళలోకాని కణగ ద్రొక్కించారనే గాథను గూర్చి భగవంతుడు యిలా అంటున్నాడు.

1. మత్స్యావతారము.

అప్పట్లో అమలులోవున్న సాంఘిక దురాచారాలనూ, మూఢ నమ్మకాలనూ, మతం పేరుతోనూ, దైవం పేరుతోనూ జరుగుతున్న అత్యాచారాలనూ నిర్భయంగా దూయబట్టారు చౌదరి గారు.

రామస్వామి గారు సృష్టించిన సాహిత్యం సమాజంలో పతనమై పోయిన నైతిక విలువల్ని పునరుజ్జీవింప జేసిందని ఈనాటి సాహితీ వేత్తలందరూ అంగీకరిస్తున్నారు.

మానవునికి ఎన్ని సుగుణాలుంటే మాత్రం ఏమి లాభం ? ''నీతి'' ఒక్కటి లేకపోతే మిగిలినవన్నీ బూడిదలో పోసిన పన్నీరు గదా ! అందు చేత మానవులను నీతి, నియమాలతో బ్రతుక వలసిందిగా ఉద్బోధించారు కవిరాజు గారు.

ఆ. 'ఎన్ని రసములున్న నేమి రుచించును
నుప్పులేని కూర చప్పనగుచుఁ
కోటి గుణములున్నఁ గొఱగావు నీతి యొ
క్కొండులేకయున్నఁ గుప్పసామి.

ఆ. నీతిలేనివాని నిరసించు జగమెల్ల
నీతిశాలి కెపుడు నెగడు లేదు
నీతిశాలినెపుడు నీతియే కాపాడు
గుజనుబారినుండి కుప్పసామి'.

ఈ శతకాన్ని ఆరంభంనుండీ అంతవరకూ కమ్మని శైలిలో నడిపించారు కవిరాజు గారు. ఇందులోని పద్యాలన్నీ పసిడి తునకలే గనుక యిలా చెప్పుకొంటూ పోవడమే జరిగితే, అందులోని పద్యాలన్నింటినీ ఉటంకించవలసి ఉంటుంది. ప్రభుత్వంవారి పాఠ్యగ్రంథాలలో ఈ శతకం లోని కొన్ని పద్యాలను ప్రచురిస్తే విద్యార్థులకు ప్రయోజనకారిగా ఉంటుంది.

# ధూర్తమానవా!

కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు ప్రారంభించి అసంపూర్తిగా ఆపివేసిన మరో శతకం "ధూర్త మానవా". ఈ మకుటంతోనే ఇందులోని పద్యాలు సమవృత్తాలుగా రచించబడ్డాయి. ఈ పుస్తకం ప్రకటించినప్పుడు ఆంధ్ర విద్వల్లోకంలో మరో పెనుతుఫాను చెలరేగింది శక్తివంతమైన భాష మహాశక్తి వంతమైన భావం వీటి సమ్మేళనమే ఈ "ధూర్త మానవా" శతకం. కవిరాజు ఆకస్మాత్తుగా మరణించినందువల్ల ఇది అర్థ శతకంగానే నిల్చిపోయింది. దీని ప్రథమ ముద్రణ 1943 సం. సెప్టెంబరులో జరిగింది. సర్వసాధారంగా అన్ని శతకాలలోనూ మానవులకు జరుగుతున్న అన్యాయాలనూ, అధర్మాలనూ తమ ఇష్టదైవానికి నివేదించుకోవడం ఇతివృత్తంగా ఉండటం కద్దు. కాని ఈ శతకంలోని చిత్రమేమిటంటే— మానవుడే మకుటధారియైన ప్రపంచంలో భగవంతుడే కవిరాజుగారికి కలలో కనిపించి, తన పేరిట భూసురవర్గం సమాజంలోని ఇతర వర్గాలకు చేస్తున్న అన్యాయాలను గురించి విన్నవించు కొంటాడు. ఈ శతకం చదివితే ఇతర జాతులను బానిసత్వంలో శాశ్వతంగా వుంచడానికి భగవంతుణ్ణి, స్వర్గ-నరకాలనూ భూసురులు తమ సౌఖ్య సౌభాగ్యాల కోసం సృష్టించారనేది స్పష్టమౌతుంది. ఎత్తుకోలులోనే భగవంతుని చేత పిడుగుల వర్షం కురిపించారు కవిరాజుగారు. భగవంతుడు ఏమంటున్నాడో చూడండి.

ఉ. 'ఏఁబది నాల్గు లోకముల సృష్టియొనర్చుచుఁ బెంచి పిమ్మటన్
దూబవలెన్ హరింతునని దొంగనుడుల్ వచియించుచుంటివే?
యేఁబది మాటలేమిటికి? ఇట్టి ప్రచారము మానకున్నచో
గూబలుసాగఁగఁ దీసెదను గూయకు మిట్టివి ధూర్తమానవా!

భగవంతుడు పద్నాలుగు లోకాలనూ (మూడో - ఏడో - పద్నాలుగో - ఖచ్చితంగా చెప్పలేం) సృష్టించాడంటున్న నోటితోనే, ఆయన భువన భువనాలకూ కర్త అన్ననోటితోనే ఆయనకు ప్రతి సంవత్సరం పెండ్లి జేయటానికి చందా లివ్వమని ఆడగడం మనకందరకూ తెలుసు. సకల చరాచర సృష్టికి కారణభూతుడైన ఆ మహావ్యక్తికి పెళ్ళిచేసుకొనే తాహత్తు లేదా? అలాంటి శక్తిలేదని శంకించుతున్న మానవుని గూర్చి భగవంతుడు యిలా అంటున్నాడు :

ఉ, 'ఈ టకటొంకులేమిటికి? నిల్లును వాకిలిఁ గట్టిపెట్టి యే
టేటను బెండ్లి సేయుమని యేనెపుడైనను గోరి యుంటినే?
చీటికి మాటికిన్ బరుల జేబులు గొట్టుట ధర్మ మార్గమే?
ఏటికి నీయబద్ధ మరరే! యిఁకసాగునె? ధూర్త మానవా !

మ. గుడులున్ గోపురముల్ కుశీలవుఁడవై కూర్పించి చందాలతో
మడి మాన్యంబులు నాదు పేరుననె నిర్మాణంబు గావించుచున్
వడ వప్పున్ బెరవారి కిచ్చెదవె ! నీ భావంబు నందేమి గీ
ల్పడఁగానేర్చెడి? చెప్పు మింతటి దివాలాఖోరువే మానవా!'

మన స్వభావాలను బట్టే మన 'సృజన శక్తి' కూడా ఉంటుంది. స్వభావానికి భిన్నమైన సృష్టి మనవల్ల కాదు. మానవుడు భగవంతుని సృష్టించటమే కాకుండా, మానవుని లంపటత్వమంతా అంట గట్టినందులకు భగవంతుడు యిలా అంటున్నాడు :

డ. 'కాపురముండనిల్లుఁ నడ కత్తెరలోఁ బడియుండఁ బెండ్లమున్,
మాపులు కుక్కఁగాఁ బడక మంచము, నెక్కఁగ నెక్కిరింతలున్,
సొపడఁ బైడి కంచమును జక్కఁగఁ గూర్చి, యుపన్యసింతువే?
నీపనిఁ బట్టెదన్ వినుము నీ విది మానవ ధూర్త మానవా !

ఉ. బొక్కెడు కూడు పట్టుమని పొట్టకు తింటినె యొక్కపూటయేన్?
జక్కక నోంటినిండ నొక జానెడు గుడ్డను గప్పుకొంటినే?
ఒక్కటి యేని ముచ్చిలిక యుంచితివే? యిఁక నీదుపాటు లే
నక్కయుఁ గుక్కయున్ బడదు; నాపలుకుల్ విను ధూర్త మానవా'!

దుష్ట శిక్షణకు, శిష్టరక్షణకు భగవానుడు అనేక అవతారాల నెత్త వలసివచ్చిందని పురాణాలు ఘోషిస్తున్నాయి. ఇవే దశావతారాలు. పూర్వ మెపుడో నాలుగు వేదాలనూ సోమకుడనే వాడు హరించాడని అప్పుడు భగవానుడు సొఱచేప రూపమెత్తి వాటిని రక్షించాడని చెబుతున్నారు. అందులకు భగవానుడు యిలా అంటున్నాడు.

ఉ. [1]'వేదము లెట్లు బ్రహ్మముఖ వీథులనుండి హరింపగాఁ బడున్
పాదలి సోమకాసుఁరుడు వచ్చిత్రయిన్ హరియించె నంచు నే
చీదరఁ బొందకుండ చొరచేపను జేసితివే ననున్-సరే?
నీదయ మీద నాబ్రతుకు నిల్చెనె చెప్పుమ ధూర్త మానవా!

ఆర్య, అనార్య తెగల మధ్య జరిగిన పోరాటాలను ద్రోహులు తమ స్వార్థానికి బాగా ఉపయోగించుకొన్నారు. ఆర్యులను దేవతలుగా కీర్తించారు. అనార్యులను రాక్షసులని దూషించారు. మహాభాగవతం అష్టమ స్కంధం లోని ''బలిచక్రవర్తిగాథ'ను ఇందుకు నిదర్శనంగా చూపవచ్చు.

బలి చక్రవర్తి కీర్తిని జూచి ఆర్యులకు కన్నుగుట్టి, ఒక ''పొట్టి తింగణా''ను పంపించి, అతనిచేత మూడడుగుల దాన్నాని గ్రహించి, అతనిని పాతాళలోకాని కణగ ద్రొక్కించారనే గాథను గూర్చి భగవంతుడు యిలా అంటున్నాడు.

1. మత్స్యావతారము.

మ. 'బలి యే పాపముఁ జేసినాఁడతనిపై వైరంబు నాకేల? త
ద్బలి రాజ్యంబు హరింప వంచకుఁడనై ధర్మంబుఁ బోద్రోసి దో
ర్బలహీనుండగు నింద్రుఁ బ్రోవ నవతారంబెత్తి నానంచు లో
కులు నమ్మన్ వచియింతు వింకయిన బొంకుల్ మానవా? మానవా!

చ. పరులను, ధర్మ దూరులను, బంధుర పాపనిమగ్న చిత్తులన్
కరుణను గాచి ప్రోచుటకుఁ గాముకితో బలి చక్రవర్తినిన్
దిరిపెము నెత్తినాఁడనని దేబిరిగొట్టు మొగంబ. యెల్లడన్
నిరతము చాటుచుండెదవె? నీ పనిఁ బట్టెద ధూర్త మానవా!

మ. తను వెల్లన్ గులపెట్టి జీర్ణసుఖ రుగ్ద్రుద్వ్యథాపీడచే
త నహోరాత్రులు కామతృప్తికొఱకై దారాడు స్వర్లోక నా
థుని పక్షంబయి దానశీలుని మహత్పూజ్యున్ సత్యవా
క్యు నిరూఢున్ బొరియించి నాననుచు 'పల్కన్ జూతువే మానవా!

అనార్య జాతికి చెందిన రాజ కుటుంబాలు స్వతంత్రంగా మనటాన్ని ఆర్యులు చూడలేక పోయారు అలా స్వతంత్రంగా ఉంటున్న రాజ కుటుంబాలను అనేక కుట్రలు పన్ని, సర్వనాశనం చేశారు. ఇందులకు పరశురాముణ్ణి ఉదాహరణగా పేర్కొనవచ్చు. స్వతంత్ర రాజకుటుంబాల నిర్మూలనానికి ఆర్యులు చూపే కారణం-అర్థరహితమయింది. జమదగ్ని మరణాన్ని ఆసరా చేసుకొని, ఈ దారుణ హింసాకాండ జరుపబడింది. ఆర్యులు పరశురాముణ్ణి ఈ హత్యలు చేయమని ప్రోత్సహించారు. ఈ హంతకుడు-శిక్షింపబడలేదు సరిగదా-దశావతారాలలో — ఒక అవతారంగా చిత్రించినందులకు భగవంతుడు యిలా అంటున్నాడు.

ఉ. 'ఒక్కఁడు తండ్రి జంపెనని యోరిమిలేకయె గండ్ర గొడ్డటన్
జక్కడగింప ధర్మవగు నా కులమంతయు ? దీని జేయ నే
నొక్కఁడనే కనంబడితి నో! యిటువంటివి పూర్వమందు నే
దిక్కుల నేని విన్పడెనె? తిక్క వదల్చెద ధూర్త మానవా?'

ఇక, శ్రీరామచంద్రుని దగ్గరకొచ్చేసరికి ఆర్యజాతి విజృంభణ పెచ్చరిల్లింది. అతడు ఆర్యేతరుడైనప్పటికీ ఆర్యుల చేతుల్లోని కీలుబొమ్మ అయ్యాడు ఆర్యమునులకు శ్రీరాముని నిజతత్వం తెలుసు. అందుచేత వారు శ్రీరాముని "మాయామానుష విగ్రహుడు" అని వర్ణించారు రామాయణమును సవిమర్శకంగా చదివిన రామస్వామి గారు "సామన్య మానవునిలోవున్న లక్షణాలన్నీ శ్రీ రామచంద్రునిలో ఉన్నాయి" అన్నారు. రామావతారాన్ని గురించి భగవంతుడు యిలా అంటున్నాడు.

చం. 'ఉడుగక తొల్లి పెండ్లమును నొక్కతె నా మెడకంటఁ గట్టి యా
బిడ నెవడో హరించెనని వెంగలి మాటలు చెప్పి యామెకై
యెడతెగకుండ బావురని యేడ్చితి నంచును నెన్ని రోజులో
బడబడ పెద్ద గ్రంథములు వ్రాసితివేమిర? ధూర్త మానవా !

శ్రీకృష్ణుని శ్రీమహావిష్ణువు అవతారంగా భావించి హిందువులు పూజిస్తున్నారు. శ్రీకృష్ణుని కాలంలో ఆయనొక గొప్ప తత్వవేత్త : రాజకీయ నాయకుడు. అతడు లేకపోయినట్లయితే మహాభారతయుద్ధం జరిగి ఉండేదికాదు. భాగవతంలో శ్రీకృష్ణుడు వ్యభిచారిగా వర్ణించబడ్డాడు. అందుకు భగవానుడు యిలా అంటున్నాడు.

మ. 'మిడి మేలంబుగఁ దెచ్చి పెట్టితివిగా మేనత్తతో గూటమిన్
బడి ముప్పంకల ముండతోడ మధురాపట్నంబులోఁ గూటమిన్
మెడకుంగట్టితి వెంతవాదవుర? నీ మిట్టాటలన్ మానవా?
కడికండల్ తెగఁ గోసివైచెదను గాక శ్రేణికిన్ మానవా?'

అప్పటి వరకూ దశావతారాలను గురించి ప్రచారంలోనున్న భ్రమలను ఈ పుస్తకం తొలగించి వేసింది. సర్వశక్తివంతుడైన భగవంతుడు ఇన్ని అవతారాలను ఎందుకెత్తవలసి వచ్చింది ? ఇన్ని అవతారాల నెత్తకుండా తాను చేయాలనుకొన్నది చేయలేడా ? అలాంటి శక్తి లేదని తలంచిన మానవునిగూర్చి కోపోద్దీపితుడైన భగవంతుడు యిలా అంటున్నాడు.

మ. 'అవతారంబులనెత్తి చేయఁగల నన్యాయంబు లన్నింటి నే
నవతారంబుల నెత్తకుండ మఱి చేయన్ శక్తి లేదంచు న
న్నవమానించితి వింతకాలముఁటు? నిన్నాపాద మస్తంబుగా
నిపురుంజేసెద నెవ్వరడ్డ పడగా నీ కుండిరో మానవా!'

మానవుడు సమస్త పాపాలు చేసినప్పటికీ ఒక్కసారి భగవన్నామం జపిస్తూ పూజచేస్తే, అవన్నీ హరిస్తాయన్న బూటకాన్ని కవిరాజుగారు ఖండించారు.

చం. 'త్వరపడకుండ సంజపడు దాఁకను తప్పుపనుల్ బొనర్చి పై
బొదుగున నున్న తోఁటలను బూవుల ముచ్చిలి కోసితెచ్చి నా
శిరమునఁ బోసినంతటనె చేసిన పాపము లొక్కసారిగా
మఱచెదునట్టి వెంగలినె మానవ యిట్టివి ధూర్త మానవా!

చం. మరణపు శయ్యమీఁద నొకమారయినన్ నను దప్పకుండ సం
స్మరణము చేసినంతటనె స్వర్గము వచ్చునటంచు; వేగతిన్
దొరయును? నిన్నెపై నీవెపుడు బొంకుచు నుందువు దీనికై నినున్
గఱగఱ గొంతు కోసెదను కానివి చెప్పకు ధూర్త మానవా!'

మత, వర్ణ, వర్గ విభేదాలతో గూడిన సాంఘిక వ్యవస్థంటే చౌదరి గారికి పరమ అసహ్యం వేసింది. మత వ్యవస్థలో మహాకుట్రవున్నదని

రు భావించారు. వాల్టేరు కూడా "Religion is what the first rogue
ught to the first fool" అన్నాడు. అందుచేత మతం మానవుల మధ్య
షమ్యం కలిగించి అనైక్యతకు దారి తీస్తుందని చౌదరి గారి అభిప్రాయం.
వర్ణ విశ్వాసాల జనుల దృష్టిలో అస్పృశ్యుడు మానవుడుగానే పరిగ
ంచబడడు. రామస్వామి గారి దృష్టిలో అస్పృశ్యునకును, ఇతర
నవులకును ఎట్టి వ్యత్యాసం లేదు. అస్పృడొక్కడే అపవిత్రుడని, అతణ్ణి
కితే మైల పడ్తారని అగ్రజాతి అనడం రామస్వామి గారి హృదయంలో
ధాగ్నిని రగుల్కొల్పింది. అందుచేత మత, వర్ణ, వర్గ విధానం గల
ంఘిక వ్యవస్థ మీద చౌదరి గారు విప్లవ ధ్వజమెత్తిన మాట వాస్తవమే!
910 సం. లోనే రామస్వామిగారు అస్పృశ్యతను తీవ్రంగా ఖండించారు.
గలూరులో హరిజనులను విద్యాలయ ప్రవేశం చేయించారు. తరువాత
32 సం లో గాంధీగారు హరిజనోద్యమాన్ని ప్రారంభించారు. ఏనాడో
రిగారు కుల, మత ప్రసక్తి జాతీయ సమైక్యతకు భంగకరమని, కుల,
వివక్షతలు లేని సర్వమానవ సౌభ్రాతృత్వంగల సమతారాజ్యం
ప్రదాలన్నారు. దానినే ఈనాటి రాజకీయ వాదులు పదేపదే చాటుతున్నారు.
, మత వ్యవస్థను దూయబడుతూ ఆనాడు చౌదరి గారు వ్రాసిన
్యాలను చూడండి.

ఉ. 'ఒరొక జాతి కూడు భుజియించుచు నిక్కలి తక్కుజాతులన్
హీనములుగాగ జూతునని యెవ్వరు సెప్పిరి నీకు వంచకా!
మానవులందఱున్ సరిసమానులుగారొకొ నాకు? మాయురే!
మానక నీవు యిట్టి యపమానముఁ జేతువె ధూర్త మానవా!

విశాలాంధ్ర - 17-1-1961.

చం. పసులను, జెట్టిచేమలను బక్షితతిన్, గ్రిమికీటకావలన్
బుసుకున దాకినంతఁదలపోయవు స్నానము మాట; కాని, మా
నిసి నిను దాకినంతఁ దలనిండుగ స్నానము ధర్మ మార్గమే!
ముసిముసి నవ్వు నవ్వెదవు మోరెగఁబట్టుక ధూర్త మానవా!'

రామస్వామి చౌదరి గారు మున్సిపల్ చైర్మన్‌గా పోటీ చేస్తున్న రోజుల్లో మాట :

"ఎలక్షన్ల ప్రచారం ముమ్మరంగా సాగుతోంది. రామస్వామి చౌదరి గారికి ప్రత్యర్థిగా నిలిచినవారు ఉపద్రష్ట వెంట్రామయ్యగారు. "ఆంధ్రరత్న భవన్" అనే ప్రముఖ కాఫీ హోటల్‌కు ఈయన ప్రొప్రయిటర్.

చౌదరి గారు నాస్తికులు. వెంకట్రామయ్యగారు ఆస్తికులు ఈ ఇద్దరు ఎలక్షన్ మీటింగులలో ఒకరినొకరు దుమ్మెత్తిపోసుకొనేవారు. అతి తీవ్రమైన వాగ్యుద్ధాలు, నిందారోపణలు, ఎత్తిపొడుపులు, విమర్శలు జరిగేవి. పేట పేటకీ, వీధివీధికీ ఒకరికెదురుగా ఒకరు ముమ్మరంగా మీటింగులు పెట్టే వారు. పొరపాటున ఈ ఇద్దరూ ఒకరికొకరు ఒకేచోట తటస్థపడితే ఏ కొట్లా టలు జరుగుతాయో, ముష్టియుద్ధాలే జరుగుతాయో అనేటంతగా జనం భయపడి పోతూండేవారు.

పట్నానికి ఒక చివరనున్న "సూతాశ్రమం" లో చౌదరి గారుండే వారు. ప్రొద్దుటే ఐదు గంటలకు ఆయన లేచి, కాలినడకన బయలుదేరి వచ్చి, తిన్నగా తన "ప్రత్యర్థి" గారి కాఫీ హోటల్లోనే కాఫీ త్రాగడం ఆయన అలవాటు. ఆయన్ను వాకిట్లో చూడగానే "కాష్"లో కూర్చున్న ఈ ప్రొప్రైటర్ గారు సడెన్‌గా లేచి లోపలికెళ్ళిపోయేవారు. చౌదరి గారు మామూలుగా కూర్చునే స్థలం ఒకటి మూలగా ప్రత్యేకంగా వుండేది. ఆయన

1. ఆంధ్రజ్యోతి-వారపత్రిక-19-8-83 శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావు

వచ్చేముందు అక్కడ ఎవరైనా కూర్చునివుంటే, ఆయన రాగానే లేచి, ఖాళీచేసి ఇచ్చేవారు.

ఆంధ్రులంతా ఎంతో ఇష్టపడే పెసరట్టంటే చౌదరి గారికి కూడా ప్రాణం. జీలకర్ర, అల్లంముక్కలు, ఉల్లి పాయలు, పచ్చిమిరప కాయ ముక్కలు వేసి నేతితో కాల్చిన పెసరట్లు వారికెంతో ఇష్టమని ఈ ప్రొప్రైటర్ గారికి కూడా తెలుసు. అందుకే ఆయన సరాసరి వంటింట్లోకి వెళ్ళేవాడు. స్వయంగా ఆ నేతి పెసరట్లు తానే వేసేవారు. సర్వర్‌ను పిలిచి వాటిని "చౌదరి గారికి ఇచ్చిరా" అని ఆర్డర్ వేసేవారు. వంటింట్లోపొయ్యి దగ్గర తనున్న చోటునుంచి చౌదరి గారు కూర్చున్న సీటు కనిపిస్తుంటుంది. తను పంపిన ఆ పెసరట్లను చౌదరి గారు ఎంత అప్యాయంగా తింటున్నారో చూస్తూ ఆనందించడం ఆయనకు అలవాటు. అలాగే కాఫీ కూడా స్వయంగా కలిపి సర్వర్‌తో పంపేవారు. చౌదరి గారు దాన్ని పూర్తి చేసేలోగా తిరిగి తన కాష్‌లోనికి వచ్చి కూర్చునేవారు. న్యాయంగా ఈ తిన్న దానికి చౌదరి గారు బిల్లు ఇవ్వాలి గదా! అయన లేచి వెళ్ళిపోతూ ప్రొప్రైటర్ వైపు చూడనైనా చూడకుండా మరోవైపు తిరిగి "ఖాతాలో రాసుకో" అనేవారు. ఈ ప్రొప్రయిటర్ ఇంకోవైపు తిరిగి "ఖాతాలో ఎవుడైనా జమ అంటూ వుంటేగదా! రాసుకోడానికి" అనేవారు. చౌదరి గారు మాట్లాడకుండా వెళ్ళిపోయేవారు. అంటే ఆయన ఇచ్చేదీ, ఈయన పుచ్చుకొనేదీ వుండేదికాదు. ఒకవేళ ఆయన పొరపాటున ఇచ్చినా, ఈయన తీసికొని వుండేవారు కాదేమో? ఎందుకంటే, చౌదరి గారు తన హోటల్‌కు వచ్చి కాఫీ త్రాగటమే తనకు, తన హోటల్‌కు ఎంతో గౌరవమని తలచేవారాయన. "ఏమండీ విచిత్రం?" అనిగాని ఎవరైనా అడిగితే "మాకు లక్ష అభిప్రాయభేదాలుండవచ్చు, కాని, అంతటి మహా మనీషిని నే నింతవరకు చూడలేదయ్యా! నిస్వార్థమైన త్యాగమూర్తి, సేవాతత్పరుడు" అనేవారు వెంకట్రామయ్యగారు.

మానవత్వానికి నిర్వచనం ఇంతంటే మరొకటేముంటుంది ? మనిషికి మనిషికి మధ్యనున్న ఆకాస్త అడ్డు తొలగించుకోగలిగితే మనకు ఎదుటి మనిషిలో ఉండే గొప్పతనం కనిపిస్తుంది ఈ విషయాలు విన్నప్పుడు నాకు ఒళ్ళు పులకరించింది. అనిర్వచనీయమైన ఆ అనుభూతి ఎప్పుడూ మరచి పోలేనిది !''

శతక వాఙ్మయం సాధించవలసిందేమిటో, ఎలా సాధించాలో, చౌదరిగారి ''కుప్పుసామి శతకం'', ''ధూర్తమానవా'' శతకాలు చాటుతున్నాయి.

వీరు ''గోపాలరాయ'' అన్న మకుటంతో మరో శతకం కూడా వ్రాశారు. ఇందులో శ్రీకృష్ణుని గూర్చి వ్యంగ్యంగా చెప్పిన 26 పద్యాలు ఉన్నాయి. వ్రాతప్రతి కనిపించటంలేదు.

చదలవాడ వాస్తవ్యులు శ్రీ సజ్జా వీరయ్యగారి సహాయం వలన రెండు పద్యాలను మాత్రం సేకరించగలిగాను. అందులో రెండవ పద్యం అసంపూర్ణంగానే ఉంది. పాఠకుల సౌకర్యార్థం ఆ పద్యాలను ఇక్కడ పొందు పరుస్తున్నాను.

సీ. తగవుఁదీర్చెద నంచు ధర్మ పన్నముఁ జెప్పి
యైనవారి కుటుంబమార్పి నావు,
తిట్టినాడని చెప్పి దీర్ఘ రోషమ్మున
మేనత్త కొడుకును ద్రుంగినావు,
దయతోడ తల్లిని దండింప కుండిన
మేనమామను పట్టి మెసవినావు,
సరిగావు నా సహోదరిని ముట్ట దగవన్న
బావజుట్టు గొరిగి పంపినావు.

గీ. ఇట్టి తుచ్ఛుడ వీవు గాబట్టి గాదె
గాడిద యెగిరి నిన్ను పండ్లూడఁ దన్నె
కట్టుకొన్నది నెత్తిపై కాలుబెట్టె
పనికి మాలిన ఓరి గోపాలరాయ !

సీ. పిన్న పెద్దలు నవ్వ కన్న తల్లికినీవు
కడుపు దింపించిన ఘనుడవయ్య,
ఎల్లప్పుడును కల్లునే త్రావుచుండెడి
పాలసుడే నీకు భ్రాత యయ్యె,
ఇంటికి వచ్చిన ఋషి పుంగవుని తగు
ల్కొని పోయెనయ్యొ నీ యనుజ యయ్యొ,
పనికి మాలిన ఓరి గోపాలరాయ !

రచన అంతా లభించి వుంటే ఎంత బాగుండేదో !

ఇదే విధంగా ''చెన్నకేశవా'' మకుటంతో మరో శతకాన్ని కూడా చౌదరిగారు వ్రాశారు. జ్ఞాపకంలోవున్న పద్యాలు రెండు మాత్రమే ఇక్కడ ఉదహరిస్తున్నాను :

చం. నిరుపమ వీరవైష్ణవుడు నీ ప్రియ భక్తుడు వాలచంద్రు డొ
క్కరుడయి పోరఁ గూలునెడ గన్గొని యూరక యున్న నీవు మ
మ్మరసి కటాక్ష వీక్షణ సమాదరణమ్మున జూతు వన్న యే
కరణిని మాకు నమ్మకము గల్గునొ చెప్పవె చెన్నకేశవా !

తే. దూర భారంబనక మేము తొట్రుపడుచు
వచ్చినారము నినుజూచు వాంఛతోడ
చెన్నకేశవా కోరము చిల్లిగవ్వ
చిత్తశుద్ధి మాత్రము దయచేసి పంపు.

# వి వా హ వి ధి

కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు చిన్న నాటినుండి తాను విశ్వసించిన అభిప్రాయాలను నిర్భయంగానూ, నిరాఘాటంగానూ వెల్లడించేవారు. మానవజీవితంలో వివాహం మహోత్కృష్టమైనది. అందుచేత పెళ్ళి నూరేళ్ళపంట, అని అంటారు. గనుక వివాహ నిర్వహణవిధానంలో వారికిగల కొన్ని అమూల్యమైన అభిప్రాయాలను లోకానికి తెలియజేయాలనే ఉద్దేశంతో "వివాహవిధి" అనే చిన్న పుస్తకాన్ని 1930వ సం.లో ప్రచురించారు.

వివాహ వ్యవస్థను ప్రాతిపదికగా తీసికొని పురోహిత వర్గం, తన పెత్తనాన్ని నిలుపుకొంటూవచ్చింది. "బాపడుచేసిన పెళ్ళే పెళ్ళి, సంస్కృత మంత్రాలే మంత్రాలు" అనే స్థితి దాకా వచ్చింది. ఆనాటి ప్రజలూ అలాగే ఉండేవారు. బ్రాహ్మణ పురోహితుడు, శుభలగ్నాన్ని నిర్ణయించి మంత్ర తంత్రాలతోనూ, బాజా భజంత్రీలతోనూ చేసిందే "వివాహం" అనే మూఢాభిప్రాయం ఉంది. ఇలాంటి సాంఘిక వ్యవస్థను, వివాహ పద్ధతిని, యోగి వేమన తన సహజ నర్మోక్తులద్వారా సంస్కరించడానికి పూనుకొన్న సంగతి లోకవిదితమే.

ఇలాంటి సంస్కరణోద్యమానికి రామస్వామి చౌదరిగారు కూడా కంకణం కట్టుకోవలసి వచ్చింది. వారు హేతువాదంతో ప్రజలను మార్చాలని సంకల్పించారు. పట్టాభిషేకంకోసం వశిష్ఠుడు పెట్టిన ముహూర్తం శ్రీ రామ చంద్రుని వనవాసానికి దారితీసిందని రామస్వామిగారు సోదాహరణంగా వివరించారు. దీనితో ప్రజలలో కొంతవరకు శుభలగ్నం శుభం కలిగిస్తుందనే నమ్మకం పటాపంచలయింది.

ఈ "వివాహవిధి" ఆనాటి నుండి ఈనాటి వరకూ బ్రాహ్మణేతర వర్గాల వారికిది ప్రామాణిక గ్రంథంగా ఉంటూ వచ్చింది. వరునికిగాని వధువుకుగాని అర్థంకాని మంత్రాలు చదివితే లాభమేమిటి ? వారికి తెలియని భాషలో నీతులు బోధించటం ఎందుకోసం ? ధర్మబోధలు, నీతి ఉపదేశాలు, మనిషిని సన్మార్గంలో ఉంచడానికేగాని, వినోదంకోసం కాదు గదా ? అయి నప్పుడు ఆ చెప్పేదేమిటో వారికి తెలియలా వద్దా ? అర్థమే కానప్పుడు మనం చెప్పితే ఫలితమేముంటుంది ?

కాబట్టే కవిరాజు వివాహరంగంలో కూడా సంస్కరణను ప్రవేశ పెట్టారు. సంస్కృత మంత్రాలను తేటతెలుగు మాటల్లోకి మార్చి వేశారు. వధూవరులు, ఆచరించవలసిన విధులను సులభమైన తెనుగులో ప్రవచిం చారు. వారే స్వయంగా నడుం కట్టి .
పెళ్ళిచేయడం – వధూవరుల నుద్దేశించి ఒక ,

ఆచార్యుడు : గీతం

ఎల్లజగముల, నెల్లవేళల, నెల్లచోటుల, నెల్లవా
గానరాకయుఁ గానవచ్చియు, గానవచ్చిరాకయు,
నిండి యుండెడి, దేవదేవుని, నిర్వికల్పుని, నిర్వికారుని భక్తితో
వేడుకొందును, మంచి బుద్ధులు. మంచిసుద్దుల, మంచిప్రోవఁ
మంచిత

కన్యాదాత

నా ప్రేమకు నిలయమైన ఈ కన్య, త్రికరణశుద్ధిగా, నిన్నువరించి, ధర్మార్థ కామ మోక్షప్రయత్నాలలో, నీకు చేదోడుగా వాదోడుగా వుండి, జీవితయాత్ర గడపాలని, అభిలషిస్తున్నది. ఆమె అభీష్టాన్ని, నెరవేర్చ డానికి, మేము ఒప్పిఉన్నారుతున్నాము. కాబట్టి నీవు, ఈమె పాణిగ్రహణం

చేసి, రుజుమార్గం తప్పకుండా, జీవయాత్ర గడుపవలసిందిగా కోరుతున్నాం.

ఆచార్య సూక్తులు

వధూ వరుల్లారా ! నేడు మీరు బ్రహ్మచర్యాన్ని విడిచిపెట్టి, గృహస్థాశ్రమాన్ని స్వీకరించ బోతున్నారు. ఆశ్రమాలన్నిటిలోకీ, గృహస్థాశ్రమం ఉత్తమమైనదేకాక, కష్టతరమైనదని కూడా, మీరు గ్రహించవలసి ఉంది. అతిధి అభ్యాగతులకు మర్యాదలు చేస్తూ గృహస్థ ధర్మాన్ని, చక్కగా నెరవేర్చి, నీతినియమాలు తప్పకుండా, మర్యాదలు జవదాటకుండా, సత్సంతానాన్ని పొంది, దేశ సౌభాగ్యానికి తోడ్పడుదురుగాక !

వరుడు

సౌభాగ్యవతీ ! నా జీవయాత్రలో, నాకు తోడు నీడవలే వుండి, ధర్మార్థ కామమోక్షాలకు, నన్ను ప్రోత్సహిస్తూ, నా సుఖ దుఃఖాలలోనూ, కలిమిలేములలోనూ, భాగస్వామినిగా వుంటూ. సర్వకాలాలోనూ, నాకు తోడ్పడవలసిందిగా కాంక్షిస్తున్నాను.

వధువు

సౌభాగ్య వంతుడా ! మీరు నన్ను కోరిన విధంగా, మనోవాక్కాయ కర్మలతో, ఏ విధమైన వంచనలేకుండా తోడ్పడుతూ, మీ సుఖ దుఃఖాలలోనూ, కలిమిలేములలోనూ సమభాగినై, అవ్యాజంగా సంచరిస్తూ, మీ జీవయాత్ర మిక్కిలి సుకరంగా కొనసాగడానికి ప్రయత్నించడంలో, యే విధంగానూ వెనుకంజ వేయనని ప్రమాణం చేస్తున్నాను.

వరుడు

సౌభాగ్యవతీ : ఈ పెండ్లి పెద్దల సమక్షంలో, నీ పాణిగ్రహణంచేసి నిన్ను ధర్మపత్నిగా స్వీకరిస్తున్నాను. పెద్దలు చెప్పిన విధంగా, నీవు నాకు

అర్థాంగివేకాక, నా అర్థ సర్వస్వమగుదువుగాక ! నీవు, నేను, అనే భేధం లేకుండా, మనం జీవయాత్ర గడుపుదాం.

వధువు

సౌభాగ్యవంతుడా ! మీతో కలిసి జీవయాత్ర సాగించాలని అభిలషించి, ఇదుగో నా పాణిని, మీకు అందిస్తున్నాను. నా జీవితకాలమంతా, స్త్రీ సహజమైన ఓర్మితోనూ, పేర్మితోనూ, మీకు సర్వదా తోత్పడగలను.

వరుడు

సౌభాగ్యవతీ ! శుభప్రదచిహ్నమైన, తాళిబొట్టును నీ మెడయందు నలంకరిస్తున్నాను. ఈనాటి నుండి, నీవు నా దానవయ్యావు. నేను నీ వాడనయ్యాను. మన కుటుంబ పెత్తనం నీ అధీనం చేస్తున్నాను. కుటుంబ గౌరవం, జాతి గౌరవం పెంపొందే విధంగా, ఇకమీదట గృహస్థ ధర్మాన్ని నీవు నెరవేర్చవలెను.

వధువు

సౌభాగ్యవంతుడా ! మీరు, నాయందుంచిన విశ్వాసాన్ని ఎల్లప్పుడూ పెంపొందిస్తూ ఉంటాను. కుటుంబ గౌరవాన్ని, జాతిగౌరవాన్ని, నా నడవడిచే, మరింతగా పెంపొందించి, మీ అభినందనలకు, మాన్యతకు పాత్రురాలను కాగలను.

ఆచార్యుడు

సప్తపది అనగా వరుడు, వధువు కలిసీ, యేడడుగులు నడవాలీ. అన్నం కోసం మొదటి పదం, బలంకోసం రెండవ పదం, ధన పుష్టికోసం మూడవ పదం, సుఖం కోసం నాల్గవ పదం, సంతానం కోసం ఐదవ పదం,

అనుకూల ఋతువులలో అనువర్తినివి కావడంకోసం ఆరవ పదం, అన్యోన్య సఖ్యతకోసం యేడవ పదం వరునితో వధువు వేయాలి.

ఈ సప్తపది నూతన దంపతులు కలిసి-మెలసి, ఒక్కతో కాపురం సాగించడానికి, దేశ సౌభాగ్యం, జాతీయ గౌరవం పెంపొందించడానికి దోహదకారి అవుతుంది.

మంగళ గీతంతో పెళ్ళి సమాప్తమౌతుంది.

ఈ చిన్నపుస్తకం - తెలుగు కుటుంబ జీవితంలో ప్రవేశ పెట్టిన మార్పు అంతా - ఇంతా కాదు. కగుడు గట్టిపోయిన సంఘంలో చైతన్యం కలిగించింది. బ్రాహ్మణ పౌరోహిత్యం లేకుండా వందలాది వివాహాలు జరిగాయి. నేటికి జరుగుతున్నాయి. ఇక ముందుకూడా జరుగుతాయి. ఈ పుస్తకం గావించిన మార్పు కవిరాజుగారినే ఆశ్చర్యచకితులను జేసింది. వారు మూడవ కూర్పు ''తొలిపలుకు''లో యిలా వ్రాశారు. ''నేనీ గ్రంథము రచించునప్పుడు ప్రాజ్ఞులయినను నీ గ్రంథస్థాభిప్రాయములకు సుముఖులుగ నుందురని తలంచనైతి, ఏలయనగా జిరకాలమునుండి ప్రాచీనాచారము సంఘ శరీరమునం జివికి జీర్ణమై గబ్బు కొట్టుచున్నను, తెలియంజాలని, తెలిసియు దెలియని యట్లు నటింప నేర్చిన యీ యాంధ్ర లోకంబు, విప రీతములుగ గన్పట్టు నీ యభిప్రాయములను మన్నింతురని యెట్లు తలం తును? భగవంతునకు నొక్క సంస్కృత భాషయే కాదు కాదు - ఒక్క గీర్వాణ భాషయే చెవికింపు సొంపు నింపునని తలంచు నీ మూఢలోకంబు వివాహ మంత్రములు మాతృ భాషయగు తెలుగున జెప్ప బడునప్పు డూకొట్టుననుట నవకాశమేది? ఎన్ని దోషములున్నను నొక్క లగ్నమున బెండిలి జరిగిన యెడల సర్వ సుభములను సకలైశ్వర్యములును నాయురారోగ్యములును గల్గునని విశ్వసించు పాకృత లోకంబు నా యభిప్రా యములకు మాఱాకుగా నుండునని యెట్లు తలంతును? ''బ్రాహ్మణో

మమదేవతా'' యను వాక్యమునందు నమ్మకముగల మూర్ఖ ప్రపంచంబు బ్రాహ్మణులు కాని వారిచే వివాహ కలాపంబు జరుపబడుటకు నంగీకృతి జూపునని యెట్లనుకొన వీలు కల్గును? కాని యాంధ్ర ప్రపంచమందు విచిత్ర పరిణామము కడు నత్యల్ప కాలములోనే కల్గినది. ఈ పరిణామము నాకే విస్మయము కలిగించు చున్నది''. రామస్వామిగారి వివాహ పద్ధతి అమల్లోకి రావడం వల్ల ముఖ్యంగా మూడు ప్రయోజనాలు గలిగాయి.

ఒకటి : బ్రాహ్మణ పౌరోహిత్యం వల్ల జరిగే దోపిడీ అరికట్ట బడింది.

రెండు : వైవాహికం ద్వారా తమకు సంక్రమించే బాధ్యతలు, విధులు ఏమిటో వధూవరులకు అర్థం కావడం.

మూడు: అట్టే పటాటోపం లేకుండానూ, న్యాయ శాస్త్రానికి భిన్నంగాని పద్ధతిలోనూ, దుర్వ్యయం లేకుండానూ, వివాహాలు జరిపించడం.

ఈ విధంగా రామస్వామి చౌదరిగారు ప్రవేశపెట్టిన మార్పులన్నీ ఒక ఎత్తు, ఇదొక్కటే ఒక ఎత్తు.



# కవిరాజు కవిత - రసరామణీయాలు

రామస్వామి గారి జీవిత విశేషాలనూ, వారు రచించిన గ్రంథాలనూ దిఙ్మాత్రంగా పరామర్శించాను. ఇప్పుడు వారి కవితలోని రస రామణీయాలను స్థాలీపులాకన్యాయంగా పరిశీలిస్తాను.

పూర్వం శార్దూల వృత్తంతోనూ, దైవ ప్రార్థనతోనూ కవిత్వారంభం చేయడం రివాజు. "శ్రీవాణీగిరిజాశ్చిరాయ" అనే మంగళ శ్లోకంతో నన్నయ మహాభారతాన్నీ, శ్రీకైవల్య పదంబు చేరుటకునై చింతించెదన్" అని బమ్మెర పోతన భాగవతాన్ని ఆరంభించారు. కాని, రామస్వామి గారు ప్రాచీన సంప్రదాయాన్ని పరిత్యజించి, చంపకమాలతో సూతపురాణం ప్రారంభించారు. బీదసాదలను పోషించకుండా రాళ్ళు రప్పలకూ సర్వస్వాన్ని ధారబోసే పరమ భక్తులను వ్యాజ స్తుతిగా మెచ్చుకొన్నారు.

చ. "మలమలమాడుపొట్ట, తెగమాసినబట్ట, కలంతపెట్టగా
విలవిల యేడ్చుచున్న నిరుపేదకు జాలిని( జూపకుండ, ను
త్తల పడిపోయి జీవరహితంబగు బొమ్మకు నిండ్లు వాకిళుల్
పొలమును బొట్ట నిచ్చెడి ప్రబుద్ధవదాన్యుల నిచ్చమెచ్చెదన్"

చక్కని వ్యంగ్యం చౌదరిగారి సొత్తు అనడానికి ఈ క్రింది పద్యాలే ప్రబల సాక్ష్యం.

ఉ. "చేసిన దోస మీశ్వరుని చింతనచే నశియించునన్న వి
శ్వాసముగల్గి రే(బవలు, పాప మొనర్చుచు( దీరినప్పుడే
దో సమయంబునం గలముందొందరగా(గొని రామకోటినిన్
వ్రాసెడి భక్తకోటి పదపంకజముల్ శరణంబు వేడెదన్.

ఉ. కామపరీతబుద్ధి గుణకర్మపరీక్షను మాని బ్రాహ్మణ
స్వాములఁజేసి కొందఱిని బానిసలం బొనరించి కొందఱిన్
బూమెలు చెప్పి యీ భరతభూమిఁ గలంచెడి వర్తమాన హిం
దూమత సంప్రదాయమును దోసిలి యొగ్గి భజింతు నిచ్చలున్.

ఉ. పొచ్చెములేని మిండతలపొత్తయినన్ బహుపావ మంచు వా
క్రుచ్చుచు నాలిముచ్చులయి కొక్కిరివేలుపు నాగవాస మం
దిచ్చెడి కమ్మతావి గల యెంగిలి బాగలమీఁది పేర్మిచేఁ
గ్రచ్చఱ యజ్ఞముల్ సలుపు బ్రాహ్మణ దీక్షితులన్ స్మరించెదన్.

కవులు తమ కావ్యాలలో రసపోషణకోసం అలంకారాలను వాడటం పరిపాటి. కొంతమంది కవులు తమ పాండిత్యాన్ని ప్రదర్శించటానికే శబ్దాలంకారాలను, అర్థాలంకారాలను ఇష్టమొచ్చిన రీతిగా ప్రయోగించటం జరుగుతున్నది రామస్వామిగారు రసౌచితికి భంగం లేకుండా అలంకారాలను ప్రయోగించారు. ఈ పద్యాలను చూడండి.

గీ. "చదలు దాఁకు మ్రాని మొదలు కుదులు పొదల
మెదలు తుమ్మెదల రొదలు కదలు నదులు
విదులు క్రొందావి విరిగుత్తి పదులు పొదలు
మెదలు తుదలేని ముదిగొండ మొదలుగంటి"

తే, "అంకపడి దక్షిణాంబుధి యంకమందు
లంక, శివలెంక, ప్రతిభాంక లంక వెల్గు
నిత్య నిష్పంక, నిశ్శంక నిష్కళంక
వంక గానరా దావంక వంక వంక"

సీ. ''పలుగాకి పలుగాకుఁ బొలిపుచ్చి తననాఁడు
చీకాకు పడకుండఁ జేసినాఁడు
గాటంబుగాఁ జెలగాటంబుగాఁ జెల
రేఁగి మార్తురఁ జీల్చి రేఁగినాడు
గోపురంపు పురంబు బాపురే! యన మూఁడు
కొండకొమ్ములమధ్యఁ గూర్చి నాఁడు
కలిచేతఁదన్ని యాకలిమాన్పి గిలిమాన్పి
నలిమాన్పి యెల్లర నిలిపినాఁడు

గీ. కురుకురునకుఁ బట్టుగొమ్మయై కుదిరినాఁడు
నాఁడు తనుఁగొల్వ నొనరించినాఁడు నాఁడు
నదురు లేని నాయకుఁడై నాఁడు నాఁడు
రావణుం డార్యలోక విద్రావణుండు.''

రామస్వామి గారి శైలి సహజంగా ఉంటుంది. నడక ఎక్కడా కుంటు బడకుండా పరుగుతో పద్య గమనం సాగుతూ ఉంటుంది. ఈ క్రింది పద్యం వీక్షించండి.

చం. ''అనిన యనంతరమ్మున ప్రియమ్మున రమ్మని చెప్పి తోడుతోఁ
జనియెను దారిఁజూపుచుఁ బ్రశస్త మనోహర సౌరభాఢ్య పు
ష్ప నివహ రంజ దత్యధిక వంజుల మంజుల కుంజ పుంజ సం
జనిత పథావరోధ పరిసర్పిత ధామకు నొక్క సీమకున్''

ఈ పద్యంసూతమహర్షి ఆశ్రమాన్ని మన కన్నుల ముందు బొమ్మ కట్టిస్తున్నది.

రామస్వామి గారి కవిత రసభరితమై, ఔచిత్య సమన్వితమై, ధ్వని గర్భితమై, శిల్ప సమన్వితమై ఉదారాశయ సందీపితమైఉంటుంది. వారి కల్పనా శక్తి అనన్యం. వారి భావ విహంగాలు దూరతీరాలకు పయనించి అచ్చటి సొగసులను, సొబగులను గుదిగుచ్చి, పుణికి పుచ్చుకొని, కమనీయంగానూ, హృద్యంగానూ మన ముందుంచుతాయి. అదేం గ్రహచారమోగాని పరాయి వాణ్ణి మెచ్చుకొన్నట్లుగా తెలుగు వారు తనవారిని మెచ్చుకోలేరు. అది మన కర్మం! ఆంగ్లభాషలోని ఎంతచచ్చు పద్యాన్నయినా మనం ఆకాశాని కెత్తేస్తాం. తెలుగు భాషను "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్" అని పాశ్చాత్య పండితులు ప్రశంసించినా మన మాతృ భాషలోని ఎంతమంచి పద్యమైనా మనకు రుచించదు. ఏ దేశంలోని ఏ ఉత్తమ కవితకూ ఎందునా తీసిపోని పద్యాలు కవిరాజుగా రనేకం వ్రాశారు. ఉదాహరణకు "నందనోద్యానము"ను ఎంత భావ విలసితంగా వర్ణించారో చూడండి.

సీ. "ఒక వంక వీక్షింప నుత్ఫుల్ల సౌవర్ణ
పంకజాత పరాగ పంకిలంబు
ఒక చాయఁ గనుగొన్న శుకశారికానీక
కోకిల కాకలీ కూజితంబు
ఒక ప్రేవఁ బొడగన్న వికచ మందార
పుష్ప మరంద గురు ఝురీప్లావితంబు
ఒక కోనఁ బరికింప నురు వేపథుః గ్లాని
సంహారక సమీర చాలితంబు

గీ. మధుర వేణు వీణాగాన మండితంబు
స్వైరకేళీ సహారిణీ సంకులంబు
విటపీటీ నటీనట పరివేష్టితంబు
నందనోద్యాన మానంద మందిరంబు".

రామరాజభూషణుని పద్యాలను స్ఫురణకు తెచ్చే రామస్వామి గారి ''నందనవనవర్ణనం'' వారి కల్పనా శక్తికి నికషోపలం.' This is creation of genious' అన్నాడొక సుప్రసిద్ధ రచయిత.

కవిరాజు రామస్వామి గారు తెలుగుకవి. తెలుగుకవిత్వంలో సంస్కృతపదాలకంటే జాతీయ పదాలనే ఎక్కువగా వాడాలని ప్రచారం చేశారు. తెలుగు పదాలను వాడిన కవులంటే ఆయనకు అపారమైన ప్రీతి. నన్నెచోడుని కవిత్వంలోని తెలుగు నుడికారం, తెలుగు పద ప్రయోగాలు వారిని సమ్మోహితులను చేశాయి. నన్నెచోడుని గురించే వారే మంటున్నారో చూడండి.

చం. ''నవరస వేదియై తెలుఁగు నాట దెలుంగు కవిత్వమర్మముల్
గవు సెనఁ దీసి కన్పరపగల్గిన సత్కవిరాజు, రాజస
త్కవియగు నన్నెచోడరసికప్రభు జాను తెనుంగు కబ్బపుం
జవు లెఱుఁగంగ సాధ్యమె రసజ్ఞులు ప్రాజ్ఞులు గానివారికిన్''

ఇక వేమనను గురించి——

ఉ. ''ఆయతరాజ్యవైభవము నంత త్యజించుచు సన్యసించి జా
తీయపుఁ దీరుఁతీయములు తెట్టలుగట్టఁ దెలుంగు కబ్బ మా
ప్యాయనమౌ విధంబుగను బల్కిన మా చినవేమరెడ్డినిన్
బాయక ప్రస్తుతించెదను బల్మరు భక్తి పురస్సరంబుగన్''

గ్రంథ రచనకు ముందు ''కుకవి నింద'' మన పూర్వకవుల సంప్రదాయం ఆ సంప్రదాయాన్నే అనుసరిస్తూ రామస్వామి గారు ఎంత ప్రౌఢంగా చమత్కరించారో చూడండి :-

గీ. 'పూర్వకవి సంప్రదాయమ్ము బుజ్జగించి
కుకవి నింద నొనర్చుట గొప్ప యగునె?
కుకవు లుండుటచేతనే సుకవిచంద్ర
కీర్తిచంద్రికల్ దిశలెల్లఁ గెరలియాడు;'

చం. "కలిగినదానిలో మనసుకల్గిన దానిని కైతచెప్ప వా
రలు కవిరాజులో! కుకవి రాజులో! భక్తి పురస్సరంబుగాఁ
బలుకు వెలందికిచ్చు నెడఁ బాపము! కాకవులంచు మాటికిన్
బలుకుచు దూరుచెల్లఁదగవా? తెగవాగిన మెప్పుగల్గునే?"

"లోకో భిన్నరుచి:" అని లోకోక్తి గదా? ఇక, కవిత్వం ఎవరు వ్రాసేటట్టు? కవిరాజుగారు చెపుతున్నారు.

గీ. "పాక మెట్లున్న నేమి సంబరము? కవు లే
ఉంగ రొక్క "లోకో భిన్నరుచి" యనంగ
రసిక శేఖరుల నెల్లరకు రుచించు
కమ్మతనమునె చూపింతుఁగైతలందు."

కవిరాజు గారు నిశితమైన విమర్శకులు: ప్రతిభావ్యుత్పత్తులు గల కవి శేఖరులు, వారి విమర్శ కవితావేశాన్ని గానీ, కవిత్వం వారి విమర్శనా దృష్టినిగానీ ఎక్కడా, ఎప్పుడూ కుంటుపరచ లేదు. పైగా ఒక దాని కొకటి దోహదం చేసుకుంటూ ఒకదానివల్ల ఒకటి ప్రకాశించాయి. ఇందుకు వారి సూతపురాణం లోని ద్వితీయశ్వాసం నిదర్శనం. ఈ ఆశ్వాసంలో రామస్వామి గారిలోవున్న ఈ రెండు శక్తులూ పరాకాష్ఠ నందుకొన్నాయి. ఈ ఆశ్వాసంలోనే వారు మన పూర్వులు చిత్రించిన స్వర్గాన్ని అవహేళన చేశారు, కాని కవిత్వ దృష్టితో చూస్తే ఒక్కొక్క పద్యం ఒక్కొక్క రస గుళిక అనిపిస్తుంది.

సూతమహర్షి స్వర్గాన్ని చూడటానికి వెళ్తాడు నాక పురమంతా అల్లకల్లోలంగా ఉంటుంది. అచ్చట మద్యాన్ని సేవిస్తున్న వేల్పు జంటలు కనిపిస్తాయి. సూతమహర్షి చెపుతున్నాడు.

ఒక ప్రక్క—

గీ. మసకలాడు నాగుల మాడ్కి మసలి బాహ్య
లోక మాదమఱచి రసలుబ్ధు లగుచు
గాఢతర పరిష్వంగ సౌఖ్యమునఁ దేలు
వేల్పుజంటల గనుఁగొంటి వెంటవెంట.

ఇంకొక ప్రక్క—

గీ. సురనువాచేరఁ దెగఁ ద్రావి సోడుముట్ట
మైమరఱచి నేలపై. గూలి మరులు కూన
రాగములుతీయు గోవాంద్ర రాగరస ని
మగ్నతను జూచి యానంద మయ్యెఁడ నైతి

అంతలో—

ఆ. కంచుకంబుఁదీసి కడగంటితోఁ గాంచి
జడుపులేక దుమికి మడుగులోన
నీతకొట్టుచున్న యిగురుఁ బోడి యొకర్తు
కన్నుసైగ జేసే నన్నుఁ జూచి

ఇంకేముంది ? సూతమహర్షి గుండె గుభేలుమంది. ఊర్వశి తన దగ్గరకు వచ్చి సయ్యాటలు మొదలు పెడితే ఏం చేసేటట్లు? కాదుకూడదన్నా ఆమె కోరుకున్న వ్యక్తి అర్జునుణ్ణి నపుంసకుని చేసిన వేల్పు జవరాలు తనను ఉక్కిరి బిక్కిరి చేయక పూరుకుంటుందా ? చూడండి ఆయన ఆందోళన :-

గీ. "గిల్లు కొఱుకుల పౌత్రంబు నెల్లఁజదివి
యారితేరిన యామె సయ్యాటలందు
బడుగు బైరాగి కెట్టు లీపాట్లు తెలియు?
వంగి జోహారుఁ జేయు చేపాటియెఱుఁగు"?

ఇలాంటి దృశ్యాలను చూచి చూచి ఒక చోట తల చేతులతో ఇరికించు కొని యిలా అనుకోసాగాడు సూతమహర్షి.

గీ. "కల్లనిచ్చెడి చెట్లకుఁగల్గు గౌర
వంబు పెఱ వానికిని లేదు వ్రజిమోల
గజ్జెకట్టెడి బోగంపు గరిత కున్న
పలుకుబడి కానరాదెట్టివారి కిందు.

గీ. ఇండ్లొ యున్నవి గాని పెండ్లిండ్లులేవు
ఆండ్రొ యున్నారు కాని యిల్లాండ్రులేరు
బాగు! శివ! శివా!! ఇది వట్టి భోగభూమి
యుండరాదిందు మావంటి యోగులకును".

సూతమహర్షికి ఒక అనుమానం కల్గుతుంది. స్వర్గం "విట విటీ నటీ నట" పరివేష్టితం గదా! అచ్చట పసి పిల్లలు కనిపించరేమిటి? అనేది ఆ అనుమానం. స్వర్గంలో పసిగందులు వుండరని మనకు తెలిసిన విషయమే. కాని కారణం మాత్రం మనం ఎన్నడూ ఊహించి ఎరుగం. కారణం తెలుసు కుందామని సూతమహర్షికి కోర్కె గలిగి ఒక జవరాలిని ఎంత అందంగా అడిగాడో చూడండి.

కం "ఇందఱు యువతీ యువకులు
క్రందుగ నున్నట్టి చోటఁ గన్పించ రహో!
చిందులు తెగఁద్రొక్కెడి కసి
గందులు వచియింపుమమ్మ కారణ మన్నన్"

ఈ ప్రశ్నకు ఆ జవ్వని చిరునవ్వునవ్వి ఏ మంటుందంటే—

ఉ. 'స్వైరవిహార నిష్ఠమెయి సర్వదిగంతర దివ్యదేశ సం
చారముఁజేయు మాకు గ్రహచారము చాలక సంతుగల్గినన్
వారలనెల్ల గన్న మగవారికి నిత్తుము కాని పెంచు నా
చారములేదు స్వర్గమున సత్యముఁ జెప్పితినంచు నామెయున్.'

సూతమహర్షే గడుసుదనంగా అడిగాడనుకుంటే ఆంతకంటే గడుసుదనంగా సమాధానంచెప్పింది ఆవేల్పు జవరాలు. విమర్శకుల దృష్టిలో ఇదొక అపూర్వమైన కళాసృష్టి.

గీ. 'ఆలకింపుము స్వర్లోక మందునున్న
మానినుల యందుఁబెండ్లిండ్లు లేని కార
ణమున మరులెత్తి మర్త్యలోకమ్ము, దేశ
దేశముల వయింబడి వారు తిరుగుచుంద్రు.'

ఈ సృష్టి తెలుగు కవులలో ఒక్క రామస్వామి గారే చేయగలరని సగర్వంగా చెప్పుకోవచ్చు.

కవిరాజు రామస్వామి గారు పురాణాల మొదలు ప్రబంధాల వరకూ బాగా చదివి ఆకళింపు చేసికొన్నారు. వాటిలోని కొన్ని తీరులకు వారు మెరుగులు దిద్దారు రామస్వామి గారి కవితలో నన్నెచోడుడు "జాను తెలుగు"లో రచించి దేశికవితా సంప్రదాయానికి దోహదంచేసిన కవి. నన్నెచోడుని సీస పద్యాల జిగి కవిరాజు గారి కవితలో ప్రత్యేకంగా పుణికి పుచ్చుకొన్నట్లుగా ఉన్నది. కుమార సంభవములోని పర్వత వర్ణనతో కవిరాజు రామస్వామి గారి ఈ పద్యాన్ని పోల్చి చూడండి :

సీ. "గండోపలచ్ఛటా గండూషిత ప్రస్థ
వింధ్యపర్వతపంక్తి వెనుకనెట్టి
పంచాస్యశార్దూలవన్యేభ సంకీర్ణ
ప్రస్ఫురద్దండకా వనముదాఁటి
ప్రావృట్సమారంభ బహువయస్సంపూర్ణ
దుర్లంఘ నిర్ఝరుల్ దూఁకివచ్చి
విషసరీ సృపచమూ విష్కంభ దుర్లోక
తృణలతాగుల్మముల్ తీసివచ్చి

గీ. యార్యసంఘంబు మునిపల్లె లచ్చటచటఁ
గట్టుకొని వేగుపనికినై కాపురంబు
లుండి బహుజంతు హింసా ప్రయుక్త యజ్ఞ
యాగములు చేయజొచ్చిరి యాగకుండః."

శ్రీకృష్ణుడు రాయబారిగా హస్తినాపురాన్ని సందర్శించిన సందర్భంలో అచ్చటి ప్రజలు శ్రీ కృష్ణుని గత కార్యాలను తలపోసిన తీరును సీస పద్యాలలో తిక్కన వర్ణించాడు. ఇదేవిధంగా కంసుని పట్టణంలో శ్రీకృష్ణుడు ప్రవేశించి నప్పుడు, స్త్రీలు అతణ్ణి స్తుతించిన ఘట్టాలు బమ్మెర పోతన భాగవతంలో గుది గ్రుచ్చాడు. అలాంటి పోకడలు కొన్ని రామస్వామి గారు సూతపురాణంలో చూపించారు.

యధార్థ రామాయణంలో రావణుని చూచిన వెంటనే హనుమంతుడు ఈ విధంగా ఆలోచించ సాగాడు :-

సీ. "వీఁడటే రోరాయు వీఁడటే చొరఁబాటి
కైకొన్న వాఁడటే గాలికలము
వీఁడటే ముక్కంటి వీడటే పైకెత్తి
క్రొండాడినాఁడటే కొండవీడు
వీఁడటే నాఁడటే వెట్టి వారలఁజేసి
పీడించినాఁడటే వేల్పుమూఁక
వీఁడటే కొడకుచేఁబెడ తెక్కలనుగట్టి
తెప్పించినాడఁటే దివిజనాథు

గీ. వీఁడటే తనవీడీడు జోడు జాడ
లేనిదానిఁగా జేసిన మానఘనుఁడు
చేతులనునెత్తి జోహారుసేయు తలఁపు
పుట్టుచుండె నిప్పుడు త్రాటఁగట్టఁబడిన.

భట్టుమూర్తి వృత్తాలను, సీసాలను కొత్తపుంతలు త్రొక్కించాడు. ఆ పోకడలు కొన్ని కవిరాజు కవితలలో కనిపిస్తాయి. ఈ పద్యం చూడండి.

సీ. "ఈరేడు జగములకీఁతేఁడు తగువాఁడు
వేరేఁడు తగఁడన్న పేరుఁగాంచె
చదువు సాములునేర్చి చదువు సాములనేర్చు
చదువు సాములనేర్చు చతురుఁడయ్యె
గోవాంధ్ర సరిదిద్ది గోవాంధ్రఁ గనియిద్ది
గోవాంధ్రఁ గనుడంచుఁ జావఁగొట్టె
ఆ పగతుర జట్టు నాపఁగ బురిచుట్టు
నాపగదొరఁబెట్టి యధికుఁడయ్యె

గీ. ధరణిఁ బుట్టుట గిట్టుట కొఱకుఁగాదె
యెప్పుడో యొకప్పుడు చావు తప్పబోదు
జాతి యభివృద్ధికొఱకునై సమసిపోయె
రావణుండెంత ధన్యుఁడో ప్రథన భూమి''!

రామస్వామి గారి కవితలో ఒక ప్రత్యేకత ఉంది. అది ఉత్తమశైలి. తిరుపతి వేంకట కవుల పద్యాలు చదవడంలోని ప్రతిభ వారి శిష్యులలోని కొందరికి వుంటే, వారి ''కవితధార'' మాత్రం ఒక్క రామస్వామి గారికే పట్టుబడింది. కొన్ని సందర్భాలలో కవిరాజు గారి కవనం అత్యున్నత శిఖరాల నందుకొంది. ఈ విషయాన్ని వేంకట శాస్త్రి గారు ''[1]కొందరు కవిత్వ సంప్రదాయాలు నేర్చుకోడానికి నాకు శిష్యులుగా చేరారు. కాని ఎవరికీ అబ్బిందేకాదు. ఒకరికిమాత్రమే నా త్రోవ పట్టుబడింది. దానికి నేను నిమిత్తమాత్రం. అలా కాక పోతే అభ్యసించాలని మొదలు పెట్టిన వాళ్ళ కెవళ్ళకీ లవలేశమూ అంటక పోవడ మేమిటి ?'' అన్నారు.

చెళ్ళపిళ్ళ వారి కవితాశైలి రామస్వామి గారి మనోఫలకముపై గాఢ ముద్రవేసింది. తమ గురువుగారివలే సమగతిలో, యమక ప్రాసలతో, అత్యంత రమణీయంగా రామస్వామి గారు పద్యాలను నడిపించారు. సూత పురాణం చతుర్థాశ్వాసంలోని ఈ పద్యాలను చూడండి :-

ఉ. 'కాలము మాఱిపోయె మన కాలముఁ జెల్లిపోయె దు
ష్కాలము దాపరించె మన కన్నులముందటె యెంత మందియో
కాలముఁజేసినారు గతకాలమె మేలుగఁ దోచునక్కటా!
గాలమురీతి గ్రుచ్చుకొను కష్టపరంపవచ్చెఁ గంటిరే !'

1. ''మా విద్యార్థి దశ - నాటి కవిత్వము'' అను వ్యాసం శ్రీ చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు. భారతి - మే - 1941.

ఉ. 'రాగములేని రాధ యనురాగము క్రొన్నన సాగుచుండఁగా
రాగముదంబు కృష్ణుని సరాగములాడెడి కోర్కెపుట్టగా
రాగముఁదీయుచున్ సుమపరాగముపై విదిలింప బట్టుకో
రాగ మురారి, యందకయె జాఁగతనంబున దాటుజాణయై'.

నవ నవోన్మేషమైన ప్రతిభ, పాండిత్యముగల మహాకవి రామస్వామి గారు. రసవత్తరమైన ఈ ఆశుకవితను అనర్గళంగా చెప్పగలశక్తి సామర్థ్యం గలవారు కనుకనే, కొప్పరపు కవులు, తిరుపతి వేంకట కవులతో వాగ్వివాదానికి దిగినప్పుడు రామస్వామి గారు "మీరు మా గురువులను జయించ గలరా ? మీ కాశక్తి యున్నచో ముందు నన్ను జయించండి?" అని సవాలు చేశారు. [1] కొప్పరపు సుబ్బారాయశర్మ గారికి 3-9-1913న యిలా వ్రాశారు.

సీ. 'అఱవదేశంబున నవధాన మొనరించు,
టోకాద! యిదియు గుంటూరు సీమ,
పల్నాటి సీమలోఁ బద్యంబులను జెప్పు
టోకాద! యిదియు గుంటూరు సీమ,
ఆ యూర నాయూర నాశుకవిత సెప్పు
టోకాద! యిదియు గుంటూరు సీమ,
గుడివాడ సీమలోఁ గొన్ని యూళ్ళను జెప్పు
టోకాద! యిదియు గుంటూరు సీమ.

గీ. యెట్లు దక్కించుకొందురో యిపుడు మీరు
నిండుకొల్వున మీ కున్నదండి బిరుదు,
లూరకేపోదు పూజ్యులఁ గాఋలఱవ,
నాశుకవిసింహ కుండిన హంసలారా.

1. తిరుపతి వేంకట కవుల గీరతము.

ఉ. బట్టులరీతి బద్యముల బల్కుటెకాని శతావధానమె,
పృట్టులనేది చేసితిరి పండితులెల్లరు మెచ్చినారలో,
గుట్టుగఁ బోవకీగతిని, గొంటెతనంబును జేయఁజూతులే,
పెట్టలుక్రొవ్వి పుంజువయి, బీరముఁ జూపిన లాగుదోపదో.

సీ. శతఘంటకవనంబు సల్పుదుమన్న మీశక్తి యడంపనేఁ జాలనొక్కొ
అష్టావధానంబు నాచరింతుమన మీశక్తి యడంపనేఁ జాలనొక్కొ,
ఆశు కవిత్వంబు నాచరింతుమన మీశక్తి యడంపనేఁ జాలనొక్కొ,
సద్గ్రంథ రచనంబు జరుపుదుమన్న మీశక్తి యడంపనేఁ జాలనొక్కొ

గీ. 'ఇంగిలీషున వత్తురో యెఱిఁగి యడప
గరమునే జాలనొక్కొ మా గురువులేల,
రండు వేగ మీ బిరుదులు దెండు పెట్టి,
పొండు నిండు సభను గొప్రవపుఁ గవులార!

గీ. ఓడినారని తలపోయు వాఁడ మీరు
నాకుఁ బ్రత్యుత్తరంబును నీకమౌన,
ముద్ర వహియింతురేని నీ ముచ్చటెఱిగి,
ముందుపనిఁజూడు డీ కొప్రవపుఁగవులార'.

సాహిత్యరంగంలో రామస్వామిగారు సవ్యసాచి, వారు పద్యం ఎంత రసవత్తరంగా వ్రాసేవారో, గద్యం కూడా అంత గంభీరంగానూ రచించే వారు.

రామస్వామిగారి కవితా వైశిష్ట్యాన్ని రాజకీయ నాయకులు, సుప్రసిద్ధ సాహిత్య వేత్తలు ఎంతగానో ప్రశంసించారు.

బౌద్ధ వాఙ్మయ బ్రహ్మ దుగ్గిరాల బలరామ కృష్ణయ్యగారు ''కవి రాజు ధైర్యముతో సంఘమున బాదుకొని యున్న దురాచారముల నిర్మూలింప

తనయనర్గళము, రసవత్తరము, ప్రభావోత్పాదకరమునగు గవితా శక్తి నుప యోగించి ఆంధ్రజాతి కెనలేని సేవ సలిపినారు'' అన్నారు.

కొండవీటి వేంకటకవి ''హేతువాదానికి నిలువ జాలని సిద్ధాంతాలను చిన్నా భిన్నం చెయ్యడంలో వేమన వేసిన బీజాన్ని మహా వృక్షంగా పెంచి, పెద్దజేసి, దాని మధుర ఫలాలను ఆంధ్ర సారస్వతానికి అందించారు రామ స్వామి చౌదరిగారు. హేతు వాదంలో వారికి వారే సాటి. చౌదరిగారి ప్రతి రచనలోను శయ్యా సౌష్ఠవము మూర్తీభవించి, జాతీయత ఉట్టి పడు తుంది. తెనుగు సారస్వతంలో అంతకుపూర్వం లోపించిన హాస్యరసాన్ని వీరి రచనలలో మొట్టమొదటి సారిగా మనం చవిచూశాం. పరిధులు మించని హాస్యం ద్వారా సంఘ దురాచారాలను ఖండించారు. వీరి ప్రతి రచన చైతన్యరహితమైన సంఘానికి జీవంపోసి ఆలోచనలు రేకెత్తింప జేసినవి'' అన్నారు.

''సంఘ శ్రేయస్సుకు, పీడిత ప్రజా శ్రేయస్సుకు తమ కవితా శక్తిని ధారబోసిన ధన్యజీవియేగాక, ''సత్యం వద, ధర్మంచర'' అను సూక్తులను త్రికరణ శుద్ధిగా ఆచరించిన పవిత్రాంతఃకరణులు శ్రీ రామస్వామిగారు'' అన్నారు కేంద్ర సహకారశాఖా ఉపమంత్రి బి. ఎస్. మూర్తిగారు.

కవిరాజు త్రిపురనేని రామస్వామిగారి సంస్మరణ మహాసభలో కేంద్ర రక్షణశాఖ స్టేట్ మంత్రి కొత్త రఘురామయ్యగారు ప్రసంగిస్తూ—

''రామస్వామిగారి రచనలు మా చిన్నతనంలో సరిగా గ్రహించక పోయినా, మొహంజోదారో, హరప్పాలలో బయల్పడిన శాసనాలు, కట్టడాలు మున్నగు ఆధారాలవలన తేలిన చారిత్రాత్మక సత్యాలను అంతకు ముందుగా రామస్వామిగారు తమ రచనలలో ప్రతిపాదించారని నేను గ్రహించి ఆశ్చర్య చకితుడనైనాను. రామస్వామి నాయకర్ ఉద్యమానికి రామస్వామి గారి ఉద్యమానికి పోలికలేదు. నాయకర్ ఉద్యమం నవసమాజానికి ఉపయోగ పడేదికాదు. రామస్వామిగారి మార్గం సత్యమైనది, నూతనమైనది'' అన్నారు.

"కవిరాజు త్రిపురనేని రామస్వామి తెలుగు సాహిత్య రంగంలో యుగపురుషుడేగాక తన పాండిత్య ప్రతిభను, విశ్వశ్రేయస్సుకు ఉపయోగించిన ధన్యజీవి" అన్నారు - కేంద్ర సమాచార శాఖామాత్యులు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గారు.

"ఆవేశంతోనో, ధనాకాంక్షతోనో, మరొకదాని కోసమో వ్రాసేది రచనేకాదు. ఎవరైతే తన స్థితిగతులు మరచిపోయి సృష్టిలో ఒకటిగా లీనమై రచన చేస్తారో ఆ రచనలు మనస్సును కదిలిస్తాయి. అటువంటి వారిలో కవిరాజు గారు ఒకరని చెప్పవచ్చును. వారి రచనలు చూస్తే వాటిలో చాలా మంచి సంప్రదాయం ఉంది. తెలుగు తనం అనే అభిమాన్నాన్ని సాధించారు. అందులో వ్యంగ్యం, హాస్యం చెప్పరానంత ఉంది. అలా వ్రాయగలిగింది వీరు ఒక్కరే" అన్నారు డాక్టర్ జి. వి. కృష్ణరావు గారు.

"చౌదరి గారి రచనము లన్నిటియందు అసాధారణమైన జీవమున్నది. వీరి కవన ధోరణి ప్రాతదేనైనను నందొక విధమైన కొత్తదన ముట్టి పడు చుండును. వీరి కవన పాకము ద్రాక్ష. శ్యయయు దీనికి దదగినదే. వీరికి దేశ్యశబ్దములయెడ బ్రీతిమెండు. వీరు సంస్కృత ఛందస్సునే యనుసరించిన వృత్తరచన చేసినను, దేశీయ పద్ధతిపై నభిమానమున్నవారు గాన ననేక గేయములను, ద్విపదలను వ్రాసివారు. శబ్దముల విషయమున గాని, ఛందో విషయమునగాని పొళ్ళుగలిపికొన నేర్చిన వారగుటచే వీరి శయ్యగాని వృత్తములుగాని యతి సమీచీనముగా నుండును." అన్నారు శ్రీ యలవర్తి రోశయ్య

ఆవుల గోపాల కృష్ణమూర్తి గారు "చౌదరి గారి కవిత్వం ప్రతి పంక్తిలోనూ, వారిలో వుండే ఆవేశము, యదార్థకాంక్ష, శక్తి ఉట్టి పడుతూ ఉంటాయి" అన్నారు.

"రామస్వామి చౌదరి గారు ఆంధ్ర వాగనుశాసనుడు" అన్నారు మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారు.

తెలంగాణాలోని ముస్లిం యువకుడు సుప్రసిద్ధ కవి శ్రీ గులాం యాసిన్ కవిరాజు గారి ఏకలవ్యశిష్యుడు. యాసిన్ వ్రాసిన ఈ వచన కవితను చదవండి :-

"సకల దిశలన్ సత్యకాంతుల
        శాసనంబది లేచియాడెను;
ఘడియ వచ్చెను ఘనతజాటగ
        గడియ పడె నవమార్గ యాత్రకు

విప్లవమ్మును లేవదీసిన
        వీరుడవు : కవిరాజశేఖర :
తోటి తమ్ముల భుజముతట్టి
        బాట జూపిన భవ్యతేజుడ :

అరువు తెలివియె మిగిలి జ్ఞానము
        కరువయిన చెడు సంఘ మందున
కొదువ లేని సత్యసంపద
        కొల్ల కొల్లగ పంచి నాడవు:

అభిజాత్యపు టహంకారము
        నమాంతముగ నణగద్రొక్కి
మౌఢ్య జాఢ్యము విచ్చిపారెడి
        మందు లిచ్చిన రాచవైద్యుడ:

రంకు గొంకుల బొంకు వాదుల
పాతరల పెకలించి నాడవు
నీతి ధర్మము, సద్వివేచన --
హేతువాదము సలిపి నాడవు:

నీవె కవివి : నీవె రవివి :
నీవె సత్యాత్ముడవు, త్యాగివి:
భావవిప్లవ భాగ్య దాతవు
భవ్య సూత్రాశ్రమపు యోగివి:

కలుషితపు జ్ఞానంబు ప్రబలి
కాడు గలసిన సంఘమందున
వెలసి జీవనజ్యోతి కాంతుల
వెలుగు జిమ్మిన తెలుగు రాజువు:

సమతయే సుమి మమతయిలలో
సాగిపొమ్మని నేర్పి నాడవు
మానవత్వపు మహిత కాంతుల
మార్గ మందున నిలచినాడవు !

బుద్ధదేవుని అపరమూర్తిగ
భువిని వెలసిన కర్మయోగివి !
నల్దెసల చైతన్య భేరీ
నాదమును విన్పించినాడవు !

తెలుగువారల ఆత్మలందున
వెలుగుచుందువు ఎల్ల వేళల
నీదు జీవితకథలు పాడెటి
నిండుకాలము రాకమానదు !

అభిరుచుల నవకాశములకున్
అడ్డు తగిలిన అహంభావుల
స్వార్థవాదుల నెల్ల తరిమిన
స్వామి ! నీదే ధన్య చరిత !

మరువరానిది నీ చరిత్రము
మానవాళికి తరతరాలుగ
దుష్ట సంఘాచార ఘోరము
భ్రష్టమై ఇల తోకముడువగ,
మరువరానిది నీ చరిత్రము

రాజకవి ! ఓ జ్ఞాన భాస్కర !
రత్న కాంతుల పిసాళించిన
నీ మహోజ్వల సుప్రబోధము
నిఖిల జగతికి నవోన్మేషము.

[1]'రచయితలు సంప్రదాయ దాసులు కాకూడదు. అడుగడుగునా ప్రశ్నల విల్లు ఎక్కుబెట్టే యోధులు కావాలి. సమాజంలో మార్పు రావాలంటే మేధావులు ముందు తమలో మార్పు తెచ్చుకోవాలి. పాతదంతా గొప్పదనే అభిప్రాయం తొలగించుకోవాలి, రామాయణ, భారతాది ప్రాచీన గ్రంథాలను కేవలం పూజా ద్రవ్యాలుగా చూసే ధోరణి మారాలి. ఆ గ్రంథాలు ఆధునిక కాలంలో కూడా మానవుణ్ణి మహనీయుడుగా తీర్చి దిద్దడానికి ఎంతవరకు ఉపకరించాయో సమీక్షించుకోవాలి. కవిరాజు గారు ధ్వజమెత్తింది మన ప్రాచీన పురాణేతిహాసాలమీదకాదు. వాటిలోని అహేతుకమైన అభిప్రాయాల పైనే. ఆయన, సంపూర్ణ మానవతావాది. మాటల్లో, చేతల్లో హేతుబద్ధమైన

1. హేతువాది మాసపత్రిక, జనవరి, 1986.

జీవన విధానాన్ని అనుసరించిన పురుషోత్తముడు'' అన్నారు డాక్టర్ సి. నారాయణరెడ్డి గారు.

ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు ''రామస్వామి గారు గొప్ప కవి. 20వ శతాబ్దపు సాహితీ దిగ్దంతులలో ఒకరు. వారు మా విద్యా వంశంలో చేరిన వారు. అంటే చెళ్ళపిళ్ళ వేంకటకవిగారి శిష్యులు. నాకు రఘుపతి వెంకటరత్నం నాయుడు వగైరాల యందుండే గౌరవం చౌదరి గారి యందు కలదు'' అన్నారు.

నవయుగ కవి చక్రవర్తి జాషువా ''ఆంధ్ర దేశంలో హేతువాదంతో సాహిత్యంతో నూతన శకాన్ని సృష్టించిన ప్రజ్ఞాశాలి కవిరాజు. సామాజిక విప్లవకర్త. ప్రఖ్యాత కవులలో ఒకరు'' అన్నారు.

సుప్రసిద్ధ జర్నలిష్టు నార్ల వెంకటేశ్వరరావు గారు ''చౌదరిగారిది జీవ భాష. తెలుగు నుడికారం సొంపు వారికి తెలిసినంతగా మరి ఎవ్వరికీ తెలియదు. ఏరుకుబడి బాగా వాడారు. సాహిత్య అకాడమీ నుడికారాల కోశం తయారు చేసిన సందర్భంలో కవిరాజు గారి రచనలలో కనుపించిన నుడికారాలు ఏ ఇతర రచలలోనూ కనుపించలేదు. సొంపు లుట్టిపడే నుడికారాలు కవిరాజు రచనలలో కోకొల్లలుగా ఉన్నాయి'' అన్నారు.

దర్శనాచార్య కొండూరి వీరరాఘవాచారి గారు ''రామస్వామి చౌదరి గారి కవిత్వము ఎదురులేనిది, తెలుగు పొంకము, బింకము, తీరు తీయములు ఉమాకాశరి కవితలో తేవు'' అన్నారు.

యం. పట్టాభిరామిరెడ్డి గారు చౌదరి గారిని పద్యాలలో యిలా ప్రశంసించారు.

> 1''తెలుగు గడ్డను గులికించు తెలుగుభాష
> నీదు కలమున చెలరేగి, నింగి కెగసి
> వెల్గుచున్నది మింట రే వెల్గుమించి
> గండుమీరిన కవిగాంధ్ర, గుండెలదర.

3. ఆంధ్రప్రభ 28-1-1968. దిన పత్రిక

అంకుశము నీదు గీత, నిరంకుశులకు
సూతసూక్తుల సారంబు పాతకథల
భావ వారాశి వడపోత భవ్యచరిత
నిన్ను బోలిన కవిలేడు నీకు నీవె''

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు ఆంధ్ర వాఙ్మయ చరిత్ర నాటక పరంపరలో[1] ''భావకవితా యుగం తరువాత 'హేతువాద యుగం' ప్రారంభమయినది. హేతువాద ధోరణిలో నవ్యకవులు భావాలలో నూ, ఛందస్సులోనూ క్రొత్త ప్రక్రియలను అవలంభింప సాగారు. ఈ యుగంలోని కవులందరికీ ''ఆది పురుషుడు'' త్రిపురనేని రామస్వామి చౌదరి. ఆయన సూతపురాణమొక మహాగ్రంథం. కవిత్వం ప్రబంధ కవుల కవిత్వ మల్లే ఉంటుంది. ఆయన పద్య రచనాశైలి ఎంతో మధురంగా ఉంటుంది. భావాలన్నీ పురాణాలకు వ్యతిరేకం. మొదట విప్లవం తెచ్చింది ఆయన. ఈ విప్లవ వాదులు నిజంగా విప్లవవాదులైతే, ఆయనకొక శిలా ప్రతిమ వేయవలె'' అన్నారు.

[2]జాస్తి జగన్నాథం రామస్వామి చౌదరి గారు ప్రతిభావంతుడైన ప్రథమశ్రేణి కవి. అంధ విశ్వాసాలను, అసంబద్ధ కథలను విమర్శించేటప్పుడు సునిశిత హాస్యంతో, అవహేళనతో పరుగులిడు తుంటుంది రామస్వామి గారి కవిత్వం. ప్రతిపక్షులనుగూడా నవ్వించే హాస్యమది. కొరడా కొసల వలే చుర్రున తగిలినా పైకి మాత్రం మనతోపాటే నవ్వుతాడు ప్రతి పక్షి. ఈ రకమైన కవిత్వం తెలుగు సాహిత్యం మొత్తంలో

1. హేతువాదయుగం - జూన్ 1962 'భారతి' లో ప్రచురించబడినది.
2. ''రసిక శేఖరుల బొదలలూన్చిన విప్లవకవి త్రిపురనేని కవిరాజు'' అనువ్యాసం ఆంధ్ర ప్రభ 17 జనవరి 1961.

ప్రాచీనాధునాతన కృతులలో ఎక్కడ వెదికినా కనుపించదు ఒక్క కవిరాజు గారి కృతులలో తప్ప. అదీ ఎక్కడో ఒకటి అర పద్యాలలోకాక గ్రంథ మంతటా పరివ్యాప్తమై ఉండటం మరీ విశేషం'' అన్నారు.

హైదరాబాద్‌లో కళానికేతన్ ఆధ్వర్యాన 20-4-1959న జరుపబడిన రామస్వామి గారి సాహిత్య సమాలోచన సభలో దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు ప్రసంగిస్తు ''త్రిపురనేని రామస్వామి చౌదరి గారు మంచి హేతువాది, శాస్త్రదృష్టికలవారు. అన్నింటా విప్లవం కోరిన కవిరాజు కవితా పద్ధతులలో మాత్రం పాత పోకడలే పోయి, వారి ఔదార్యం చూపించారు'' అన్నారు.

ఆంధ్రవిశారద పూజ్యశ్రీ తాపీ ధర్మారావుగారు మాట్లాడుతూ ''తాత ముత్తాతలంతా కత్తిబట్టి పోరాడిన కుటుంబములో జన్మించిన రామస్వామి చౌదరి గారు కలం పట్టి పోరాడారు జాత్య హంకారం, సమాజంలో హెచ్చు లొచ్చు లుండరాదని భావించారు. ఆయన సిద్ధాంతం బ్రాహ్మణద్వేషంకాదు. అబ్రాహ్మణోద్ధరణము'' అన్నారు.

''రామస్వామి చౌదరి గారు పురాణాలన్నింటిని సాకల్యంగా చదివి అందలి లోటు పాట్లను సోదాహరణంగా నిరూపించారు. ఎందరో ఉద్దండ పండితులు వారితో వాదించి ఓడి పోయారు. వారి పాండిత్యము, ధర్మాచరణ దీక్ష మన కందరకూ ఆదర్శప్రాయము'' అన్నారు కవిరత్న కొసరాజు రాఘవయ్య చౌదరి గారు.

వాఙ్మయ మహాధ్యక్ష వడ్లమూడి గోపాల కృష్ణయ్య గారు తమ ప్రసంగంలో ''ప్రాచీన కవులలో నన్నెచోడుడు ఎంతగా విప్లవం తెచ్చాడో, అధునాతనులలో రామస్వామిచౌదరి అంతగా విప్లవం సాధించారు'' అన్నారు. మొత్తంమీద ఉపన్యాసకులందరూ కవిత, సమత, జాతీయత ఈ త్రితయం మూర్తీభవించిన వ్యక్తి చౌదరి గారు అని అభినందించారు.

చౌదరి గారి కవిత్వం అపూర్వ విషయ భూయిష్టమై, చమత్కార పూరితమై, నుడికార పోషకమై, శయ్యా ప్రసన్నతా హృద్యమై, ధారాళతా విశిష్టమై, బహు పండిత ప్రశంసా పాత్రమై విరాజిల్లుతూ ఉన్నది. ఇలాంటి రసవత్తరమైన కవితను భూసురవర్గం పాతాళలోకానికి అణగ ద్రొక్కాలని ప్రయత్నం చేసింది. కాని ఆ ప్రయత్నరి ఫలించలేదు.

ఆనాటి కానాటికీ కవిరాజుగారి భావాల ప్రచారం ఉధృత రూపం దాల్చుతూ ఉంది. ఈనాడు వారి గ్రంథాలు చదివేవారి సంఖ్య అధికమయింది. వారి కవితా మాధుర్యానికి తన్మయులైన రసపిపాసకు లెందరో ఆంధ్ర దేశం నలుచెరగులా ఉన్నారు. రామస్వామి గారి చిత్రపటం అనేక ఇండ్లలో అలంకరించబడి ఉన్నది. అనేక మంది ఏకలవ్య శిష్యులు వారిని ఉపాసిస్తున్నారు.

ఈనాడు ఆంధ్రదేశంలోని ముఖ్య పట్టణాలతోనేగాక మారు మూల గ్రామలలో సైతం కవిరాజు వర్ధంత్యుత్సవాలు జరుగుతున్నాయి. ఈ సందర్భంలో ఐతానగర వాస్తవ్యులు కన్నెగంటి జగ్గయ్య గారి కృషి, పట్టుదల ప్రశంసనీయం. వారు తమిళనాడు నుండి అన్నాదురైని ఆహ్వానించి, ఆయనచేత తెనాలిలో ఉపన్యాసా లిప్పించారు.

* Inaugurating the 25 death anniversary of Kaviraju Tripuraneni Ramaswamy Choudary, Sri C.N. Annadurai, Chief Minister of Madras paid glowing tributes to him as a great poet, social Reformer and Rationalist.

He said that the people should wage a war to achieve rationalism which was very difficult. Ramaswamy found society divided into water tight compartments on the basis of caste and creed. Vast masses of people were ignorant and superstitious. After analysing the reasons for this, Ramaswamy found that this was due to their epics, puranas and scriptures being based on superstition. Even

* Indian Express 30-1-1968

people with modern education and scientific thinking were not prepared to leave their superstitious beliefs. They would invoke the karma theory to explain the present ills and miseries. Such fatalism cut deeply at the roots of socialism. Mr.Annadurai said and appealed to the people who really believed in socialism to support rationalism. He suggested formation of an all-party united front of rationalists.

Dr. Habibullah Beig, Mayor of Madras said that Ramaswamy believed and preached that all man kind was one.

ఈ సభలో పాల్గొనడం మహాద్భాగ్యంగా ప్రజలు భావిస్తున్నారు. వేలాది ప్రజలు ఈ సభకు హాజరవుతున్నారు. సజ్జా వీరయ్య గారు, కవి రాజు గారి పద్యాలు చదువుతూ ఉంటే వారి కవితా ప్రాగల్భ్యానికి ప్రజలు హర్షధ్వానాలు చేస్తున్నారు. ఇక ముందు చేస్తారు.

కవిరాజు త్రిపురనేని రామస్వామి గారు చేసిన సాహిత్య, సాంఘిక సేవలను గుర్తించిన మన రాష్ట్ర ప్రభుత్వం వారి కాంస్య విగ్రహాన్ని ట్యాంక్ బండ్ మీద 1986న నవంబరు 1వ తేదిన నెలకొల్పింది. ఈ కాంస్య రూపం భావితరాలకు చైతన్య స్ఫూర్తి కలిగిస్తూ, సందర్శకుల హృదయాలలో జాతి, మత, కుల, వర్గ విభేదాలను సమసి పోయేట్లు చేసి, మానవులంతా ఒకటే అనే సమతా భావాన్ని కల్గిస్తుందనడంలో సందేహంలేదు.



# కవిరాజు తాత్త్వికదృష్టి

కవిరాజు త్రిపురనేని రామస్వామి గారిని కొందరు శూన్యమతవాది ( Nihilist ) అన్నారు. మరికొందరు నాస్తికుడు ( Atheist ) అన్నారు. ఇంకొందరు అజ్ఞేయవాది ( Iconoclast ) అన్నారు ఎవరు ఏమన్నప్పటికి భారతీయ తత్వశాస్త్రాన్ని పరిశీలించి చూస్తే నాస్తికులలోకూడా భేదాలున్నట్లు మనకు బోధపడుతుంది. ప్రకృతియే సృష్టికర్త. కాలపురుషుడే లయకారుడు. మానవుని సుఖ దుఃఖాలకు, పుణ్యాపాపాలకు సంబంధంలేదు. స్వర్గ నరకాలు వట్టి అభూతకల్పన. ప్రపంచమే నిత్యము అని చెప్పబడి, నాస్తికత్వమని నిందించబడే ఈ ''హేతువాదం'' షడ్దర్శనాలలోనే గోచరిస్తుంది. ప్రకృతిని ఆధారంగా తీసుకొని ప్రపంచాన్ని వ్యాఖ్యానించారు సాంఖ్యులు. ప్రపంచం మూలపదార్థాలవల్ల ఏర్పడిందని అణువాదానికి బీజాలు చల్లారు వైశేషికులు. మానవతీత శక్తులను ఖండించి జ్ఞానం మానవునిలోనే కలుగుతుందని వాదించారు నైయాయికులు. ఇలాగే కార్యకారణ సంబంధం ద్వారా సృష్టి జరుగుతున్నదన్నారు బౌద్ధులు. పదార్థం పరిణామం చెందడంవల్ల చైతన్యం కలుగుతున్నదని పేర్కొన్నారు చార్వాకులు. ఈ విధంగా ఈ సిద్ధాంతాలన్నీ అనుభవము. పరిశీలన మాత్రమే మానవ విజ్ఞానానికి సాధనాలని ప్రతిపాదించాయి, ఇవన్నీ నాస్తిక మార్గమే అయినప్పటికి, నాస్తిక వాదులను స్థూలంగా రెండు రకాల వారుగా మనం విభజింపవచ్చు.

మొదటి రకం వారు ప్రత్యక్ష నిదర్శనంతో కూడుకొన్న భౌతిక విలువను తప్ప మరే విలువలనూ అంగీకరించరు. అణు సంయోగం వల్ల ప్రకృతి ఏర్పడిందని, వియోగం సంభవించినప్పుడు విడిపోతుందని మాత్రమే చెపుతారు. దీనివల్ల ఈ ప్రపంచంలో, మానవునికి తను మరణించే

వరకూ బ్రతకడం కంటే వేరే ఆదర్శం లేకుండా పోతుంది. మానవుడు ఈ పని చేయవచ్చు. ఈ పని చేయకూడదు అని నిర్ణయించడం అసాధ్య మౌతుంది ఈ దృష్టి భౌతిక విలువలను అధిగమించిన, నైతిక విలువనుగాని, నైతిక విలువలను మించిన అధ్యాత్మిక విలువలను గాని అంగీకరించదు. అందువల్ల నిత్య జీవితంలో మానవునికి ఆనందాన్ని, ఆహ్లాదాన్ని గలిగించే అనేక విలువలను తుడిచివేస్తుంది.

రెండవ రకం వారు పై విలువలన్నింటినీ అంగీకరిస్తారు. అయితే అవన్నీ మానవునిలో నుండి ఉద్భవించినవేగాని, మానవునికి సంబంధించని మానవునికి విడిగా ఉన్న మరో శక్తివల్ల జనించినవని అంగీకరించరు. వీరి దృష్టే సమగ్రమైనదని చెప్పవచ్చు. జీవితంలో కనుపించే అన్ని విలువలను సమన్వయం చేసి ఒక సంపూర్ణ సిద్ధాంతాన్ని సృష్టించ డానికి వీరు ప్రయత్నిస్తారు.

అయితే ఈ రెండు రకాలవారికీ మానవుడే ముఖ్యం. మానవుడు సర్వస్వతంత్రుడు. మానవుని నడిపించే మరే శక్తినీ వీరు అంగీకరించరు.

రామస్వామి గారి నాస్తికత రెండవ రకానికి చెందినది.

రెండువేల నాలుగు వందల సంవత్సరాలక్రితం గ్రీకు తత్వవేత్త 'పైథాగరస్' 'మానవుడే అన్నింటికీ కొలమానం (Man is the Measure of all Things) అన్నాడు.

వాల్ట్ విట్మన్ కవిశేఖరుడు "నేను ఆలయాన్ని నిర్మిస్తే అందులో మానవుని ప్రతిమనే ప్రతిష్టిస్తాను. మానవుడే నాదైవం' అన్నాడు. అదే విధంగా ఆంధ్రదేశంలో హేతువాదంతో మానవుణ్ణి నిలబెట్టడానికి మొట్ట మొదటి ప్రయత్నంచేసిన వారు కవిరాజు త్రిపురనేని రామస్వామి గారు. వారి భగవద్గీతలోని మొదటి పద్యం ఈ విషయాన్నే రుజువు చేస్తున్నది.

తే. ''శంకరుని యంత వేదాంత శాస్త్ర వేత్త
యనియెఁగా ''అహమ్బ్రహ్మాస్మి'' యనుచుఁగాన
నాకు నేనె నమస్సు లొనర్చు కొందు
నాది మధ్యాంత శూన్యుండ నైతినంచు''

సమాజంలోని మూఢ విశ్వాసాలనూ, దురాచారాలనూ రూపుమాపి నీతిని నెలకొల్పడానికీ, మానవతకు పట్టాభిషేకం చేయడానికి రామస్వామి గారు సూతపురాణం రచించారు.

రామస్వామి గారు భగవద్గీతలో కూడా బోధించినది సనాతన ధర్మం. సనాతన ధర్మంమంటే ఏమిటో వారు యిలా చెప్పారు.

'లేవు సృష్ట్యాది కులంబులున్
మనుజు లందరు నొక్కటె
తారతమ్యమున్ లేదు విశేష
ధర్మములు లేవు దరిద్రులు
విత్త వంతులన్ భేదము లేదు'

ఎచ్చు తగ్గులు లేని మానవుని ఆదిమ ధర్మమే ఆ సనాతన ధర్మం. ఆ ధర్మోద్ధరణకే వారు గీతామృతం కురిపించారు. అందులో బ్రహ్మనాయడు బాలచంద్రునితో యిలా అంటాడు.

చ. ''మతములె జ్ఞానబోధకపు మార్గముఁ జక్కఁగచెప్పి లోక స
మ్మతమగునట్టి ధర్మము సమాచరణంబునఁ బెట్టుకున్న నే
గతిఁ దరియింప వచ్చును ? నొకానొకఁడేనియు ముక్తి బొందునే?
మతమను మాట మోసముసుమా ! యిదె మూలము ధర్మపీడకున్.''

చ. మతములె పుట్టుకున్న యెడ మారణ కర్మములిన్ని సాగునే
ప్రతి దినవమ్ము భారత ధరాస్థలి ? నే నిటువంటి కర్మ సం
తతులను సైఁచువాఁడనె సనాతనధర్మ మొకండె యంచు న
మ్మి తిరుగువారి కెల్లపుడు మేలొడఁగూర్చుచునుందుఁ బ్రేమమై."

ఒకప్పుడు పుణ్యభూమిగా గణనకెక్కిన మనదేశం నైతికంగా పతన మైనందుకు రామస్వామి గారు ఎంతగానో పరితపించారు. సత్యశౌచాలు, దయారతి, ధర్మసంపద మనదేశంలో నామ మాత్రమైనవని వాటిని పునరుద్ధరించటానికే కవిరాజు కంకణం గట్టుకొన్నారు. ఈ దృక్పథమే వారు రచించిన "కుప్పుసామి శతకం" లోనూ "ధూర్తమానవా" లోని ప్రతి పద్యంలోనూ, కనిపిస్తున్నది. మానవునికి 'నీతి' ముఖ్యమని ఆ గ్రంథాలు, ఆదేశిస్తున్నాయి. పూర్వ గ్రంథాలు, మానవునికి వుండవలసిన నీతిని వమ్ము చేయడానికి ఉపయోగపడుతున్నపుడు వాటిమీద కవిరాజు ఎదురు తిరగటం సహజమే గదా ! ఈ సందర్భంలోనే రామస్వామి గారి ఉద్యమరూపు రేఖలను గూర్చి బ్రహ్మానందగిరి స్వాములవారు వెల్లడించిన అభిప్రాయాన్ని గూడా తెలుసుకోవలసి ఉన్నది. ! "కవిరాజు గారు నాస్తికులని ప్రపంచమున ప్రతీతి కలదు. వారి గ్రంథములను చదివితిమి. ఉపన్యాసములను వింటిమి. వారితో అనేక పర్యాయములు సంభాషించితిమి. మా కెచ్చటను నాస్తికత్వము కనిపించలేదు. ప్రతిచోటను దైవము పేరను, ధర్మము పేరను, మతము పేరను, ఆచారము పేరను జరుగుతున్న యత్యాచారములు, అన్యాయములు, దోపిడులు మొదలగునవి మాత్రమే గర్హింప బడెను" అన్నారు శ్రీ బ్రహ్మానందగిరి స్వాములవారు.

రామస్వామి గారు ద్వేషించినది Brahmanism ను గాని బ్రాహ్మణులను కాదు. ఆయనకు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, ఉన్నవ లక్ష్మీ నారాయణ గార్ల వంటి స్నేహితులుండేవారు.

1. కవిరాజు సన్మాన సంచిక.

గోపరాజు రామచంద్రరావు గారు [2], "కవిరాజు అస్తికుడా-నాస్తికుడా అను విషయాన్ని గూర్చి" గతాను గతిక లోకః నలోకః పారమార్థికః అను భావమును మనస్సు నందుంచుకొని కవిరాజు "హేతువాద దృష్టిని కల్గించుటకు జీవిత మంతా వినియోగించారు" అన్నారు

కవిరాజు రచనలను బట్టి ఆయనలో కలిగిన భావపరిణామాన్ని మనం గ్రహించవచ్చు. ఆయన మొట్టమొదట "నిహిలిష్టు". రష్యాదేశంలో విప్లవం రాక పూర్వం "నిహిలిజం" బహుళ ప్రచారంలో ఉండేది. దీని ముఖ్యోద్దేశం ప్రజలలోని మూఢ విశ్వాసాలనూ, కరుడుగట్టుకు పోయిన దుష్టమతాచారాలనూ, అభ్యుదయ నిరోధక భావాలనూ ఖండించి. భావ విప్లవం కలిగించి, సమసమాజం నిర్మించడమే.

ఆంధ్రదేశంలో త్రిపురనేని రామస్వామి గారు తమ హేతువాద కృపాణంతో, తార్కిక శక్తితో. స్మృతులలోని, పురాణేతిహాసాలలోని అమానుషత్వాన్ని చీల్చి చెండాడారు.

సూతపురాణం వ్రాసే వరకు కవిరాజు "నిహిలిష్టు" "ఖూనీ"1935 "భగవద్గీత" 1941 రచించే నాటికి రామస్వామి గారు అస్తికత్వాన్ని ఆవరించు కొని వున్న అభూతకల్పనల నన్నింటినీ దూయ బట్టారు.

"ఖూనీ" నాటక పీఠికలో నాస్తిక్యం వల్ల కలిగిన ప్రయోజనాలను యిలా విశదీకరించారు. "రష్యాలో నిరువదియేండ్ల క్రింద బయలుదేరిన యీ ప్రళయ ఝుం ఝూ మారుతమునకు భయపడి అచ్చట గుడులలో (Churches) నున్న భగవంతుడు కాలిచప్పుడు కాకుండా నెచ్చటికో దారి తీసెను. జారును రష్యన్లు చిన్న దేవుడని(Little God) పిలుచుచుండెడివారు. చిన్న దేవుడు చావగా పెద్దదేవునికి గతిలేక పోయెను. గుడులన్నియు

2. ఆంధ్రప్రభ – 2–2–1961.

యంత్రాగారములుగానూ, పుస్తక భాండాగారములుగానూ మారిపోయెను. మార్పువల్ల రష్యాదేశమునకు కగిలిన ఫలమేమి? నూటికి డెబ్బదిమందికి తిన కూడును, కట్టబట్టయును, పండ మంచమును, సాపడ కంచమును లభించి నవి. పురుషాకార మప్రతిహతమగు అధికారమును చెల్లించుకొనుచున్నది."

కవిరాజు గారు హేతువాది. అందుచేత నీతివాది "[1]కవిరాజు మతాన్ని నిరాకరించాడు. అస్పృశ్యతను నిరాకరించాడు. మూఢ నమ్మకాలను నిరాక రించాడు. మంత్ర కాండను నిరాకరించాడు. వైదిక స్మృతి పురాణేతిహాసా లన్నిటినీ నిరాకరించాడు. పరలోకాదుల్ని నిరాకరించాడు. మనుషులంతా సమానమన్నాడు. స్త్రీల సమతను ఆదరించాడు. అన్ని విషయాలనూ శాస్త్రీ యంగా పరిశీలించి పరిష్కరించుకోవాలన్నాడు. హేతుదృష్టితో ప్రవర్తించ మన్నారు. చెడ్డను ధైర్యంగా ఎదుర్కొమన్నాడు. ప్రలోభాలకు లొంగి పోరాదన్నాడు. ఒంటరిగానైనా సత్యంకోసం నిలబడమన్నాడు. మానవతకు నైతిక విలువలు ప్రధానమన్నాడు. ఇదంతా హేతువాదమే. మానవవాద మార్గమే? ఇందుకు భిన్నంగా ఆయన ఆలోచించనూ లేదు. అదే ఆయన ఘనత" అన్నారు సుప్రసిద్ధ హేతువాది రావిపూడి వెంకటాద్రిగారు.

ప్రఖ్యాత పత్రికా రచయిత నార్ల వెంకటేశ్వరరావు గారు కవిరాజు గారి తాత్వికతను గురించి యిలా అన్నారు.

[2]"కొత్త భవనాన్ని నిర్మించాలంటే, పాతదాన్ని పడగొట్టాలి, కొత్త ఫిలాసఫీని రూపొందించాలంటే పాతదాన్ని త్రోసిపుచ్చాలి.

మానవ వికాసాన్ని కోరేవారు, సంఘ పురోగతిని కాంక్షించేవారు, నవజీవనాన్ని లక్షించేవారు. ఎవరేమనుకొన్నా సరే, పాతఫిలాసఫీని విమ ర్శించడానికి జంకరు. కొత్త దాన్ని ప్రతిపాదించడానికి వెనుదీయరు. తమనులోకం వెర్రివానికింద జమకట్టవచ్చు, తమపై రాళ్ళు రప్పలను విసర వచ్చు; సంఘ విద్రోహిగా భావించి తమను గొంతు మావడానికే ప్రయత్నించ వచ్చు. వేమనన్ను వెర్రివానిగా లోకం నిరసించలేదా? సోక్రటీస్‌ను సంఘ

1. హేతువాది — జనవరి, 1986.
2. కవిరాజు దర్శనం.

విద్రోహిగా భావించి విషమిచ్చి చంపలేదా ? అయినా, పాత ఫిలాసఫీ స్థానంలో కొత్తదాన్ని ప్రతిష్ఠాపించడం ద్వారా సాంఘిక విప్లవాన్ని సాధించగోరే ధీరులు తమకృషినుంచి చలించరు. దాన్ని విరమించరు. నూటికో కోటికో తలయెత్తే ఇట్టి ధీర వర్గానికి చెందిన వారే రామస్వామి గారు.

''కొత్త సంఘాన్ని నిర్మించుకోవాలంటే ముందుగా కొత్త వేదాంతాన్ని-ఫిలాసఫీని - రూపొందించుకోవాలి. ఈ విషయాన్నే శ్రీ త్రిపురనేని రామస్వామి గారు పదేపదే చెప్పారు. పరి పరి విధాల చెప్పారు. పద్యం ద్వారా ఆయన దీన్ని చెప్పారు పురాణాలద్వారా, ప్రబంధాలద్వారా చెప్పారు. నాటకాలద్వారా, శతకాలద్వారా చెప్పారు. సూత్రాలద్వారా చెప్పారు. భాష్యాల ద్వారా చెప్పారు. సభామంటపాలనుండి చెప్పారు. వివాహ వేదికలనుండి చెప్పారు. సూతాశ్రమం నుంచి చెప్పారు. రాజకీయ శిబిరం నుండి చెప్పారు. హేళనగా చెప్పారు. లాలనగా చెప్పారు. ఆగ్రహపడుతూ చెప్పారు. అనునయిస్తూ చెప్పారు. దీన్ని చెప్పడానికే ఆయన జీవించారు. ఇందు కొరకే మరణించారు''

[1]దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు ''కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి గారిని 'నాస్తికులు,' బ్రాహ్మణద్వేషి'' అని భావించడం పొరపాటు. కుల, మత వివక్షతలు సమసిపోయి, సమతాభావం వ్యాప్తికావడమే వారి ఆశయం'' అన్నారు.

సమతాసిద్ధాంత తత్త్వవేత్తలైన రామస్వామి గారు మహాపురుషులు. మహాపురుషుల జీవితాలు మహోన్నతమైన లక్ష్యాలను గుర్తుజేస్తాయి. మహాపురుషులు వారిజీవితాలు చాలించి కాలగర్భంలో కలిసిపోయేటప్పుడు ఈ కాలమనే ఇసుకతిన్నెలపై వారి అడుగు జాడలను వదలి పోతారు. ఆ అడుగు జాడలను అనుసరించడమే భావి తరాల వారి; కర్తవ్యం.



* * * *



''పుట్టిరి, పెరిగిరి గిట్టిరి
చెట్టులు పదివేలు ! నీవు చేపట్టితి వీ
పుట్టువు చరితార్థంబుగ
గట్టిగ ధర్మంబు కీర్తికాయుడవగుచున్.''

# కవిరాజు జీవిత రేఖలు

| | |
|---|---|
| 51-1-1887 | జననం |
| 15-7-1895 | అక్షరాభ్యాసం |
| 1898 | వివాహం |
| 15-1-1900 | గుడివాడ మిడిల్ స్కూల్లో చదువు |
| 15-1-1905 | బందరు హిందూ హైస్కూల్లో చదువు |
| 1910 | కారెంపూడి కదనం |
| 1910 | మెట్రిక్ పరీక్షలో ఉత్తీర్ణత |
| 1910 | కురుక్షేత్ర సంగ్రామము |
| 8-9-1910 | గోపీచంద్ జననం |
| 1911 | బందరు నోబుల్ కాలేజిలో ప్రవేశం |
| 1911 | అంగలూరులో అష్టావధానం |
| 1912 | శతావధానం |
| 1913 | రాణాప్రతాప్ నాటకం |
| 1-11-1914 | డబ్లిన్‌లో బారెట్లా చదువుటకు ప్రయాణం |
| 1914-17 | కృష్ణా పత్రిక సంపాదకులకు లేఖలు |
| 1-11-1917 | స్వదేశాగమనం |
| 11-11-1917 | బెజవాడలో జరిగిన బ్రాహ్మణేతర మహాసభకు అధ్యక్షత |
| 1917 | బందరులో ప్లీడరు ప్రాక్టీసు |
| 15-1-1920 | సతీమణి పున్నమాంబ కాలధర్మం |
| 1920 | శంబుకవధ |
| 1920 | ద్వితీయ వివాహం |

| | |
|---|---|
| 1920 | విజయవాడలో ప్లీడరు ప్రాక్టీసు |
| 15-6-1922 | తెనాలిలో ప్లీడరు ప్రాక్టిస్ |
| 1-7-1922 | టంగుటూరి కమ్మ మహాజనసభకు అధ్యక్షత |
| 1923 | గోకుల్‌చంద్ జననం |
| 16-8-1924 | పుష్పగిరి పీఠాధిపతులతో వివాదం |
| 5-11-1925-30, 1934-38 | తెనాలి మునిసిపల్ చైర్మన్ |
| 1925 | సూతపురాణం ప్రథమాశ్వాసం |
| 1927 | సూతాశ్రమం స్థాపన |
| 1929 | సూతపురాణం, ద్వితీయాశ్వాసం |
| 4-11-1929 | కవిరాజు బిరుదు |
| 1930 | వివాహవిధి |
| 1930 | కుప్పుసామి శతకం |
| 1932 | సూతపురాణం తృతీయ, చతుర్థ ఆశ్వాసాలు |
| 1932 | రెండవ భార్యా వియోగం |
| 1933 | తృతీయ వివాహం |
| 1-6-1935 | ఖూనీ నాటకం |
| 12-11-1941 | భగవద్గీత |
| 1941 | M.N. Roy సూతాశ్రమ సందర్శన |
| 25, 26-4-1942 | గుడివాడలో గజారోహణోత్సవంతో ఘనంగా సన్మానం |
| 16-1 1943 | కీర్తిశేషులు. |



## KAVIRAJU JEEVITAM – SAHITYAM By SRI T. SUBBA RAO






రచయిత

జననం 1929 జూలై 1వ తేది. తెనాలి, గుంటూరు పట్టణాలలో విద్యాభ్యాసం – 1951వ సంవత్సరంలో ఆంధ్ర విశ్వవిద్యాలయ పట్టభద్రులు – ఆంధ్ర సాహిత్యం మీద ఆజన్మ సిద్ధమైన అభిరుచి-భావవికాస కేంద్రం 'సూతాశ్రమమ్'లో కావ్యాధ్యయనం – ఆంధ్ర సాహిత్యంలోని సొగసులను గురించి అనేక విమర్శనాత్మక వ్యాసాలు–తత్వశాస్త్రం, పరిశోధన, సాహిత్యం వీరి అభిమాన విషయాలు – చిత్తశుద్ధి, అర్థవైమల్యం, నిందారాహిత్యం వీరి రచనలలోని విశిష్టతలు–హేతువాది–సత్యాన్వేషి– ఆంధ్రాంగ్లాలలో నిష్ణాతులు – ఆంధ్రాభ్యుదయం – వ్యాసమంజరి (సాహిత్య వ్యాసాల సంకలనాలు) గోపీచంద్, హరి పురుషోత్తం, కవి సింహ కాశీపతి జీవిత చరిత్రలు–కవిరాజు లేఖలు–డైరీలు (పరిశోధనా గ్రంథం) వీరి రచనలు 70 మంది పండిత కవుల, రచయితల ప్రశంసలందు కొన్నాయి– జీవిత చరిత్ర రచనలో సిద్ధహస్తులు– 'విమర్శకరత్న' బిరుదాంకితులు – కవిబ్రహ్మ ఏటుకూరి వేంకట నరసయ్య సాహితీ జీవితం ముద్రణకు సిద్ధంచేస్తున్నారు– ఆకాశవాణిలో అనేక ప్రసంగాలు–కృతికర్త, కృతిస్వీకర్త–ఆంధ్రప్రదేశ్ సచివాలయంలో ఉప కార్యదర్శిగా (DEPUTY SECRETARY TO GOVERNMENT) పదవీవిరమణ.

చిరునామా :– కవిరాజ సాహితీ సదనమ్ హైదరాబాదు–500 890

Printed at Indian Printing & Binding Works; HYDERABAD-29